





# నాటకాలు

## భక్తి,జ్ఞాన,పురాణ,జానపద

# కుమార సంభవము





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

## ఈ నాటకమునందువచ్చు పాత్రలు

| | | |
|---|---|---|
| (1) | శివుడు | కథానాయకుఁడు |
| (2) | భృంగి | శివునియొక్క వేషక చెలికాఁడు |
| (3) | గజాననుఁడు | శివునికుమారుఁడు |
| (4) | నంది | శివునియొక్క పరిచారకుఁడు |
| (5) | దక్షుడు | శివునియొక్క మామ |
| (6) | తిర్యక్పుండ్రావధానులు | దక్షునిపురోహితులు. |
| (7) | ఊర్ధ్వపుండ్రాచార్యులు | |
| (8) | భృగువు | యజ్ఞము చేయించు ఋషులు |
| (9) | దధీచి | |
| (10) | మహాభూతము | అగ్నికుండములోనుంచి వచ్చిన బ్రాహ్మణశక్తి |
| (11) | ఘంటాకర్ణుఁడు | శివునిభటులు |
| (12) | శంఖమాడుఁడు | |
| (13) | ఇంద్రుఁడు | సురలోకాధిపతి |
| (14) | బృహస్పతి | దేవగురువు |
| (15) | మన్మథుఁడు | శివుని తపోభంగము చేయువాఁడు |
| (16) | మైనాకుడు | హిమవంతుని కుమారుఁడు |
| (17) | బ్రహ్మచారి | శివుఁడు మాయారూపంబుచేఁ బార్వతి చెంతకువచ్చినవాఁడు |
| (18) | శిష్యుడు | భృంగి మాయారూపంబుచే శివునితోఁగూడ వచ్చినవాఁడు |
| (19) | వజ్రనఖుఁడు | శివుని వివాహముభంగపుచ్చఁ దలఁచివచ్చినవాఁడు(తారకాసురమంత్రి |
| (20) | హిమవంతుఁడు | శివుని రెండవమామ, పార్వతితండ్రి |
| (21) | కోలాహలుఁడు | పార్వతి మేనమామ |
| (22) | బ్రహ్మ | శివుని వివాహము చేయించుటకు వచ్చిన యాజ్ఞికుఁడు |
| (23) | విష్ణు | 〃 పెండ్లిపెద్ద |
| (24) | కుండోదరుఁడు | |

| | |
|---|---|
| (25) కాకోటకుఁడు | శివుని పెండ్లి సంగతులు చెప్పుకొన్నవార |
| (26) పుష్పదంతుఁడు | |
| (27) అగ్ని | శివునివీర్యము మోసినవాడు |
| (28) నారదుఁడు | దేవఋషి |
| (29) కుమారస్వామి | శివుని కుమారుఁడు |
| (30) సూత్రధారుడు | కథనడుపువాడు |

## స్త్రీలు

| | |
|---|---|
| (1) నటి | కథనడుపునది |
| (2) సతి | శివుని ప్రథమభార్య |
| (3) ప్రసూతి | దక్షునిభార్య |
| (4) రతి | మన్మథునిభార్య |
| (5) పార్వతి | శివుని రెండవభార్య, హిమవంతునికూఁతు |
| (6) కలవాణి | పార్వతిచెలికత్తెలు |
| (7) నవమాలిక | |
| (8) అజాముఖి | తారకాసురునిసోదరి |
| (9) మేనక | హిమవంతునిభార్య |
| (10) కొఁడసింగి | పార్వతియొద్దకుసోదిచెప్పుటకువచ్చినది |
| (11) ఎఱుకత | కొండసింగిచెలియ |

---







శ్రీసుప్పసుశివాయనమః

# కుమారసంభవము

## అను నాటకము.



( నాంది )

శా. శ్రీమాయాకళనేలి వృత్తిహరుఁడై ప్రేమప్రభావవ్యాప్తిచే
నామాయాకళఁగూడి షణ్ముఖుఁడు నానాకాసురుల్ బుట్టిన
ట్లామోదించియుఁబ్రైసలోక నిజపాదాబ్జేమముల్గాంచిలస
ద్ధామాఢ్యకృతి వారి కిచ్చుచే పురంధాముఁడు సుమ్మేలుతన్.

(నాంద్యంతమున సూత్రధారుండు)

సూత్ర—(నాల్గుప్రక్కలఁ జూచి సంతోషముతో) రంగస్థలమంతట నప్పుడే సర్వమంగళాలంకరణ విచిత్రమైయుండి చిందినట్లున్నది. యహోహో! (ఎదుటఁ జూచి యాశ్చర్యము సూచించుచు)

తన్వీవృత్తము

కూరిమితో నీసరసులు సభకుంగూడిరి వేఁడిరి కనవిసముమ్మర
భారము లేదీ పని మనకిపుడే పాడఁగ నాడఁగఁగల రలపాత్ర
ధీరులు వీరీతరి సరియనుచు న్నేవక పోవక కనివిని చిత్రా
కారులు వేకాఁగలరనితలతుల్ గానము పానము మధురిఁగాదే.

బంధుర వృత్తము

నవరస పరిచయపరిణతి మతులీ సమసభాసుజనుల్జనతా
శ్రవణమధులహరి పదతతిరచనా సారులు ధీరులు పాత్రములు
న్నవనవకుతుకము లవిరళమగు మన్నాటక దర్శనశీలురకుం
దవిలి దినదినముఁ గనుఁగొనభళిరే నాదుప్రయత్నమదిట్టిదకా.

కరిబృంహిత వృత్తము

వీరె సరసులు వీరి వెనుకొని వీరివలెబలె వీరులే
శూరు లలరసశూరు లలకవిశూరు లలధనశూరులీ
భూరిగుణు లలభూమిపతు లలభూతదయు లలభోగులే
పోరుఁబోసఁగక పోరుననిచటఁబోల విడసిరి యీసభన్.

(పరిక్రమించి)

చ. రసికులు వీరెనల్గడల రంజిలుచు న్సభదీర్చినిండి రు
ల్లసిత రసప్రదర్శకులు లాస్యలయాభినయాభిశస్యులై
యసదృశకంఠగానమనురాక్తులై శుభవేషధారులై
రస మసమానలీల లలరన్నొలపించఁగనున్న వారిటన్.

(కొంచెము విమర్శించి) నాహృదయము సభావర్ణనమందే పరిణమించి సభారంజనము మఱచినట్లున్నది. నా ప్రియురాలు ఇంగితశాలిక యింక రాకున్నయది. (తెర వంకఁ జూచి) నటీ! (మఱల) నర్తకీ! (మఱల) లాసికా!

తెరలో

చ. జనకునిజూడఁబోయినది చయ్యన వచ్చునొ రాదొ జాఁడయే
కనమిఁక దానియాస మదిఁ గ్రుంగొనకేప్రు మఱొక త్రోవని
మనసున కోపినట్టు లనుమానముఁబెట్టక చూచికొమ్ము ముం
దనయము మేలుగల్గునటు లాబుధవర్గము మెచ్చునట్లుగన్.

సూత్ర—(స్వగతము) ఆఁడుదానికింత స్వాతంత్ర్య ప్రవర్తనముండిన నదేమి ముందరకువచ్చును. తనతండ్రి ప్రతిముచేయునఁట; పోఁబోయినదఁట. వచ్చినంతదూరము వద్దువద్దని చెప్పిచెప్పి నా ప్రాణము పిసికినది. (ఆకాశమువంక లక్ష్యమునిల్పి) ఇఁక లేనిదానిలోనే జతి. ఇంకేమినాటకము. నాఁటి నాఁటకమైనవాఁడు తలయెత్తి దిరుగుటకంటె సర్వపరిత్యాగము చేసి ముక్కుబిగికొని కూర్చుంట మేలుసుమా! (పరిక్రమించి హస్తములఁజూచి) యిటువంటి బుధాగ్రగణ్యుల నానందపెట్టుట దుర్లభము. (కొంచెమాలోచించి) ఛీ! నాకేమియు నక్కఱలేదు. (ఒకచోటఁ గూలబడి మౌనముఁ జూపును.)

(నటీప్రవేశము)

నటి—ఆర్యా! యిదిగో యిక్కడనే యున్నాను.

సూత్ర—(యోగివలె కదలకుండుట)

నటి—(స్వగతము) యోగమా! వియోగమా! ప్రయోగమా! అపయోగమా! ఉపయోగమా! చాలుఁజాలు నిట్టినిష్కారణవృత్తిలో నేనేల. (నిష్క్రమించఁబోవుట)

సూత్ర—(దిగ్గునలేచిచూచి స్వగతము) ఎవతెరయో! సంగీత శారిక కానట్లున్న యది. (ప్రకాశము) నటీ! యేమే నటీ! (శీఘ్రగమనంబునఁబోయి నటిహస్తంబుఁ బట్టుకొని తీసుకొనివచ్చుట)

నటి—(నవ్వి) తిక్క తిరిగినదా ?

సూత్ర—తిక్క కాదు. నీ వేషముమీఁద పూర్వాభిప్రాయము మారిపోవుటంజేసి నిన్నానవాలు పట్టలేక పోతిని.

నటి—అదియు యదార్థమే.

సూత్ర—ప్రేయసీ! యింతయాలస్యమేఁటికి ?

నటి—ఆలస్యమా! మీకెప్పుడూ మఱపే. అనల్పసంతానులగు మనవారి యైశ్వర్యంబులకు జాతిసంక్రమణక్రియుం జెప్పుడు మెంపగుట మనవారందఱు మన పుత్త్రస్థానముఁ బరీక్షించి మనకొక్క కుమారుండు శక్తిమంతుండై పుట్టుననియు, వాఁడే తమకు దౌహిత్రుఁడయి భయనివారణము చేయఁగలఁడనియు జాతకఫలం బనుకొను చుండుట విని మనసున నుప్పొంగుచు వచ్చితి నిదే యాలస్యము.

సూత్ర—ఈమాఁట నాకిదివఱకే తెలియును.

నటి—నే నంతమాత్రము నోచికొంటినా ?

సూత్ర—మన కీ సంవాద మెప్పుడు నున్నదే. (స్మృతినభినయించి) (స్వగతము) అరే! అనుకొన్న దొకఁటి యైనదొకఁటి. వచ్చినదొకటి. చేయునదొకఁటి (ప్రకాశము) ప్రేయసీ! అటుచూడు. సుమనఃప్రవరులందఱు నీతీరుగా మనవలన రసగ్రహణము సేయఁగోరి నిరీక్షించుచున్నారు. సకల సామాజికరంజకముగా నీ మధురకంఠగానము కొంచెము సేయుము.

నటి—పాఁటకేమి ? నోఁటిలోనున్నదే కాని మన మనుకొన్నట్లు ప్రదర్శనము చేయుటకు నేదైన పేరువెట్టితివా !

సూత్ర—ఇంతవరకు నిదమిద్ధ మనుకొనలేదు. నీ సంగీతము కానిచ్చు నంతలోపల నాలోచించెద.

నటి—ఋతువేది యిప్పు డధికరింపఁదగును ?

సూత్ర—ముద్దరాలా! స్రోతస్మార్తకర్మారంభ పవిత్రమైన యీవర్తమాన కాల మెఱుఁగవా!

నటి—తెలసె. తెలసె. మనకన్నిఁటను భాగ్యమేకదా! సర్వజనరంజకముగాఁ బాఁడుచున్నా నిదిగో.

చ. తరుణ వితాన హారి పరధామకథా పరిహారి వైఖరీ
తరులతికానుబద్ధచలిత ప్రసవాదరణీయ ధోరణీ
సురభిమరుత్ప్రచార పరిశుభ్రములై శుభవాసర ప్రభ
ల్పరభృత సుప్రసంగముల భాసిలుచుండెడి కాలమియ్యెడన్.

సూత్ర—అహాహా! నటీ! నీ వాక్చాతుర్యము గూడ సజ్జన హృదయానురంజనమై యపూర్వముగనున్నది. యేదీ యింకొకమారు.

నటి—(మరల నదే గానముచేసి) ఆర్యపుత్రా! ముందటి యాలోచన ముడిపడినదా!

సూత్ర—ఆ! గానకీన మధురగానామృతపానపారవశ్యము మఱల నన్నుఁ బెడత్రోవఁ బెట్టకుండిన జ్ఞప్తికిఁ దెచ్చినావే. చంకను బిడ్డనెత్తుకొని యూరెల్లఁ వెదకినట్లు వేగ యాలోచింపనేల. మన ప్రసంగమంతయును మనము కలసినప్పటినుండియుఁ బుత్రోత్సవమే ముఖ్యముగా సూచించుచున్నదిగదా! తత్రసాక్షిగా నీముఖారవిందమునం బ్రసరించిన కృపావాణీతిమిరాంతలహరులోఁ గుమారసంభవము మన ప్రదర్శన నైపుణ్యముతోడ డిండీరాయమానమై స్ఫురించుచున్నది. మరొకమాఱు చూడుము. ఈయున్నవారందఱు కుమారసంభవంబు కావలెనని కోరువారలే. మనము దానినే ప్రదర్శింతము.

నటి—ఆర్యపుత్రా! ప్రసంగవశంబున నాకొంటిమిగాని యట్టినాటకమున్నదా?

సూత్ర—(స్మృతి నభినయించి) ఉండు ఉండు. నోటనాడుచున్నయది. (కన్నులు మూయుచుఁ దెఱచుచు నాకాశప్రశ్నము నభినయించి)! జ్ఞప్తికివచ్చినది. మనము కృతార్థులము.

నటి—(నవ్వుచు నుల్లాసముతో) ఏదది! ఏదది!

సూత్ర—మన మనుకొన్నదే.

నటి—నిజముగా నాటకమా!

సూత్ర—ఏమినాటకమా! నాటకరత్నము.

నటి—కృతికర్త యెవరో! మనపాలిటి పుణ్యాత్ముఁడు.

సూత్ర—నటీ! యున్నమాట యంటివి. విను.

సీ. కాశీనవద్వీప దేశంబులందుండి
యిరువది వర్షంబు లేకరీతి
తర్క వేదాంతాది తంత్రంబు లారింటి
తుదకంటఁజదివి తా ముదముతోడ
పుడమి రాజాస్థానములలోని వాదక
ష్ఠులఁదాన గెలచి దిగ్జయములలర
తనకీర్తిమండలం బనయంబు ధరణికి
శ్వేతాతపత్రమై చెలువమెసఁగ

తే. గీ. కర మనుగమభట్టాచార్య బిరుదనామ
మొందు కురుగంటి వేంకటరామశాస్త్రి

కేసరికిం బౌతుఁ డంతటి కీర్తి నిలుపు
కొన్న యప్పయశాస్త్రికిం గన్నసుతుఁడు.

ఉ. శ్రీయుత నూజవీడ్పురిఁ బ్రసిద్ధికి నెక్కిన సత్కవీంద్రుఁడ
త్యాయతధీచమత్కృతకళాఢ్యుఁడు శ్రీగురుగంటి సూర్యనా
రాయణశాస్త్రిశర్మ మధురగ్రథనంబు లద్రష్టపూర్వము
ల్వ్రాయఁ గుమారసంభవము వ్రాసెను గ్రొత్తగ నాటకంబుగన్.

నటి—క్రొత్తదా?

సూత్ర—క్రొత్తదేగాదు. తొల్లి సంస్కృతంబున శ్రావ్యప్రబంధముగానున్నది. ఇపు డాంధ్రమున దృశ్యప్రబంధముగా రూపాంతరము గైకొన్నది. వస్తువదేకాని వర్ణితాంశంబు లపూర్వ రమణీయములు సుమా! కాలానుసారముగా నభినవారంభములే యధికరుచ్యములు.

నటి—ఏదీ దాని రామణీయకము?

సూత్ర—విను

సీ. లక్షణ యుక్తమై లలితార్థసందర్భ
ముల నిర్భరానందముల నొసంగు
కలితమంజుల పదగ్రథన సంపదలచే
జనకర్ణములు రసాయనము చిలుకు
జనగేయకమనీయ ఘనవృత్తమహనీయ
శుచిపాకములచేత రుచులు దెలుపు
నవరసంబుల బొల్చు నవశయ్యలను గొల్చు
సరసులకెంతొ విశ్రాంతు లొదవు

తే. గీ. ప్రథితసత్కీర్తి గురుగంటి వంశ రత్న
సూర్యనారాయణాహ్వయ సూరిరచిత
సరసనాటకము కుమారసంభవంబు
చూడవలెనన్న దీని నే చూడవలయు.

నటి—ఆర్యపుత్రా! అంతరసవంతమైన వస్తువును బ్రదర్శించిన మనకు మహా గౌరవము కాదా!

కవి కిందలి ప్రయత్నము స్వోత్సాహమూలమా! పరోత్సాహమూలమా!

సూత్ర—రెండును.

నటి—రెండు నెట్లు ?

సూత్ర—ఇంక నీ వెఱుఁగవా ?

(పంచపాది)

ఉ. శ్రీకర ధీవిలాస పరిశీలితతార్క్యకళావినోది ని
ర్భీకసమర్థితాత్మ మహీభృద్వ్యవహారయశోభిశోభి నా
ళీకముఖాశ్రితార్థ సఫలీకరణవ్రతుఁ డబ్ధిధీరుఁడ
వ్యాకులనాటకాంత కవితావహితానఘమూర్తి వారణా
శీకుల రామమూర్తి శుభశీలుఁడు సాధుసువిధేయుఁడై.

మ. భువిఁ దారేడుగు రన్నదమ్ములుగఁ జెన్మొంగంగసంకిష్ఠ ప్రాఁ
భవమొప్పం గడఁగొట్టుఁదమ్ముఁడగు సుబ్రహ్మణ్యనాముండు ధ
ర్మవిధిం జెజ్జ్యధికారమేల నిజదాంపత్యానుకూల్యంబు నై
భవ మొందింప సదాకుటుంబసుఖ సంపద్భోగ సంపన్నుఁడై.

ఉ. నారయ యప్పరావు నరనాథునకిమ్ముగఁ గార్యదర్శియై
ధీరత నీప్రబంధమును దిన్నఁగ నచ్చునఁ గూరిపించి పో
ల్పారఁగ నెల్లెడం దన కృతార్థత గన్పడునట్లు లిక్కవిం
గారవమొందఁజూచి యుపకారమొనర్చెఁ బ్రసిద్ధమాగతిన్.

వ॥ ఇదంతయు మనబోఁటి ప్రదర్శకుల సుకృత పరిపాకముసుమా!

(తెఱలో)

మ. ఖలుఁ డాదక్షుఁడు నాయెడం బటుతర క్రౌర్యంబుతోనున్న వాఁ
డలఘుస్పర్ధలు వృద్ధిగొల్పఁగల దుష్టాత్ముండు నీతండ్రి ని
న్నలుకంజూడఁడె చిన్నపుచ్చుఁడఁటె నిన్నచ్చోటికింబంప నిం
పలరంబిల్చిన నాఁడు పంపుదును నిన్నందాఁకఁ బంపింతునే.

సూత్ర—(భయముతో) నటీ! యిఁక మన మిక్కడ నుండరాదు. శివుఁడు దాక్షాయణితో నెందుకో వాగ్వాదములాఁడుచు రౌద్రాకారుఁడై వచ్చుచున్నట్లున్న వాఁడు. భార్యాభర్తల కలహసమయంబులో మన మేల ? అనంతర కరణీయమునకుఁ బోదము.

(యిద్దరు నిష్క్రమింతురు)

ప్ర స్తా వ న

---

# ప్రథమాఙ్కము

## ప్రథమ రంగము.

### కైలాసము సీన్.

ప్రవేశము— శివుఁడు, సతీదేవి, సపరివారము.

**శివుఁడు**—(ఆగ్రహముతో)

ఉ. మున్నొకనాఁడు దక్షుఁడతిమూర్ఖుఁడు నీజనకుండువచ్చి నా
సన్నిధినిల్చి నాజపవశంబున లోననె మ్రొక్కియున్న నా
సన్న యెఱుంగలేక ననుజాలఁగదూఱుచు లేచిపోయె నా
చన్నదియాదిగా నతఁడు శత్రుతఁజూపుచు నున్నవాఁడొగిన్.

ఎన్నఁటికైన నీతండ్రివచ్చి మర్యాదగాఁబిల్చినా యప్పుఁడు చెప్పెద.

**సతి**—శ్వశురులు మాతాపితృలకైవడిఁ బూజనీయులుగదా! వారితోఁ గక్ష సాధింపనేటికి ?

**శివుఁడు**—

మ. ఖలుఁడాదక్షుఁడు నాయెడం బటుతర క్రౌర్యంబుతో నున్న వాఁ
డలఘుస్పర్ధలు వృద్ధిగొల్పఁగల గుప్తాత్ముండు నీతండ్రి ని
న్నలుకంజూడఁడె చిన్నపుచ్చుఁడెను నిన్నచ్చోటికింబంప నిం
పలరం బిల్చిననాఁడు పంపుగను నిన్నందాక బంపింతునే.

**సతి**—నాథా! మా యక్కచెల్లెండ్రందఱిలోన నాయందే మాతండ్రి చిన్ననాఁట నుండియుఁ బ్రేమాతిశయము. చూచి చిరకాలమాయె. మీతోఁగూడఁ బోయి చూచి రావలయునని నామనోరథము.

**శివుఁడు**—సతీ! యిది సమయముకాదు.

**సతి**—దేవా! మనకు వేర సమయమేఁటికి ? మనము వాకిఁటకుఁ బోవుటయే వారికిఁ బండువ.

**శివుఁడు**—(ఆగ్రహముతో) యిట్టిరిత్తభ్రమలేల! చెప్పినమాఁట గ్రహింపవేల?

**సతి**—నాథా! గ్రహింపకేమి ? యిచ్చినచోటఁ దెచ్చినచోటఁ గలఁతఁ బెంచఁవచ్చునా!

[ భృంగి ప్రవేశించుట ]

శివుఁడు—(భృంగితో) ఏమిరా! సమాచారము.

భృంగి—దేవా! దక్షప్రజాపతి జన్నంబుఁ దలపెట్టెనఁట. అదియు నేఁడే యఁట. బృందారకుల నెల్లర నాహ్వానంబుఁ జేసెనఁట; వారందఱు నయ్యజ్ఞంబునకుఁ బోవుచున్నారు. మన మెప్పుడు!

శివుఁడు—మన కాహ్వాన మేలేదు. కానఁ బోఁజనదు.

భృంగి—దేవా! "అనాహూతోఽధ్వరం గచ్ఛేత్తు"ని యజ్ఞముఁ జూడఁబోవుటకుఁ బిలువనేల ?

శివుఁడు—అరే! అది బంధువిషయము కాదు. ప్రతి కార్యమందు ముఖ్యబంధువుల సమావేశమునకు మర్యాదాపూర్వకాహ్వానమే ముఖ్యము సుమా!

భృంగి—అయ్యో! అమ్మగారు జన్మగృహంబున నియ్యేఁడు దినంబులుఁ బక్వాన్నంబులు దొఱకు ననకొంటిఁగదా. (సిగ్గు నభినయించుచుఁ బరిక్రమించును)

సతి—దేవా! మనప్రసంగమున కనుకూలముగా మా జనకుని యజ్ఞసమయము కూఁడఁ గాకతాళీయముగ నైవచ్చె బళా!

శివుఁడు—అవును. మనము పోఁ దగినవారమా! తన యింటికార్యమున కందఱిని బిలిచినవాఁడు మనల నేల పిలువఁడు?

నంది—స్వామీ! దక్షప్రజాపతి తొల్లి మీయొద్దకు రానున్నవాఁడా!

సతి—(నందితో)

ఉ. అల్లుని కత్తవారలగు నప్పటికప్పటి కేమొగాని సం
ఫుల్లము గాక మానసము పూర్వులఁ జూచిన నవ్వఁదోచుఁగా

నంది—జననీ! సత్యమెకాని వినుఁ.

అల్లుని కత్తమామ లెపుడైనను గూరిమి వంగియుండఁగా
నెల్లుఁగదా సమస్తము నిషేధముఁ జేసె నతండు మిమ్ములన్.

శివుఁడు—

ఉ. కూఁతును నాకు నిచ్చెనని కోరిక లీరికలెత్త వాని సం
గాఁతము గూఁడి నా కిఁటను గావలియుండిన మామ పొంగెడిన్

సతి—

నీతి మెఱుంగఁడా యతఁడు నేర్పు చమత్కృతిగాని వారిపైఁ
బ్రీతినిఁజూప మీకుఁ దగు వేరయతం డరుదేరఁ దీరునా.

అడ్డఁ దలఁచుకొన్నచోఁ గారణము లనేకములు. నావంటి యాఁడుపుట్టువకట్టి రూపిక యుండునా!

చ. పతి కనుకూలయైనఁ దనపైఁ బతి కెంతటి మోహ మున్ననుం
　బతిపఁడు నెప్పుడుం దనకు మక్కువ యెక్కువయౌచు నున్న సం
　తత వివిధోపభోగములు దప్పక చొచ్చినచోఁట నున్న నా
　యతముగ నాఁడు పుట్టు విటు లాసపడుంజుడి పుట్టినింటికిన్.

శివుఁడు—అవును.

చ. కలికి నిజంబయౌఁడి తధికారులకంటికి లాఁతివారు ము
　న్జెలిమి గల్గివారయినఁ శ్రీములు దోమలు గారె యక్కటా
　కలిగినయంతె చాలునని కాల ముఱింగి తొలంగియున్న వాఁ
　డలజడిఁ జెందనేరఁడుగ దాత గదా తగి రాని దెప్పఁడున్.

అవును నీ యన్నట్టు కొంత స్వల్పాధికారము చేఁతికిఁ జిక్కుటంజేసియే మదోన్మత్తుండై క్రిందు మీఁదుఁ గానకున్నవాఁడు.

చ. కలికిరో రాకరాక యధికార మొకించుక వచ్చినంతలో
　పలనె మదంబుచే విఱుగఁబాఁటుతనంబును జేర్చి పిన్న పె
　ద్దలయెడ లక్ష్యముంచక స్వతంత్రకుతంత్రములం బ్రవీణులై
　మలపలు గొంద ఘోర నవిమంత్రపుఁగల్మిఁ దొలంగకుందురే.

నీ తండ్రివంటివారు లోకమందనేకులున్నారు. వినుము.

చ. పలుకరు పల్కరించరు కృపారతిఁ బారరు నోఁతిలోని క
　ప్పలువలె భారిమొల్లఁ దమపై దనుకొంచిడు లోకమంచు లో
　కుల నులికించుచుందు రొకకొందఱు నీచు లొకింత పెత్తనం
　బలవడఁగానె యహంకార తిరమాంపరమార్ధ మెఱుంగ రేమియున్.

ఛీ! నీతండ్రిపేరు స్మరింపరాదు. యిదియే నాకు శిరచ్ఛేదం బనుకొన్నవాఁడు.

సతి—

ఉ. బంధువులన్నఁ గార్యములపట్లను బిల్వక పోయినం దయా
　బంధురశీలురై యరిగి భారముఁబూని చేయువారె బ
　ల్బంధులుగాని యన్యులొకబంధువులా భువిలోఁ దృణావృతా
　బంధువులందృగాక ప్రతిబంధము లెంచకు పోదమిత్తరిన్.

మా తండ్రికిబదులు నేను పిలుచుచున్నాను. సరిగదా.

శివుఁడు—(క్రోధముతో) కానిపట్టు పట్టితివా? నీవు నీ తండ్రితోపాఁటి దానవే!

సతి—(కన్నీ రొత్తుకొనుచు) అక్కటని జూచిరా నియ్యకొనుడు.

శివుఁడు—నన్నడిగితివిగాన నది నాయభీష్టముగాదు.

చ. వల దట నీవు పోవలదు వచ్చిన వైరము రానె వచ్చెఁ గో
మలి యటఁబోవనిన్ను నవమానముఁ జేయక మానఁ డక్కటా

సతి—

వలదను టేమి నాయమిటు వంచనమైన మహేమియైనఁ బో
వలెనను కొంటి నన్నయినఁ బంపుము సొంపుగఁ జూచివచ్చెదన్.

శివుఁడు—(ముఖముఁ ద్రిప్పుకొని స్వగతము) స్త్రీయనఁగా శక్తిస్వరూపము. వేధించుటే దీనిపని. (పనియుడుఁగు లవతలకుఁబోయి లక్ష్యమునీఁదికిఁ బెట్టి)

ఉ. వంశముఁ జూచి పిల్ల నెటువంటిదియైన గ్రహింపవచ్చుఁ ద
ద్వంశముఁ బారఁ జూడకయె వారిజనేత్రను దెచ్చికొన్న చో
వంశము నైనఁ జూడక దిభర్తకు నిక్కెదురాఁడ నేర్చి స
ర్వాంశములందుఁ దోఁచనియదయ్యయొ నాకిదియేలవచ్చెనో.

ఎందుకు నాఁడుదాని నర్ధభాగము నెక్కించుకొనుట నాదే బుద్ధిజాడ్యము.

చ. తగువిధి లోకమందహహ తత్వ మెఱుంగని నిన్ను బోంట్లకి
మ్ముగ నిటు లాఁడువాండ్ర నెడి పుత్తడిపూసిన కాలిసంకెళు
ల్దగిలిచినాఁడు గాలటు గదల్పఁగలే నటుకాఁ గ నెప్పుడుం
దగదిటు స్త్రీలకుం జనువు నాకిపుఁడంతయు దృష్టమే కదా.

చ. తిటిచియు జీరలున్నగలు దెమ్మనిదె మ్మనిదెమ్మటంచు నే
ర్పెఱచును జేసికొన్నమగవానికి హాయియొకింతయైనఁ జే
కుఱనియదార యొంచిఱుకొంత లెనాఁతివి పూఁతిగుండె లె
త్తెఱుగునఁ జూచిన న్మగఁడు దీనికిఁ దాఁ జనువీయుఁగూఁడునే.

అందు.

మ. కలవాఁడైన భరింపఁజాలఁ డబల న్గయ్యాళి యౌనేనిఁ దో
య్యలిదయ్యాల్గొనినట్లు వెంటఁబడి కయ్యాలెత్తు నెయ్యంపుఁబో
కల నొన్నన్నది కాదటంచు మఱియుం గాదన్న గౌనంచు ని
చ్చలు వేధించుఁగదా పురాకృతఫలస్వాత్వంబు నిష్ఠాఁజుమీ.

[ గజాననుఁడు ప్రవేశించుట ]

(క్రోధ విచారంబులతోఁ గొంచెము దూరముగాఁ బోవును.)

గజా—(తల్లిం జూచి)

శా. తల్లీ నీవిఁక మోమువాంచి కడుఁజింతాక్రాంతవై తేలనే
సల్లాపంబులు మానినావు నవబాష్పస్యందముల్గోఁట సం
ధిల్లం గీచివిదల్చి యేడ్చెదవు సందిగ్ధంబుగాఁ దండ్రి చిం
తిల్లంజొచ్చెఁ బరాఙ్ముఖుండవుచు దీనింజెప్పుమా మూలముల్.

(అని తల్లి తొడపైఁగూర్చుని హస్తములు గ్రహించుట)

సతి—కుమారా! యేమిసేతము. నీ మాతామహుండు యజ్ఞంబు జేయుచున్నవాఁడఁట. మీతండ్రికి వానికిఁ బూర్వంపు మనస్పర్థ యేమో కలదఁట. మీతండ్రి నేమో పిలువలేదఁట. మనయుదక్కఁ దక్కిన లోకములలోని వారంద ఱయ్యజ్ఞంబునకుఁ బోవుచున్నవారు. మనలఁ బిలువనేఁటికిఁ గోపదమనిన మీతండ్రి వలదనె. నన్నయినఁ బోయిరానీయఁడఁట. కినిసి యటుచనినాఁడు. వత్సా! పుట్టినింటి వేడుకలు కండ్లఁజూడ నోఁచనైతిఁగదా!

గజా.—జననీ! వగఁజెందకుము. నేనడిగి యానతిఁగొందును రమ్ము. (తల్లితోఁ గూడఁ ముందుకు నడచి తండ్రి హస్తమును బట్టుకొని) తండ్రీ!

ఉ. జన్మముఁజూడఁ బంపవఁట చంద్రకళాధర మీకుమీకు నే
మున్నను మాకదేమి యజనోత్సవమంతయుఁ గండ్లఁజూచి మా
చన్న తెలుంగు నేమఁగలి చక్కఁగ వస్తువు నన్ను నంబను
న్నిన్నకఁ గానిమ్ము గ్రహమేధు లోకించుక వచ్చునట్లు గిన్.

శివుఁడు—

చ. తగవు నెఱుంగ వోరి సగతప్పని తావుకుఁ బోవరాదు ర

గజా—

పగ మనకేమి సేయు మగవానికి నొక్కఁడు గాసి సేయునే

శివుఁడు—

తగవరి కానిపోనిది కదల్పఁడు దల్పఁడు దాని దిద్దఁగా

గజా—

తగదని యూరకున్నఁ దన తాలిమి మాలిమి యెట్లుఁ దెల్లమా.

శివుఁడు—

చ. పగతుల నమ్మి పొత్తులు పామునఁగోఁ జెలగాంటలే సుమీ

గజా—

పగవిడి పోవుఁ దండ్రి చోటఁ బాటి నటించిన నెట్టివారికిన్

శివుఁడు—

బాగరు విశేషమౌ మనము ముచ్చట కేగినఁ దుచ్ఛకోటికిన్

గజా—

భగభగమంచు నట్టిఖలుఁ బట్టినఁ బట్టఁగవచ్చు నప్పుడే.

సతి—దేవా! విసికించితినని నాయందలి ప్రేమముఁ దప్పించవలదు.

క. కుడువను గట్టను మునువను
వడి నరుగుచు యజ్ఞవైభవము గన్నులకు
న్గోడవుగ జూచియు వెంటనె
వెడలెద నీకడకు దేవవిశ్రుతలీలన్.

కుమారునిఁ జంకఁబెట్టుకొని చిత్తంబు భవదీయ పాదారవింద ధ్యానాయత్తంబుఁ జేసికొనుచుఁ బోయివచ్చెద నానతిండు.

శివుఁడు—(నందివంకఁ జూచుట)

నంది—

మ. శివదేవా! యిఁక నూరకుండుఁడు గృహచ్ఛిద్రంబు లోలోననుం
చవలెంగాని ద్విరుక్తవాక్యముల రచ్చం బెట్టరా దింతకున్
భవదంగీకరణంబె కోరినది యంబ న్బోయిరానింపు నై
భవముంజూడఁగఁదోడు పంపుము నిజాప్తశ్రేణిఁ బూఁబోఁడికిన్.

భృంగి—స్వామీ! ప్రథమమునుండియు నే నడుగుచున్నవాఁడనే! వీరి ప్రయాణం బర్ధాంగీకారమైనట్లున్నది. నామాఁట మరువవలదు సుమా!

శివుఁడు—(పైనఁ జూచి) అహాహా! నా పంతము తుదముట్టునటుల లేదు. (కొంచ మాలోచించి)

క. సతియొక్కర్తె సుతుఁ డొక్కఁడు
మతిఁ దోచఁగనీరు వీరు మఱిమఱి నాకే
మితిలేని సతులు సుతులొక
పతికిని గలరేని వాని బ్రతుకేమగునో.

(నందివంకఁ జూచి) నందీ! నీవును భృంగియు గజాననుఁడు మువ్వురును దాక్షాయణికిఁ బారిపార్శ్వకులై నడువుఁడు. (నిష్క్రమించును.)

సతి—నందీ! నాకేమియు భయములేదు గాని స్వామి యాజ్ఞానుసారముగా రండు పోదము. (భృంగితో)

మ. భవనప్రాంగణమందె ముందెనురు మావారందరే తెంతురా
హావలీలై కని మాపణోత్సవము లాహా! కంటిమెన్నాళ్లకుర్
(గజాననునితో)
అవురా పుత్రిక పోవఁగానె యట నీయమ్మమ్మ నీతాత బ
ల్లవమోహంబున నిన్ను నెత్తుకొని యన్నాయందురింపొందఁగన్.

గజా—(సంతోషముతో)

క. పిన్నమ్మలు పెద్దమ్మలు
మున్నుగ నమ్మమ్మ నన్ను ముద్దాలెసంగన్
గన్నులను సద్దికొందురు
హెూన్నుగ నేఁ దినుదు నచట నుండ్రాల్లుడుముల్.

భృంగి—(ఉల్లాసముతో గంతులు వేయుచు)

ధృవకోకిలావృత్తము

రసికులెందఱో వత్తు రిత్తరి ♦ రక్తిమీరఁగ వారితో
వెసఁ బ్రసంగము లాచరింతును ♦ వెఱ్ఱిచర్యలఁ జూపుదున్
బొసగ షడ్రసభాజనంబుగ ♦ భోజనంబులు మెక్కుచున్
మసల కక్కడఁ బోరుపుట్టిన ♦ మానినైన కనివచ్చెదన్.

నంది—(సతితో) జనని! అక్కడ బ్రహ్మాదులు, ముకుందపురందరారవిందాసన ప్రముఖ బర్హిర్ముఖులు, నిండియుందురు. నిండిన యా సభామధ్యంబున మీతండ్రి యెడ నెట్టి యుపేక్షా స్వభావంబు గనుపించినను గిరుక్కున నీవు మఱలిరావలెను సుమీ!

సతి—నందీ! అచ్చట సందర్భానుసారంబుగాఁ జూచుకొందము. ఆలస్యమేల రండు.

(అందరు నిష్క్రమించుట)

---

## ద్వితీయ రంగము

### రాజగృహము

ప్రవేశము:— దక్షుఁడు, ప్రసూతి

దక్షుఁడు—(కూర్చుని) కష్టము! కష్టము! ఆఁడుపిల్లలు పుట్టినవాని కన్నివిధములఁ గష్టములే !

సీ. పదివర్షములుఁ బెంచి పడఁతి నిచ్చినమామ
    గడప కేఁగినఁ జూచుఁ బెడసరముగ
కూఁతు నంపుమఁటన్నఁ గూఁడి రారమ్మన్న
    నౌను గాదనక తా నలుసు సేయు
నడనడ నెన్నియో నడవళ్ళు నడపిన
    నెప్పటివప్పుడే యీసడించు
మగసంతు లేనట్టి మామ సొత్తుల కాస
    పడుఁగాని చోటబాటే పనులు గొనఁడు

తే. పురుషుఁడత్తింటి యల్లుఁడై పొగరుమిగులు
నొక్కకూఁతురు పుట్టినె నొక్కబిగువు
గోయవలెనన్న జననీతి కుదిరె మనకు
నాఁడుపిల్లలు గలవాండ్ర మైతిమకట !

ప్రసూతి—నాథా ! ఆఁడుపిల్లలదే వైభవము.

దక్షుఁడు—అగును. మనయందా న్యాయము పట్టలేదు.

ప్రసూతి—ఎందుకు ?

దక్షుఁడు—మన యల్లుళ్ళలో నొక్కఁడు విషకంఠుఁడు. విషమాక్షుఁడు. వానికి మితిలేని సర్వజ్ఞత్వము. తక్కినవారును మనకు వశ్యులుగారు. ఛీ! అసహ్యము.

ప్రసూతి—(వినయముతో) వారికాళ్ళు గడఁగి శిరసునఁ జల్లుకొన్నప్పుడు మనకభిమాన మేలా ?

దక్షుఁడు—(తీవ్రముగా) బుద్ధిలోపమదే! యిరువదేడ్వుర కూఁతులను కళంకముతో నుండిన యా క్షయరోగఁపువాని కంటఁగట్టితిమి. కడఁగొట్టు కూఁతుని గాటికాఁపరియగు బూఁచులయేకిమీనికిఁ జూచుచునే దారఁబోసితిమి. వాఁడు కట్టుఁబోగరుపోఁతై తన తోఁడియల్లునిగూఁడ శిరసునఁ బెట్టుకొని "తాఁజెడిన కోఁతి వనమెల్లఁ జెఱచె" నన్నట్లు చేసినాఁడు. ఛీ! ఛీ! వానిని దలఁచనక్కరలేదు.

ప్రసూతి—నాథా! వారిచెయిమీఁద మనచెయ్యిక్రిందు. మనకే తగ్గియుండుటవిధి.

చ. పగయొకప్రక్కనున్నఁ దన బంధులఁ బిల్వఁగఁబోలుఁ గార్యపుం
దగవులఁ బిల్వకుండుటయె తప్పగుఁ బిల్చిన రామి వారిదే
తగమినెఱింగి యెప్పుడును దప్పకొనం దగువాఁడె ధన్యుఁడౌ
నగవరచాపునిం బిలువనంపుము వచ్చిన రాకపోయినన్.

దక్షుఁడు—ఆహాహా! యేమి చక్కగాఁ దీర్చినావు.

తే. పిలచి మర్యాదలొనరించ వేలకొలఁది
గలరు వీఁడేల గుణహీనుఁ డలసుఁడిపుడు
కూఁతునిచ్చిన యానాఁడె కోర్కెచెల్లెఁ
జాలు నిఁక వానిరాకలు చాలుఁజాలు.

నీ వెర్రియాలోచనలు మాను.

ప్రసూతి—

చ. శివుఁడు శివుండనంగ శుభశీలుఁడు నమ్మినవారి కెప్పుడు
న్నవనవ కార్యసిద్ధులను నర్మిలినింపెడివాఁడు రాఁదగున్

దక్షుఁడు—

కవనము వే...వన్నియును గాఢగుణుండు దమోమయుండు వా
స్తవమున వాఁడురాఁదగడు దక్కిటినారదులెంత రెల్లరున్.

ప్రసూతి—(విచారముతో)

మత్తకోకిలావృత్తము

కూఁతు నల్లుని బిల్వకుండఁగఁ గోరియజ్ఞము చేసెదే
నీతిగా దిది మీకు నీ జననింద పొందఁగ నేఁటికిన్.

దక్షుఁడు—

నీతిమాలినవాఁడు గాఁడటె నీవెఱుంగవె నాఁతిరో
ఖ్యాతెఱంగు నెఱుంగ జింకను నాకుఁ దోచెడి రోఁతగాన్.

ప్రసూతి—

మాన్యుఁడా శశిశాలి రమ్మను మాత్రలో నరుదెంచు సా
మాన్యుఁడా మఘపాలకుండనుమాన ముందఁడు పిల్వుమా

దక్షుఁడు—

మాన్యుఁడౌ తఁడుగా తెఱుంగుదు మాయెడం బటుకోపి సా
మాన్యుఁ డాతనిఁ బిల్వఁగూడదు మాను మానుడి మానినీ.

కరిబృంహితవృత్తము

ప్రసూతి—

మానుము నెదవు మానినను మన మానమేనయునె యాగమే
మానమను దామము మానసమునకు మానఁదగ నిది భోగమే

దక్షుఁడు—

మానమతనికి మానుదనుకను మానఁదలఁచితినాగమే?
దీననుడి పెద వాని గరువఁపుఁ దీరు గనుమిఁక వేఁగమే.

ప్రసూతి—

మాతననినను దాతవనినిను, మాతదలఁచును నేతజా
మాతబిలువఁగఁ బూతమగు మఘమాతనిని నెటి నెంచుమా

దక్షుఁడు—

కూఁతుఁబూరపడి చేఁత నిడిపోని గూ[illegible]రచరితున కింతయుఁ
బ్రాఁతె ఫలమిది మాకునతనికి బంధుగతి చెపెకున్నదే.

సఖినీవృత్తము

ప్రసూతి—

మనకియ్యెడ పూలిని బ్రేమను గెల్చుకిరాఁ
జనుఁగాదని మానితిమా జననిందసుమా

దక్షుఁడు—

జనులందఱు నిందలు నీ చను[illegible]గురుగా
[illegible] మనమానతని [illegible] సుమా.

ప్రసూతి—దేవా! కలసి [illegible]. [illegible]. [illegible] నల్లుఁడు నారలా! చెపనాఁడే న్యాయమా?

దక్షుఁడు—కాంతా! జగమేలెంగినవానిక జందె మాల?

చ. వినుమొకనాఁడు దేవసభ విష్ణులు వేలకొలంది లేచి నా
చనుతరినాకు మన్ననలు సల్పిరి సల్పెడివేళ నీలఁడీ
సునఁ గనుమూసి మానమును జూపుచు మిన్నక నన్నుఁ జిన్నపు
చ్చెను మన కట్టి యల్లుఁడిక నీ తలచందగఁ దూరకుండుమా.

ప్రసూతి—(దుఃఖపడుచు)

మ. మన నట్టింటికి ముందె రాఁదగిన సంపల్లక్ష్మి యీ చిన్న బి
డ్డను రావించక యజ్ఞశాలఁ దలపెట్టం దోఁచె మీ కయ్యయో
ఘనమౌ నాకొక కంటసీకొలుకఁగాఁ గాల్చొగునా ముక్కుగో
సినయట్లందరిలోనఁ జేసితిఁక మీచిత్తంబు ప్రాణేశ్వరా.

దక్షుఁడు—నేను వానిని బిలువను. వాఁడుగాని వాని సంబంధులుగాని రా
నక్కరలేదు. ఆ ప్రసంగము నా చెవులఁ బడరాదు పో.

(నిష్క్రమించిరి.)

---

## తృతీయ రంగము

### గృహాంగణము

ప్రవేశము—దక్షుఁడు

దక్షుఁడు—(ఆ ప్రక్కను, యీ ప్రక్కను బాగఁజూచి) రావలసిన ఋత్విజు
లందరు నీ దినము రావలసినవారే! యింకను రాకపోయిరి. వచ్చువేళ మిగిలెనా!
(ప్రొద్దు వంకఁ జూచి) ఘడియలు లేవు. (ముంగల జూచి) వీరెవరు? వాచాకలహము సేయుచు
వచ్చుచున్నారు. (కొంచెము పారఁజూచి) తిర్యక్పుండ్రావధాని, యూర్ధ్వపుండ్రా
చార్యులవలె నున్నారు. ఆ! వారే!

(ఆ యిద్దఱు ప్రవేశించిరి.)

తిర్యక్పు—ఓరీ! దక్షప్రజాపతిగారి యింటి పౌరోహిత్యము నాది. నాది!
పూర్వమునుండి నాది.

ఊర్ధ్వ—ఆ పౌరోహిత్య ముద్యోగము నీకు నడు నడు.

తిర్య—(కోపముతో) నేను విడువఁడను. నిన్ను గెంటించెదను. అవునఁ గాలాన
నాకీ పౌరోహిత్యమే జీవనము. ఓరీ ద్రోహీ! నాకూఁటి కడ్డము వచ్చితి వఁటరా!

ఊర్ధ్వ—(నవ్వుచు) ఇది నీదని నీ పేరుగాన వ్రాసియున్నదా?

తిర్య—(బతిమాలుకొనుచు) ఇక్కడ విఘ్నేశ్వరపూజాపుణ్యాహవాచనములు
నావి. నీ వపేక్షపడకు.

ఊర్ధ్వ—(హస్తముఁ ద్రిప్పుచు) మా విష్వక్సేన పూజగాని మీ విఘ్నేశ్వరపూజ
లేదు లేదురా!

తిర్య—ఆ! ఆ! అదిగూడనా! యజమానుని భుజమూలము లెప్పుడుఁ జురుక్కు
మనిపించినావురా!

ఊర్ధ్వ—నోటికి మాటలు తిన్నఁగా రానిమ్ము.

తిర్య—ఏమీ ఏమంటివి ?

ఊర్ధ్వ—సమాశ్రయణ మనలేవఁట్రా !

తిర్య—దాని పేరే యది. నీవు బ్రాహ్మణుఁడవే కావు.

ఊర్ధ్వ—నీవంతకు మును పే కావు.

తిర్య—ఇఁక నిపుఁ జీవాట్లే. వచ్చిన త్రోవనే పంపించెద. పద పద.

ఊర్ధ్వ—నీ యన్నది నీకే పదపద.

తిర్య—దక్షునియింట మొన్నఁటి యేకాదశీ శ్రాద్ధ మేన పెట్టించితి నెఱుఁగవా!

ఊర్ధ్వ—(నవ్వి) స్మార్తులు ప్రత్యక్షోపలాపములకు వెనుకఁదీయరు. విప్రహస్తము చాఁదస్తము. మూఁడవహస్తము కాదా! దక్షప్రజాపతిగారియింట మొన్నటి యేకాదశీ శ్రాద్ధము ద్వాదశినాఁడు నేన పెట్టించితిని.

తిర్య—ఎందుకు! ఎందుకు! పడువఁబోవుచు రుచి యడుగనేల ?

ఊర్ధ్వ—నీ యన్నమాఁటయే నేను.

తిర్య—(ముందటఁ బాఱఁజూచి చేయిసాఁచి) యిదిగో! యజమానుఁ డిక్కడనే యున్నాఁడు. (వెలవెలఁబోవుచు స్మార్తుఁడును, సంతోషముతో వైష్ణవుఁడును ఇద్దఱును ముందరకు నడిచిరి.)

దక్షుఁడు—ఎందుకయ్యా! నీకలహము.

తిర్య—నన్నా!

దక్ష—నిన్నే.

తిర్య—నన్నే యడుగనేలా !

దక్షుఁడు—(అవతలకుఁ జరిగి వైష్ణవునితో) యజ్ఞారంభ సమయంబునకు మీరు రండు.

ఊర్ధ్వ—తథాస్తు.

తిర్య—(ఆగ్రహముతో)

ఉ. నూతన పద్ధతిం బలుక నోరెటులాడెడు నీకు నక్కటా !
నీతిని సన్నుఁద్రోసి యవినీతుఁడవై యిటు నీవు స్మార్తముల్
శ్రౌతము నంటగల్పి మతసంకరతం గొనఁ జూచె దింతలో
నేతనికిం బురోహితము నిచ్చితి వచ్చితి నాదు జీవనం
బీతరి వైష్ణవుండ వగుదే చెడినీ దువు దూర మెంచుమా.

దక్షుఁడు—నీ పౌరోహిత్యము వదలుకొంటిమి. వైష్ణవాచార్యులె యింక మాకుఁ బురోహితులు.

తిర్య—నీ యజ్ఞము చేయుట ఎవనిప్రీతికి ?

దక్షుఁడు—విష్ణుప్రీతికి. యజ్ఞపురుషుం డాతఁడే.

తిర్య—వైష్ణవోపదేశముతో శివద్వేషంబుఁ దెచ్చుకొంటివా!

చ. వినుమిఁక వాస్తవంబు శివవిష్ణుల కింతయు భేదమున్నదే

దక్షుఁడు—

వినుమిఁక వాస్తవంబు శివవిష్ణుల కున్నది భేద మెప్పుడున్

తిర్య—

వినుమిఁకఁ బక్షపాతమున భేదముఁ దల్చుట నాశమూలమౌ

దక్షుఁడు—

వినుమిఁక నేను వైష్ణవుఁడ విష్ణుఁడె చాలుఁ గృపాపయుక్తికిన్.

తిర్య—యెన్నాళ్ళనుండి వైష్ణవుండవు.

దక్షు—ఈ మధ్యనుండియే.

తిర్య—ఓహోహో! మధ్యవైష్ణవమా? సరేసరే. మధ్యవైష్ణవమే వీరవైష్ణవము కాఁబోలు.

దక్షు—అగును.

తిర్య—ఈ యజ్ఞమునందుఁ బిష్టపశువా.

దక్షుఁడు—అగును.

తిర్య—ఆహా! శ్రౌతస్మార్తాచారము లింకేలా! (అవతలకుఁ జరిగి మాఁచి స్వగతము) పిష్టమతస్థుల బుద్ధి చమత్కారాగ మింకవారికని రాదు. సంప్రదాయములలో ప్రవేశించిరా! కట్టు, బొట్టు, జుట్టు, బిట్టు సవరింపుముఁ బెట్టు సంపాదించుకొని మృదు మధురాలాపంబులతో యజమానులను లోఁబరచుకొనుటయే గాక యొరులయందున స్వరసాబీజంబుల మొలపింతురు. (దక్షునితో) తరించుటకు యజ్ఞముఁ బూనుకొని ముందుగా నాశ్రితుని జీవనముఁ దీయఁ దలఁచితివా?

(ఇంతలోఁ బ్రసూతి ప్రవేశించును.)

ప్రసూతి—నాథా! దాసికిఁ దగినట్లుగా నీవు నుసుగు మన్నించుట గూడదా!

దక్షుఁడు—(మారు మొగమయి యూరకుండును.)

తిర్య—(ప్రసూతితో) అమ్మా! మఱల నొక్కి చెప్పు. నన్ను సురపెట్టుట ధర్మమా?

ప్రసూతి—వేదోక్తమా! బుద్ధు లోకపరుఁగ గాదు. న్యాయముఁ బరమేశ్వరుఁ డెఱుఁగు.

చ. కడువిషమంపుఁ గాలమిది కాదన లేదనలేని స్వేచ్ఛ నీ
యడుగుట యద్భుతంబు తనకక్కడ దూరఁగఁగంత లేనిచో

మెడకొకడోలుఁగూడనని మీ తగ వార్చగలేను గాని యీ
యెడనిది లేకపోయిన భరించఁగలేవె కుటుంబ మెంతనో.

తిర్య—(దక్షునితోఁ బండ్లుకొఱుకుచు నంగుళితోఁ బెదరింపుచు వెనుక వెనుకనే పోవుచు)

చ. తగదిటు నీకు దక్ష కులధర్మము వీడుట యింతనైన మి
న్నిగఁగొమరున్గజాస్య గణనేతను గూఁతుని తోడితెచ్చి సొం
పుగ మన విఘ్ననాథునకుఁ బూజలొసంగితివేని నీముఖం
బగు నటుఁగానిచోఁ జెడెదవన్నిటఁ జేయకు దుష్టమంత్రముల్.

దక్షుఁడు—(ఆగ్రహముతో) ఓరి పాషండాధమా! నీ మాటలకేమి పోపొమ్ము.

తిర్య—ఇదిగో చూఁడు. నేను శివోపాసనాపరుఁడను. నా వాక్యము శివ వంచకుండ వగు నీకు శాపమే యగును సుమా.

(దక్షుఁడు ముందుకు నడచి తరుమఁగా స్మార్తుఁడు పారిపోవుట.)

నేపథ్యములో

ఉ. వచ్చిరి సర్వనిర్జరులు వచ్చిరి సర్వతపోధనోత్తము
ల్వచ్చిరి ఋత్విజుల్ద్విజులు పాయక యజ్ఞము నిర్వహింపఁగా
వచ్చిరి బ్రహ్మవేత్తలును వారక నిండిరి ప్రోలినిండఁగ
చ్చిచ్చులకంటె ప్రోడ యిఁకఁ జేరునొ జేరఁడొ పిల్వ లేదొకో.

దక్షుఁడు—(ఆలకించి) యజ్ఞారంభమునకు రాదగినవా రందఱు విచ్చేసినట్లు శబ్దంబు వినవచ్చుచున్నయది. (ప్రసూతితో) సుర భూసుర ముని సభాజనంబులకై వేఁగమే పోవలెను. రా రమ్ము.

ప్రసూతి—నాథా! నా హృదయము చింతాక్రాంతం బయ్యె. మీ మనసు కరుఁగదయ్యె.

దక్షుఁడు—ఇంతీ! యింతటితో ముఱిఁగిన కాలు తెగఁగోయుట మేలు. విరక్తియను ఛురికచేఁ జింతాడోలాచ్ఛేదంబుఁ గావించి యుల్లాసంబుతో నుండుము. శాలాప్రవేశసమయము రా రమ్ము.

(యిద్దఱు నిష్క్రమింతురు.)

---

## చతుర్థ రంగము

### యజ్ఞశాల

(ప్రవేశము—హోమమండలములయొద్ద దీక్షతోఁ దక్షుఁడు, ప్రసూతియు, స్రుక్కులు, స్రువములు ధరించి భృగుముని, దధీచియు)

భృగువు—(దక్షునితో) యజమానవర్యా! నీ కిది యజ్ఞదీక్ష సుమా! యాజమాన్యప్రవచనములుదక్కఁ దక్కుంగల ప్రసంగములు కూడవు సుమా!

దక్షుఁడు—(నవ్వి) ఏ నంత యవివేకినా!

దధీచి—(తీవ్రముగా) అది కాదు. మహాక్రతు విది. యిందు సర్వజ్ఞప్రసంగములు రాకమానవు. వృద్ధసమ్మతమగు సిద్ధాంతమునకు బద్ధాంతరంగుండవై కినుక రానీయవలదు. రానిచ్చితివా దీక్షాభంగమై యజ్ఞధ్వంసంబునకు మూలమగును.

దక్షుఁడు—సర్వజ్ఞప్రసంగంబు లిక్కడ రానవసరంబే లేదు. సర్వము నింతకుమున్నే సిద్ధాంతమైనది.

భృగువు—నీ యుక్తిప్రత్యుక్తివైచిత్ర్యంబునకు నిది సమయమా! మాచే నల్పవలసిన రీతి మేము చెప్పినవారము. నీ యిష్టము. క్రియాకలాపము సాగనిమ్ము.

(అందఱు మంత్రములు చదువుచు హోమములు చేయుచుండుట. ఒక ప్రక్కనుండి సతీదేవి, గజాననుఁడు, నంది, భృంగి ప్రవేశించుట)

సతి—(అంతటఁ జూచి స్వగతము.)

మత్తకోకిలా వృత్తము

జనులు నల్గడలందు నిండిరి జన్నపుందరి ...కా
జనకుఁ డిప్పుడె దీక్షతో మఖశాలకుం జనుదెంచెగా
ఘనులు ఋత్విజులెల్ల వచ్చిరి కర్మవేత్తలు వీరె కా
కినుక నాపయిఁ గూడ వీరికి గేలిసేయక పోదుగా.

(ఆశ్చర్యముతో)

చ. నవరున నున్నవారిపుడు నన్నిటనుండియె చూచిచూడన
ట్లవలకుఁ బో...రో వినవు రాజనయిత్రియు నల్లంతోఁ చునా
ధవుఁడనినట్ల యామె నిఁకఁ దండ్రి తెలంగొక కొంత సుద్దమా
నవులకు నాస్పదంబయితి నావిధి నన్నిటదెచ్చె నింతకున్.

(విచారపడుట)

భృంగి—(పరిహాసముగా) తల్లీ! నీ పుట్టినింటవారి యాదార్యము నీ చెప్పినంతలోఁ బదియారవపాలైనఁ గానరాదు. నీ విమ్మాత్రపు భాగ్యంబునకే యట్లు

వొంగి వొంగి పడుచుఁ బడుచు వచ్చితివి. యహాహా! మా దేవరచెప్పినదే వాస్తవము. చాలుఁజాలు. ఇంతటనయిన వెనుకకుఁ బోవుట మేలు సుమా!

గజా—అంబా! మనవచ్చెడివేళ మిక్కిలి యూరించితివి. తాత యేఁడి? అమ్మమ్మ యేది? యిక్కడ మన ప్రశంస తలఁచినవారే లేరు. ఛీ! వెనుకకుఁబోదము రా రమ్మ.

నంది—జననీ! యీ వచ్చిన బంధులుగాని యితరులుగాని యెక్కరయినఁ బలుకరించువారే లేరు. మన యిచ్చటి వైఖరిని స్థాలీపులాకన్యాయముగాఁ గంటిమి చాలు నింకేమి.

సతీదేవి—(దుఃఖవిచారముతో) మిగిలినదాని కనుకొన ఫల మేమి?

తే. గీ. ఏదియెటులైన నేనిట మోదమలర
నుండి నాతండ్రిచేయు యజ్ఞోత్సవంబుఁ
జూచిపోవుటమంచిది చోద్యముగను
రానెవచ్చితి నింతలో రద్దియేల.

నంది—(సతితో)

తే. గీ. జనని జననింద రానీక జనకుఁడుండ
మాఁటపట్టింపులకుఁబోక మానమలరఁ
గ్రతువిశేషంబులెల్లను గాంచఁజూచి
వెడలిపోవుటయె మేలగు వేడుకొందు.

సతి—(హస్తంబులతోఁ జూపుచు) ఇదె మహావృద్ధు లెందరెందరో వచ్చియున్నారు. కోపం బెవరితో విశదపడుట మేలుగాదు (తండ్రిదిక్కు మొగంబై నడుచుట.)

భృగు—(దక్షుఁడువినకుండఁగ దధీచితో) దధీచీ! అదుగోచూఁడు; దాక్షాయణి.

ఉ. పుట్టినయిల్లటంచు మదిఁబొంగుచు వచ్చిన దీ లతాంగి యీ
తట్టుననుండు బంధువులు తన్నొకరైనను బల్కరింపమిం
బిట్టువగం గృశింపుచును వెల్వెలఁబాఱెడి మోముతోఁడ దాఁ
గట్టలుకం గనుఁ జనకుఁగన్గొనవచ్చె నిఁకేమి యౌనొకో.

దధీచి—(దక్షుఁడు వినకుండఁగ) లోకములో మనస్పర్థలు కారణాంతరములచే వచ్చినను గొంతకాలమునకుఁ బశ్చాత్తాపంబునఁ దొలంగిపోవును గదా! యీ న్యాయ మిక్కడ బొసంగదు. అతఁడేబుద్ధినున్నవాఁడో! యిత్తరి మర్యాదలేని యిత్తావునకుఁ దన కుటుంబముఁ బంపెనవాఁడుగాన వీనిహృదయము పలుగుఁ బాషాణముసుమా!

ప్రసూతి—(ఎదుటఁ బారఁజూచి యుల్లాసముతో స్వగతము) యీ వచ్చునది నా చిన్నిముద్దుల చిన్నారివలె నున్నది. ఆ అదేకా (వంగిచూచి) అదే! అదే! అహాహా! యేమి నాపుణ్యము. కండ్లు చెడినట్లున్నయవి. తలఁచని తలంపు నా చిన్నిపొన్నారిని జూచి యెన్నాళ్లాయె. ఔరా! నాకన్నులు పన్నీట నద్దినట్లున్నయది (రెండడుగులు ముందుకువేసి చేఁతులుసాఁచి ప్రకాశముగా)

శా. మాతల్లీ! యిటురావె! నూపరువు మా మర్యాద గాపాఁడితీ
వే తన్మాత్రమె లాఁతివారెవరు నీకిచ్చోఁట రావే జగ
న్మాతా! సుందరమందహాసముఖి! భామా! రావె నాచెంతకు
న్నాతోనుంచుము తత్తదధ్వర విధానంబుల్ప్రతీక్షింపగాన్.

దక్షుఁడు—(కండ్లుజేవుమాచి హుంకరించి) ఏమిమీ!

ధృవకోకిలావృత్తము

వదర కీవిఁక నోరుమూయుము వాసిపోయెనె యింతలో
వదలుకొన్నపు డేల రావలె వాడుకా గురిలేదుకా
బదులుచెప్పక లేచిపొమ్మను బాసచేసితి నాఁటి నా
కిది తనూభవగానె యీ గుణహీనుఁ డల్లుడె యారయన్.

ప్రసూతి—(తొందరతో ఆగ్రహముతో)

ధృవకోకిలావృత్తము

తగదు నీకిటు నోరునాడఁగఁ దాళు తాళుము దీక్షకుం
దగదు నీకిది గర్భవాసము తాల్మినుంచుము దేవి రాఁ
దగినదేయగు గారవింపుము దక్ష కన్గవసన్నచే
జమము మెచ్చెడినట్లుచేయుము సాధ్వి యజ్ఞముఁ జూచెడున్.

దక్షుఁడు—మునీంద్రా! నిప్పు తప్పనాడితివి. ప్రథమమునుండి నా సంకల్పము శివ సంబంధంబు లేకుండఁగా యజ్ఞముచేయుటకుఁ గాదా.

భృగువు—ప్రజాపతీ! ఏ సంకల్పమున కిప్పుడేమి భంగము. తదాహ్వానమే చేయకుంటివిగా?

దక్షుఁడు—ఇప్పు డిదేమి మేళము!

భృగువు—ఇది యజ్ఞము. దేవునిపెండ్లి కందఱు పెద్దలే! యీ చూడవచ్చిన వారిలో నొక యాగంతుకురాలుగ ననుకొనుము.

దక్షుఁడు—అట్లకాదు. నా విరోధులను నాయాగశాలలోనికి రానీయనొల్లను.

సతీదేవి—(చింతాక్రాంతురాలయి కన్నీరొలుకుచు దక్షునితో)

ఉ. కల్లలు పల్కుచుం జెడుపగన్నిలఁదీసెదు ధర్మమయ్యె నీ
యల్లుని లోపమేమి జనకా కనకాచలచాపు ప్రాభవం
బెల్ల నెఱుంగవయ్యె పరమేశ్వరుఁ డాతఁడు లేనియజ్ఞము
ల్చెల్లునె వానిపై నలుకచేయకు నీకది నొక్కిచెప్పెదన్.

దక్షుఁడు—(దురాగ్రహముతో) ఓసీ! నీ మగవాఁడు నా పగవాఁడు. నీ యలవాఁటు నా తలపోఁటు. నా మ్రోల నీవిటు పోరాఁటమున కారాఁటపడితో చాలుజాలు. కాఁటికాఁపరికి నిన్నిచ్చి నేఁటిదాఁకఁ బేరోఁటమికిఁ బాల్పైతిని. నీ వెక్కడి కూఁతురవు. నేనెక్కడి తండ్రిని పోపొమ్ము.

సతి—(బహుతీవ్రముగా) త్వదీయ మనఃప్రపంచంబున మోహసాహసంబుచే వెల్లివిరిసెడి మహేశ్వర ద్రోహమయాంధకారములు మదీయ ముఖచంద్రదరహాస చంద్రికా సముల్లసనంబులచేతనైన విచ్చిపోవునను భ్రాంతిచే వచ్చితిని. వచ్చినను నీ యీ ఘనఘనాడంబరంబులచేతఁ గాఁబోలు బిట్టుదట్టంబులగుటంజేసి నీవాగ్జాలము కేవల తమోరూపమయి నన్నే మ్రింగఁ జూచుచున్నది. అహహా! కాలము!

భృగువు—(దధీచితో) వింటివా! దేవి వాక్యంబులు కర్ణశూలంబులై మనలఁ గూడఁ బొడుచుచున్నవి.

దధీచి—మునీంద్రా! సహచరణ సహసల్లాపాదు లూరక పోవునా! యిట్లు వచ్చునని నాఁడే నాకుఁ దోఁచి నీకుఁ జెప్పితిని.

భృగువు—కానిమ్ము. కాఁదగునది కాకమానదు. చూచుచుందము.

దక్షుఁడు—(ఋత్విక్కులతో) మీ మీ సామర్థ్యపు మాఁటలటుండనిండు. నా చెవులఁ దూరవు. (సతితో)

ఉ. నిన్నెవరెందుఁ బొమ్మనిరి నీకిటు రాఁబనియేమి నీవు నా
జన్నముఁ జూఁచెకున్నయెడ జక్కన గాదనుకొంటివో కొఱం జా
ల్చిన్నకనేఁచి పొమ్మిపుడ మాఁపగ నోఁపగలేనె బాఁపురే
నిన్నలనాఁడె లేవని గణించితి నీకిఁక సిగ్గు లేదఁటే.

(హస్తంబుతో సతిని జూపుచు) వింటిరా? దీని కతిపరుఁడు లభించుట దీని ప్రారబ్ధకర్మంబుల పరిణామమే. యెక్కడనైన బాముచుట్టము పడగ పగయగునా! పగవాని పడఁతి పగతురాలు కాకుండునా! మొట్టమొదట నాదే పొరఁబాటు. పెంచి పెంచి గుణక్రియారహితుండు, కులగోత్రశూన్యుండు, గజాజిన పరిధానుండు, శ్మశ్రు జటా బంధబంధురుండు, భస్మాంగరాగ లేపనలోలుండు, సర్పరాజ ప్రాచీనావీత వహుండునగు, భూతప్రేతపిశాచ పరివృతుండు, వృషభారూఢుండు, దిగంబరుండు, భిక్షాశనునికి ధారవోసితిని. వానికి శివుఁడను ప్రవాదం బెట్లువచ్చెనో యశివుండని యెఱిఁగియెఱిఁగియే వేదవిద్యను శూద్రునకిచ్చినవిధంబు చేసితిని. చేసినదాని ఫలంబనుభ

వించితిని. మును జేఁగిన కాలు దెగఁగోసి నిర్విచార మనుకొంటిని. అహహా! వాని సర్వజ్ఞత్వముఁ జూడుఁడు. వీడిట్లు నిరపాయముగ యజ్ఞముఁ జేసికొని పోయెనని మదమాత్సర్యములతోఁ దనభార్య నిట్లు పంపి గిల్లి పోరాటమునకు సిద్ధపడినాఁడు. (చెవులు మూసికొని) హరిహరీ (ద్వారముకై చూచి) ఎవఁడురా అక్కడ!

ద్వారికుడు — చిత్తము స్వామీ!

దక్షుఁడు — దీనిని రెక్కపట్టుకొని దూరముగ నీడ్చుకొనిపోయి మఱల రాకుండఁగా సాగనంపుము.

(సతీదేవి స్తంభ మానుకొని నిలఁబడి తలవంచుకొని విచారపడుట.)

నంది — (పండ్లు పటపట కొరికి) ఆ! ఆ! యేమి వీని దురాగతము!

(భృంగి గజాననులతో)

చ. కటకట వింటిరా మదవికారనిరూఢదురాంధ్యవంద్య దు
ర్ఘటకుటిల ప్రలాపములు గ్రాల్చి-ని ప్రేలుచునున్నవాఁడు వీ
డిటు నిటలాక్షుదూరు నెడ నెట్లు సహింతుము మిత్రులార యీ
కుటిలునిబట్టి కొట్టుదమె కొంతయిన స్మృతివచ్చునట్లుగా.

గజాన — నందీ! యింకను జూఁడనేఁటికి?

ఉ. నట్టేలుసొచ్చినం దనగు నైచ్యము వీఁడను మమ్ము నిట్టులం
దిట్టుఁదోఁషాహాని వీఁడిఁక గణింమనె చుట్టమటంచుఁ జూఁడరాఁ
బట్టను దయ్యమై యను ప్రవాదమదిట్టిద వీని నిప్పుఁడే
పట్టి హుటాహుటి స్మన ప్రభావముఁ జూపుట మేలు రండికన్.

భృంగి —

శా. పప్పన్నంబులు దప్పిపోయెఁ దుదిఁ గొంపల్ముంచె వైరంబు బ
ల్తిప్పల్దప్పక వచ్చె వచ్చునపు డద్దేవుండు దాఁ జెప్పఁడే
నిప్పుల్ద్రొక్కిన కోఁతిరీతి శివులన్నిందించ నింకెంచనా
యప్పాపాత్ముని బట్టి మొత్తుదము రం డిద్దేవి వద్దన్నదే.

(నంది, భృంగి, గజాననులు రౌద్రాకారులై కత్తులు ద్రిప్పుట)

సతి — (హస్తంబు సాఁచి)

చ. నిలుఁడునిలుండు మీ రిపుడు నేరిచి నేరక వీనిపైకిఁ బో
వల దిటు రాక నాదె తొలివంకర శంకరునాజ్ఞ వింటినా
చలపడి శంక లేక శిశుచంద్రకిరీటునిఁ దూలనాఁడు దు
ష్టులమిది పోదు కట్టి కుడుపంగల దిప్పుడె వీని కకటా.

(నంది, భృంగి, గజాననులు కత్తులువాల్చి వెనుకకుఁ దగ్గుట)

సతి——(రౌద్రాకారయై దక్షునితో) ఏమి నీ బుద్ధివిశేషము. సర్వప్రాణులకుఁ బ్రియాత్మకుండగు పరమేశ్వరునందు దుర్గుణంబులు నాపాదించు మూర్ఖుండు చరాచరంబులో నీకంటె మఱెవ్వఁడు.

చ. శివయను నక్షరద్వయము జిహ్వను బ్రహ్మను జేర్చువారికి
న్భవకలుషంబు లెల్ల దులుపంగల మంగళ సుందరాంగునం
దవగుణ మెంచి ద్వేషమును నొదలమోయుచు ద్రోహకారివై
తివి నిను నేమనంగలను దేవుని నీ విటు దూఱవచ్చునా!

నిగ్రహానుగ్రహసమగ్రసముదగ్రతేజః పరిగ్రహదివ్యమంగళవిగ్రహుం డగు నసితగ్రీవుని నెఱిఁగియు మూర్ఖత్వముచే స్మశాననివాసుండని, పిశాచసంవృతుం డని, భస్మదిగ్ధాంగుఁడని, పుర్రెపేరులసంచున జిల్లుబుస్సలాఁడు పాపపేరుల పేరుటురమువాఁడని, యమంగళరూపుఁ డని నిష్కారణము పరోక్షమునఁ దిట్టి దిట్టువాటులకు లోనైతివి. బ్రహ్మాదు లందరు నయ్యీశ్వరు చరణారవిందరేణువులు సోకినంతమాత్రానఁ బవిత్రులమైతి మనుకొందు రట్టి మహానుభావునకు నీ వొక్కరుండవు నిందించుటంజేసి యేమి హాని.

ఉ. నిరుపమసర్వరక్షణ విసర్గముల నీసు దిరస్కరించు దు
ష్చరితుని జిహ్వ గోయదగు జయ్యన నయ్యది కాక తక్కిన
స్మరణను మేలు రెంటికి సమర్థత చాలమి గోఱరంధ్రము
ల్గరముల మూసికొంచుఁ జనంగదగుమటంచురు ధర్మకోవిదుల్.

మ. హాను పుల్లాఁపుచు మూఢుఁడాఁకట నసహ్యంబైన యన్నంబుదా
దిని త్రోద్దీ వెడలించి శుద్ధుఁడగు రీతిం దురాత్మ్ముండవై
ఘను నయ్యీశ్వరుదూరు నీ సుతయనంగా నోర్వకీహేయమా
తనువున్నేసఁటబాసిభాసిలెద శుద్ధత్వంబు సంధిల్లఁగన్.

ప్రవృత్తి నివృత్తి కర్మంబులు రాగ వైరాగ్యానుబంధములగుటంజేసి సరాగులయి కర్మతంత్రులయిన సంసారులకును విరాగులయి శ్రవణ మనన నిధి ధ్యాసలతో నుండెడి మహాయోగులకును విధినిషేధంబులుండుటయు, లేకుండుటయును, స్వభావసిద్ధములుగాన స్వధర్మానుష్ఠానపరుల నెప్పుడును దూషింపరాదుసుమా! తదుభయకర్మశూన్యుండయి పరబ్రహ్మస్వరూపుఁడగు నీశ్వరునందు మిథ్యాలోపము లాపాదించి నిందిచుట మహాపాతకంబుగాదే. సంకల్పమాత్రసిద్ధంబు లగుటంజేసి తత్త్వజ్ఞానులకు నుపాసనీయంబులగు మాయొక్క యైశ్వర్యంబులు ధూమమార్గప్రవృత్తులయి యాగాన్నభోజనులగు వారిచేత యాగశాలలయందే పొగడంబడుచుండు వాఁడవగుటంజేసి యమన

సులో, నేన యధికసంపన్నుండనని భిక్షాన్నశాన భస్మాస్థిముద్రితుండగు రుద్రుండు పరమ దరిద్రుండని నోటికివచ్చి నట్లెల్ల దూషించుచుంటివి. విను.

మత్తకోకిల వృత్తము

నీలకంఠుఁదిరస్కరించెడి నీకుబుత్రిక నన్గనన్
జాలనామదిసిగ్గుపుట్టెడిఁ జాలునీసుతనాటచే
బాలిశాధమ నిన్నుఁజూడఁగఁ బాపమా నహహా మహా
శీలురైనమహాత్ములన్నిరసించుజన్మము కాల్పనే.

చ. హరుఁడు మహానుభావుఁడు దయానిలయుం డెపుడైన నన్ను సా
దరపరిహాసవాక్యముల దక్షసుతా యని పిల్చెనేని నే
బురపురఁ బొక్కుచు న్మనసు పొందక బల్లలవంపులాచు హా
దొరఁగనె నీదుపుత్రినను దుఃఖముకంటెను మ్రగ్గుటొప్పగున్.

తండ్రీ! శివదూషకుండవగు నీవలనఁ బుట్టిన యీశరీరం బిప్పుడు నీచేయు శివదూషణంబులు నాకర్ణరంధ్రంబులకు సులాకపాతంబులై తోఁచుటయు నపవిత్రంబగుటం జేసి యిఁక నీశ్వరయోగ్యంబుకాదు. (చేఁతితోఁ జూపుచు) దీని నీ సురసభామధ్యంబున నిపుడే యోగానలజ్వాలఁ బ్రజ్వలింపఁజేసి యందు నేకాహుతిగా నర్పించెద చూడుము. (సతీదేవి తీవ్రకోపముతోఁ బదియడుఁగు లవతలకుఁబోయి కూర్చుని యోగంబు పట్టుట)

భృంగి—నందీ! ముం దేమిగతి. దాక్షాయణి సకలశక్తిసంపూర్ణురాలయ్యుఁ జేయఁదగినదానిని దాఁ జేయక మనలఁ జేయనియ్యక దుఃఖకోపములతోఁ బ్రాయోపవేశమై యోగంబుపట్టినది. యిదేమి చిత్రమోయీ!

గజా—చిత్రమేమున్నది. పీరి నశింపవేయుటకే.

నంది—అది కాదు యోచన. కార్యము చెడునట్లున్నది. పోదమురండు.

(నంది భృంగి గణపతులు సతియొద్దకుఁబోవుట)

భృగువు—దధీచీ! ఏదో కీడుఁద సంభవించునట్లున్నది సుమా!

దధీచి—మహాశక్తికాదే యిఁక ననుమానమా! (దక్షునితో) వింటివా! నీసంకల్ప మీడేరెగదా!

దక్షుఁడు—ఈబెదరింపులకేమి? వచ్చెడివా రెప్పుడును జెప్పిచావరుసుమా!

భృగువు—దక్షా! నీ వెప్పుడును గార్యదర్శివి కావు. స్త్రీజాతికి బుద్ధిసాహసంబులు పురుషునికంటె నెన్మిదిరెట్లధికములని యెఱుఁగవా. తెలుచుగాఁ దలఁచినంతఁ జెప్పును. చెప్పినంతఁ జేయునుగాని మానునా.

దక్షుఁడు—ఆహా! అది యంతదేమగును. దైవము కూర్చినాడు. ఆ మగని దుస్థామసమునకు నీ సుస్థామసమునకు సరిపోయినది. "శ్రేయాంసి బహువిఘ్నాని"యని

యొక మంచికార్యమున కనేక విఘ్నములు కనుపెట్టుకొని యుండక మానవు. మనము గూడ నటుపోదమురండు. (ఆ ముగ్గురు సతియొద్దకుఁ జేరుట. అందఱుఁ జూచుచుండఁగ యోగాగ్నిజ్వాలలు భగ్గుమని ప్రజ్వరిల్లఁగ సతీదేవి భస్మమగుట. దక్షుఁడు దక్కఁ దక్కినవారందఱు నాశ్చర్యపడుట.)

దక్షుఁడు.—దీనికిఁ బోగాలము వచ్చె గావున నిట్లయ్యె. నా లోప మేమి?

నంది—(దక్షునివంకఁ జూచి) హుం. (అవుడుగఱచి భృంగి గజాననులతో) కాలవైపరీత్యముఁ జూచితిరా! తా నొకటిఁ దలఁచిన దైవ మొకటి తలఁచె! ఈ జగదంబ వచ్చునప్పుడు సహాయార్థము మనలను బంపె. మన మే మొగముతో వాని సమక్షమునకుఁ బోదము.

భృంగి.—నాఁ డీ ప్రయాణమున కీ గజాననుఁడుగూడఁ గొంత ప్రోత్సాహపఱచినవాఁడే.

గజా.—నీవో! యిందు మన మందరము సమానులమే. యిక్కడి కిట్లగు నని మనము కలగంటిమా!

భృంగి—(దక్షునితో) ఓరీ పాపిష్ఠా! కన్నతండ్రి వని నీ యజ్ఞముఁ జూడ వచ్చిన నీ కూతుని నీ తీరున యజ్ఞపశువునుఁగా బలికించితివఁటరా!

నంది—(దక్షునితో) ఓరీ! ప్రచ్ఛన్నహంతకా! నీ వెంత! నీ యజ్ఞ మెంత! నీవా రెంత! మి మ్మందఱ నిపుడ భస్మపటలంబుగఁ జేసి పోయెదఁ గాచికొనుము. (భృంగి, గజాననులతో)

ఉ. కూఁతురు ప్రీతిరాఁగ నతిక్రూరత నీ సుత నీతిమాలి దు
[illegible]
[illegible]
డీఁతని సైఁతుమే యిఁక నివే యొరఁదూసిన కత్తులెత్తుఁడీ.

(నంది, భృంగి, గజాననులు రౌద్రాకారులై కత్తులు ద్రిప్పుట)

దక్షుఁడు—(వీరు వినకుండ భృగువుతో) నీవు నాయంతవాఁడవు. నీ వీ యాధ్వర్యభారంబుఁ దలకొంటివి. మహాత్మా! యీ విఘ్నంబు నివారింపవే.

భృగువు— దక్షా! ఇప్పటికి వీరివలన నీకు భయము రానీయము. మన బ్రహ్మబల మూరక పోవునా.

చ. బలములనెల్ల గెల్వఁగల బ్రాహ్మ్యబలంబె బలంబు గాని యీ
బలము బలంబె వీరు హరుపార్శ్వచరు ల్బలహీను లిప్పుడీ
కలహముఁ బెంచిన న్మన యఖండబలంబునఁ దూలిపోరె నే
గలుగ భయంబు లే దిపుడ కారియపెట్టెద వీరిఁ జూడుమా.

(నంది, భృంగి, గజాననులు దక్షుని జుట్టుముట్టుట)

దధీచి—భృగూ! యిఁక మన మూరకున్న లాభము లేదు. తత్క్షణమ పోయి యాభిచారికహోమంబు చేయుదమె.

భృగువు—అదెంతపని. రా రమ్ము. (భృగు దధీచులు నిష్క్రమించిరి)

దక్షుఁడు—(చేఁతులు సాఁచి)

మ. మిము రమ్మంటిని కుత్సితం బొరసి కూర్మిం జూపున ల్లెగుదెం
చి ముధాకక్షకుఁ జొచ్చి చచ్చినది రాజీవాక్షి నే దీనిఁ జా
వు మటం చంటిన మూఢులార యిఁకఁ జాల్పోవపొందు పోరేని ని
కరము మా బ్రహ్మబలంబు మి మ్మిపుడ వీకందోలు నొక్కుమ్మడిన్.

నంది—ఓరీ! యే మంటివి?

ఉ. క్రూఁతుని ఘాతచేసితి జుగుప్సను బాసి తెఱుంగనంటి వీ
ఘాతను మాకు నియ్యదియె కక్షసువిగా తనబోఁటి రంకు పెం
పొ తన నోఁటికంపు తన యాత్మకు నెకరవటంను టెల్లె ని
న్నిఁతరి నేమిచేసిన నొకింతయుఁ బాపము లేదు పాతకీ.

(నేపథ్యములో కలకలము)

(నంది, గజాననులు తెల్లఁబోయి నిలువలేక దక్షుని విడచి కొంచెము వెనుకకుఁ బోవుట)

భృంగి—ఓయబ్బా! నాకు భయమగుచున్నయది. మీ రిక్కడనే యుండుడు. నేను ముం దొక్క పఱుగునఁబోయి మన యొడయునిఁ దోడ్కొని వత్తునా.

గజా—ని యొత్తు నాకుఁ దెలిసినది.

ఆ. వె. పిఱికితనము మాను భృంగి నీ విబ్బంగి
నుఱక పీని మీఁద కుఱికి నఱికి
చనుట మేలు మనకు జనకు మెప్పింతము
పాఱులెంత, వారు పాఱిపోరె.

(మఱలఁ దెఱలో కలకలము)

(భీషణాకారముతో మహాభూతము ప్రవేశము)

మహాభూతము—(అట్టహాసముచేసి)

క. పీరా పీరా వేసులు
పోరా పొరాఁటనలిగి పోరా నాచేఁ
బూరా ఫారాఁగాచెదఁ
బోరా పోరా మఖంబు పూరాఁగొనరా.

(నంది భృంగి గజాననులు దక్షుని విడచి వెనుకకుఁ బరువెత్తుట)

దక్షుఁడు —

ఉ. సిగ్గిఁకఁజాలుఁ బొందు శివసేవకు లోర్వరు బ్రహ్మతేజముం
దిగ్గునఁ బోవరేని వితథీకృతవిక్రము లౌచు మీరు వే
డ్రగ్గుదు రెగ్గుచేయకుఁడు మౌర్ఖ్యముమానుఁడు మీ పురారియు
న్నెగ్గఁడు మమ్ముఁదాకి యవినీతులుగాక చనుండు వెన్కకున్.

మహా — దక్షా! ఉండు డుండుడు.

మ. శివపాషండు లఖండచండిమసముజ్జృంభద్భుజాదండతాం
డవనిష్ఖండితవిష్టపస్ఫుటదవష్టంభోగ్రశుంభద్రణో
త్సవముష్టింధయులైన నాయెదుట నుత్సన్నౌజులై బ్రాహ్మవై
భవమత్యుగ్రమటంచు మ్రొక్కి భయసంభ్రాంతాత్ములై పాఱరే.

మ. పరమ బ్రాహ్మణ మంత్రశక్తినగు నాప్రౌఢత్వమున్వీరెఱుం
గరు నీపైకిఁకవచ్చిరేనిఁ బటువక్రక్రూర మద్దంష్ట్రికాం
తరసంఘట్టన పిష్టపేషణ దశా ధన్యాత్ములంజేసి నీ
వరయజ్ఞంబుగృతార్థమౌనటుల బ్రోవంజూతు నారమ్మొగిన్.

దక్షుఁడు —

ఉ. క్ష్మారులు చాడికోరులగు కొందఱిఁ బొందుగఁజేరదీసి త
త్క్రూరదురుక్తిబోధనలకుం జెవులొగ్గుచు నేరియందునే
సారములున్నవో యెఱుఁగఁజాలక యూరక సాధుబాధల
న్గూరక చేయుచుం ద్రకట వారలజన్మమదేల కాల్చనే.

మహా — ప్రజాపతివర్యా! యీ పాఱుఁబోతులతోఁ గాలయాపన మేల పదపద.

(మహాభూతము దక్షుని దోడ్కొని నిష్క్రమించుట)

చ. మనకు నసాధ్యులీ మునులు మానము ప్రాణముదక్కనీరు చ
య్యన మనదేవు సన్నిధికి నందఱముం జని విన్నపింత మొ
య్యన ఖలులైన వీరి బ్రతుకంతయు నెంతయు నంతకారిచే
తనకొఱ లేక చక్కపడుఁదక్షణమేగుద మింకరండొగిన్.

(నంది భృంగి గజాననులు మువ్వురు నిష్క్రమించిరి)

గద్య: ఇది శ్రీ తర్క వేదాంతాది సకలతంత్రస్వతంత్ర శ్రీమ దనుగమభట్టాచార్యాది ప్రసిద్ధబిరుదాంకిత శ్రీమ దభినవగౌతమావతార శ్రీ కురుగంటి వేంకటరామశాస్త్రి [illegible] శ్రీ కురుగంట్యప్పయ్యశాస్త్రిపుత్ర శ్రీ వెంకమాంబికా సతీతిలక [illegible] రత్నాయమాన శ్రీ [illegible]సగోత్రపవిత్ర శ్రీమ దుభయభాషా భూషాయమాన లలితకవితాధారాధారాళ యశోవిశాల సహజపాండిత్య సాహిత్య శ్రీ బాలత్రిపురసుందరీవరప్రసన్న బుధజనవిధేయ శ్రీ కురుగంటి సూర్యనారాయణశాస్త్రి నామధేయ ప్రణీతంబులగు సత్కృతులలో నగ్రగణ్యంబగు కుమారసంభవ నాటకంబునఁ ప్రథమాంకము సమగ్రము. శ్రీ









# కుమారసంభవము

## ద్వితీయాఙ్కము

### ప్రథమ రంగము.

(ప్రవేశము:—శంఖచూడుఁడు; ఘంటాకర్ణుఁడు)

శంఖ—అబ్బా! ఏమికాలము. పండువంటి సంసారము పాడగుటయేకాక సంసారి సన్యాసియై లేచిపోవుట మనప్రాణాలకు వచ్చినది.

ఘంటా—(ఆశ్చర్యముతో) ఎక్కడినాఁటి! మనకేమి!

శంఖ—జగమెఱిఁగిన వానికి జందెమేల యన్నట్లు టమటమా మ్రోఁగినదాని నెఱుఁగనట్లడిగెదవేమి?

ఘంటా—(ఆకాశమువంకఁజూచి స్మృతికవచ్చినట్లభినయించి) దక్షాధ్వరంబుఁ జూడఁబోయి దాక్షాయణి దేహత్యాగంబు చేసిన సమయంబున వెడలిన బ్రహ్మశక్తిం జూచి పలాయితుండనైతి. తదనంతర సమాచారము నాకేమియుం దెలియదు.

శంఖ—(నవ్వి) మగతన మనఁగ నిదిరా మగతనము. శెభాష్! వారే యాబారికి నిలువఁజాలక యొక్కపగిదిన వచ్చి యచ్చంద్రదమాంశానకు ముట్టించిరి. నీ కెక్కడయేమి.

ఘంటా—సత్యము! సత్యము! తరువాత; తరువాత.

శంఖ—ముట్టించినతోడనే యచ్చిచ్చుకంటివేల్పు పంపున జగదేక జయభద్రుం డగు వీరభద్రుండు చిచ్చుబిడుగువలెఁ బోయి యచ్చటివారలనెల్లరఁ గరచరణగదా ఘాతంబుల నుగ్గునుగ్గుగ నూర్పడిచేసియు యజమానుని శిరంబు గరవాలంబునఁ గరంబుఁ దెగనఱికి భగ్గుభగ్గుమను నయ్యగ్నిమంటలో వెంటనే యాహుతిచేసి రుద్రశూన్యంబగు నయ్యజ్ఞం బెక్కడి దక్కడని శూన్యంబుచేసి వచ్చె.

ఘంటా—అంతేకావలె. నాకనితీఁనది. కాని నీవన్నట్లు నే నేబుద్ధిని నుంటినో దాఁటివచ్చితిని. రాకుంటినా యా రెండవ సమ్మర్దములో నాబ్రతు కప్పుడే తెల్లవారు సుమా! తరువాత; తరువాత.

శంఖ—శివుండు విధురుండై వైరాగ్యంబునఁ దపశ్చర్యార్థము హిమాచలాశ్రమంబున కేఁగె. ఏఁగునప్పుడు తపోవనరక్షణార్థము మనల నియమించెనఁట. యీచలి కాల మమ్మంచుకొండమీఁది యీ వనాలలోఁ దిరుగఁ బోవలె.

ఘంటా—మనమాఁట లటుండనిమ్ము. ఆహాహా! యిదేసుమా! స్మశానవైరాగ్యము. పురాణవైరాగ్యములుఁగూడ దీనివంటివే. యతని కీ తాత్కాలిక వైరాగ్యము తుదముట్టునా!

చ. అలుకనో యింటిపోరుననో యాసదొలంగినయట్లు మాఱురూ
పలవడగా దిగంబరులమంచు స్వ్రగంబరము ల్వరింపుచు
న్నిలకడలేని జోగు లవనింగల రెందఱో వారుజోగులే
యిలఁ దుది రాగులౌదురొగి నిప్పటిజోగులఁజూడఁ జిత్రమా.

తరువాత; తరువాత.

శంఖ—ఆపయిన నేదియైనను బుండుమీఁద గుఱుపులేచినట్లు స్వర్గాదిలోకముల రాక్షసబాధలు మెండయ్యె.

ఘంటా—సురల కయ్యది యెప్పుడు నున్నదే. దినదినము చచ్చువారికి నేడ్చువారెవరు. ప్రకృతమందీ నూతన యోగికి సహజవైరాగ్యము కుదిరెనా. కుదిరెనేని తన యున్నచోటు విడువనేల?

శంఖ—అది నాకును సంశయమే. నీకేమితోచును?

ఘంటా—చంద్రకళాలంకారున కేదో యొకసంకల్పము దగిలియుండును.

శంఖ—(విమర్శించి) అరే! నీచేసిన యోచన సూచనగానేయున్నదిరా!

ఘంటా—కారణము పొడగట్టినదా?

శంఖ—తెలసె. తెలసె. హిమవంతునికి వివాహోచితవయస్కురాలగు పుత్రికారత్నము కలదు.

ఘంటా—అగుగో! అదే! అందుకే యీ తపశ్చర్యావేషముతోఁ బొంచువేయుట.

శంఖ—కాని యంతవాఁడు స్థానముకదలి యట్టి యగచాట్లు పడనేటికి?

ఘంటా—సమయోచితమైన తనచేసిన కృత్యము దైత్యుల కుపదేశరూపమై ప్రతిఫలించుటయు నాఁటి యనూయ సురులమీఁద నింకను దొలఁగకుండుటయు స్వస్థలంబునఁ దలయెత్తుకొనలేక మాఱుమూల నమ్మించుకొండకుఁ జేరి దొంగవాఁకిట మంచము వేసియుండును.

శంఖ—ఆ! (నవ్వి చెవులో) బిగ్గరఁగఁ జెప్పుకుము. గుంభితము. గుంభితము! తెలిసినను భేదించఁగూడదు సుమా!

ఘంటా—(చెవులుమూసికొని) బధిరము వినసీయదు. బిగ్గరగా!

శంఖ—(తనలో నవ్వుకొనుచు) నీ బ్రతుకునకు బధిరము కూఁడనా. (నలువంకలఁ బారఁజూచి) ఎవరును లేరుగా. (మఱలఁ జెవులో) గుంభితము. గుంభితము! తెలిసినను భేదించఁగూడదు సుమా!

ఘంటా—ఇదా! ఇస్సి. అబ్బా. ప్రతిపత్తునాడు కనుపడని చంద్రుఁడు మఱునాఁడు దనకుఁదానే కనుపడును. (చంకలు గొట్టుకొని) వహ్వా! యేన నిజము గనుపెట్టితిని.

శంఖ—అగునోయీ! అంగవైకల్యము గలవానికి యోచన యధికము.

ఘంటా—ఆహా! అంగవైకల్యమా! నాకు శ్రవణేంద్రియవైకల్య మొక్కటి యేకా?

శంఖ—దానిపేరే యది.

ఘంటా—పోనిమ్ము, మనోవైకల్యము లేకుండనుండిన నంతియేచాలు.

శంఖ—ఇంతవరకు మనకుఁ దోఁచలేదు. గాని దైవికమైన పత్నీవియోగము సంభవించినవానికిఁ బునర్వివాహవిషయమై ప్రప్రథమములో రెండు మూఁడు స్థలాంతరములం బరిశీలించుట లోకాచారముగదా! యింతలోకములో మొట్టమొదట నితనిమనస్సెక్కడకే పాఱుటకు నిమిత్తమేమి? యిప్పుడు మనకుఁ దోఁచినదంతయు నుత్తదేమో!

ఘంటా—కాదు కాదు! ఉండు ఉండు. (కనులుమూసుకొని కొంచెమాలోచించి) అయ్యో! నోఁటిలో నాఁడుచున్నయది. (పాఱచూచి) ఆ! దీని కొకకారణమున్నది. (నవ్వి) బాగా జ్ఞప్తికివచ్చినది. ఉత్తప్పనేమియుఁ దోఁచదుగాని ప్రసంగవశంబున నొక్కొక్కటియే స్ఫురించుచున్నది.

శంఖ—నీ వసాధ్యుఁడవు. గాలిప్రోవుచేసి నిజము నిలఁదీయఁజూతువు. ఇది గూఁడ నోఁటరానిమ్ము.

ఘంటా—తెనసుఁ బుట్టినవాఁడే యొక్కకుమారుఁడు. వాఁడు వజ్రపాణివలని పక్షచ్ఛేదభయంబునఁ గస్సురుగా మున్నెటిపెన్నెఁట మునిఁగి నేఁటిదనుక లేవకున్నవాఁడు గాన హిమవంతుఁడు సంతానసౌఖ్యంబుచాలమి నప్పరమేశ్వరిని నుపాసించుటయు నయ్యంబ మెచ్చి యితని పత్ని మనుపుత్రియగు మేనకగర్భవాసంబునఁ దాన పుత్రికయై యవతరింతునట్లు వరమిచ్చె నని యొక ప్రతీతియుం గలదు. దానికిఁ దార్కాణగాఁ బ్రథమావతారం బీరీతిగా సమాప్తినొందించి వెంటనే యా వరము చెల్లించికొనఁ బార్వతీ నామంబున వీనియింటఁ బుట్టె నని మన మనుకొనవచ్చును.

శంఖ—శెబాస్! నీదిరా యోచన. టక్కున సరిపోయినది. యీ ప్రతీతి నేనును వినినట్లేయున్నాను.

ఘంటా—ఆ యుగ్రుం డుగ్రతపంబున నున్నవాఁడనియుఁ బయిగా రక్కసులొక్కతీరున లోకము నిక్కట్టులపాలు చేయుచున్నారనియు నీవ చెప్పితివి. మనము మనసులోఁ బ్రాలుద్రావుచుంటిమి.

శంఖ—అగును. సందర్భమునుబట్టి కార్య మనుమేయమే కాని యీశ్వరేచ్ఛ నిరూపింపఁ దరమా!

ఘంటా—రక్కసు లెక్కడకంఁగనిచే వరముల కొల్లగొన్నవారఁట. యిపుడింద్రోపేంద్రాదు లందఱు వీరిచేఁబడినవారలగుటంజేసి కాలానుసారముగా మంచి యోచనయే చేయుదురు. మనకేమిటొందఱ.

శంఖ—(నవ్వి) అయ్యో. నా తెలివి.

ఘంటా—ఏమిటోయి.

శంఖ — మొన్నటి విశేష మింకొకటి యిప్పుడే జ్ఞప్తికివచ్చినది. నారదుండిమధ్యం దనయింటికివచ్చి బోధించుటంజేసి హిమవంతుఁడు తనకూతురు సర్వమంగళ యగు నప్పార్వతీకన్యకను తపోనిష్ఠాగరిష్ఠుండగు నయ్యీశ్వరునొద్ద నుపచారంబు లొనర్చుటకు నియోగించి పంపినాఁడని యొకవార్త వినవచ్చినదిగాని యిదెంత నిజమో!

ఘంటా — ఇంకను నీ కనుమానమే.

చ. పదుగురు కొక్క-మాటు తమప్రాణముమీఁదకు వచ్చినప్పుడా
పదుగురు సైఁచ కయ్యెడను బాపుకొనం దలపెట్టి ప్రాణిపో
కడలకునైన నొప్పికొని కర్జము పొత్తుబడంగఁజూతు ర
య్యది సహజంబయౌగభుజలందఱు కిత్తరి నూరకుందురా.

యీ సందర్భము సురేంద్రాదులు చేసినదేకాని యితరముకాదని నా నమ్మకము.

శంఖ — అగును. అదియును యోచింపఁదగినదే! యీలోపలిసంగతి వారికేమి తెలియును. సర్వేశ్వరుని మఱలఁ బ్రవృత్తిమార్గములోనికి రావించితిరేని వీనివలన నిక్కట్టు లన్నియుఁ దొలగించుకొనవచ్చునని యూహ వారికి నుండవచ్చును.

ఘంటా — అహహా! తఱచఁగఁ దఱచఁగ నింతవట్టున నవనీతము వొడమిన దిదికదా! కాని యిక్కడనే చమత్కారము.

శంఖ — అంతియుఁ జమత్కారమే. మన మెఱిఁగిన చెవులకు మద్దికాయలా!

ఘంటా — మంచిమాట తొడికినదిరా నీవు.

చ. మునియఁట వేల్పుమాఁక లిఁకఁపూనొకని చేసిన కుట్రనమ్మి వ
చ్చిన సుదతీలలామయఁట సేవకురాలఁట వానియొద్ద నే
మని మనయూహచెల్లు నిపు డయ్యెడ నేమి విచిత్రమౌనొ యీ
చనుపనెపోవు చూచుదమె సర్వము కన్నుల పర్వమౌగతిన్.

మన మీ ద్రోవనే పని యాఁదరి దరనే మెసలుచుంటిమేని యిక్కడి విశేషము లన్నియుఁ జూడవచ్చుఁ గోదమా!

శంఖ — తీరము స్వార్థము గలసివచ్చును. పదపద.

(ఇరువురు నిష్క్రమించుట)

ఇది విష్కంభము

## ద్వితీయ రంగము

### (ఆశ్రమద్వారము సీన్)

(ప్రవేశము — దండహస్తుఁడై భృంగి)

భృంగి. — (వణుకుచు ముడుచుకొని గొంతుకూర్చుని) హు. హు. హు. హు. హు. హు. హు. హు. య. య. య. య. యేమిచలి! యేమిచలి!! కాలుచేఁతులు

ముద్దకట్టుచున్నవి. యీ మంచుకొండ మహిమయేమి. (లేచి కొంచెమువంగి ముందుకు బదియడుగులు నడచి యటునిటుఁజూచి) నాజన్మ యీ సేవావృత్తితోనే సరిపోవు చున్నది. ఆహాహా! చిట్టచివరకు వీని కెట్టిచోటు దొఱకినది. యిక్కడగా వీని తపస్సు. వీనికేమి నా యరచేతి లావుగల మదపుటేనుఁగుఁదోలు కప్పికొని పంచాగ్నిమధ్యమున నుచ్ఛ్వాస నిశ్వాసములు రానీయక కూర్చున్నవానికిఁ జలి తెలియునా వలి తెలియునా! నౌకరుల కష్టసుఖములు తెలియునా? కలవాని కెప్పుడు దనక్రిందివారిని తన ముంగిట నిలఁబెట్టుటమాత్రము పూర్తిగఁ దెలియును. నాటనుండియు దక్షవిరోధముల త్రొక్కి గదా! యది వదలినదనుకొన నిప్పు డంతకంటె నెక్కుఁడు త్రొక్కువచ్చె—నెందుకిది శుభ్రముగఁ బునర్వివాహప్రయత్నము చేసికొనరాదా! యీ మంచుటాలలో నివ్వాఁకిట నన్ను నిలబెట్టఁ దనకుమాత్రము తపసుదోఁచునా!

(పార్వతి, కలవాణి, నవమాలిక యను నిద్దరు సఖియలతో ప్రవేశము)

పార్వతి—ఆర్యా! యీశ్వరుఁ డెక్కడ?

భృంగి—మీకేమి పని.

పార్వతి—దర్శనార్థము.

భృంగి—ఆహాహా! యీ స్థాణువును దర్శించినమాత్రాన నీకు ఫలితమేమి.

పార్వతి—(సిగ్గుపడి యూరకుండుట.)

కలవాణి—అంతమాత్రము కాదు. వానిచెంత నుండి కొన్ని యుపచారములు గావింపవలెనన్నది. యిదియ నా చెలి యభిప్రాయము.

భృంగి—(వక్షఃస్థలంబున హస్తంబు బెట్టుకొని గంతులువేయుచు) అమ్మయ్యో! అమ్మయ్యో! యింకేమైన మానప్రాణములు దక్కునా!

నవమాలిక—(నవ్వి) ఇంతమాత్రములో నీకు మానప్రాణములు పోవుగాని వాని దర్శనము చేయించుము.

భృంగి—చాలు. చాలు. యేమి నీ మాఁటలు! మహాయోగుల తపస్సెక్కడ, స్త్రీల పరిచర్య లెక్కడ! (పకపకనవ్వి) మీ రీ దటికిఁగూఁడ రాఁగూఁడదు.

పార్వతి—ఆర్యా! నేను హిమవంతుని పుత్రికను. గంగాధరుని సేవించుటకు మా తండ్రిపనుపున వచ్చినదానను. నా మనోరథము చెల్లనిమ్ము.

భృంగి—అట్లనా! ఆ (పార్వతిని బారఁజూచి) అట్లని కొంచెము నిలుఁడు నామనసున యోచించుకొననిండు. (కొంచె మవతలకుఁ బోయి స్వగతము) ఇంకేమి తపము! ఇంకేమి వైరాగ్యము! హైమవతియఁట కన్యారత్నము. దీని వీని యొద్దఁ దగులించితినా! పంచశరుం డెప్పుడో కనుమూసి నంతనే యీమృగాంకుని హృదయ మృగంబును దీనిదరహాసకటాక్షపరంపరా వాగురికలలోఁజిక్కించ గలఁడు. నేడో, రేపో, మాఁపో యింతే. యీయమ్మవారు రానేవచ్చినది. యిఁక బెద్దమ్మవారు వదలి పోవచ్చును. గాని యిక్కడ నాచమత్కారమించుకంత జూపింతును. (మఱలివచ్చి

(ప్రకాశముగా) అమ్మా! నీకు నాయాతంకములేదు. శంకరుండడుగో పొమ్ము. కనులార జూడుము. చెవులార వారిసూక్తులు వినుము. మనసార వానిపరిచర్యలాచరింపుము.

పార్వతి—

ఉ. కన్నెను జిన్నదానను సుఖంబుగ నీశ్వరు దర్శనంబు ద
త్సన్నిధిఁ జేయఁ బోలు నుపకారము లెల్ల భవన్ముఖంబుగాఁ
దిన్నఁగఁ జేయ నెంచితిని దేవుని సన్నిధి నుండువాఁడవో
యన్న సమస్తముం దెలియ నాఁడుము పేరిడి నాకు శూలికిన్.

సుముఖంబుగా దర్శనంబిచ్చి నాచేయు పరిచర్య లంగీకరించఁగ నద్దేవునకు నయ్యావి యి[illegible]వని నాకును బోధించి యనుసంధానముచేయుము.

భృంగి—అవును. ఎవని సంగతి వానికే తెలియును. విను.

చ. కరము విరాగుఁ డీ శివుఁడు కావలెనన్నది లేదొకింతయు
న్గిరిగమనామణీ యిపుడు నాకును వీనిమనోగతంబులె
క్కరణి నెఱుంగ నేనిచట గావలియుండు మటంచు బెట్టెన
న్నిరుకున బెట్టనేమి ఫల మీతని వైఖరి నీ వెఱుంగవే.

సీ. జలపాత్రఁ దోమి నిచ్చలు నిత్తు నంటివా
పుఱ్ఱెచిప్పను జేత బూసఁగఁబట్టె
మడిపాఁత లార్చి సమ్మతినిత్తు నంటివా
గజచర్మ మొడలిపైఁ గట్టనేర్చె
పూలపేరులు కంఠమునఁ గూర్తు నంటివా
పెద్దబొమికలపేర్లు వ్రేలదాల్చె
మంచిగంధము దీసి మై నలందెద నంటి
వా బూదిపూఁతల నలరువాఁడు
తే. గీ. సతము దానమునకు జలమిత్తు నంటివా
గంగనిలిపె నుత్తమాంగమునను
ఫలము లందించ బచరింతు నంటివా
విషము మెసఁగువాఁడు వినవె తల్లి.

మంచి గంధముదీసి చేతికి నందింతునంటివా, బూదిపూఁత లొడలెల్లఁ బూసికొనువాఁడు. సురఁటి చేఁతబట్టి విసరెద నంటివా! యా మొలక తెమ్మెరలు పైవి పైన కబళించఁ బడగలెత్తియాఁడు పెను పాఁపతొడవుల నొడలినిండఁ దొడఁగిన వాఁడు. ఇట్టివానికి నీచేయు నుపచారములు యేమియున్నవి.

తే. గీ. పనులు లేవిట శూలికిఁ బద్మగంధి
నగవుపా టౌదు వోయమ్మ నగకుమారి
సరసిజాక్షిరో సరసుఁడా సరసఁ జేరఁ
జాలుఁజా ల్దండ్రియింటికి సాఁగుసాఁగు.

పార్వతి—ఆర్యా! లేదు కాదనుట యెక గొప్పకాదు. పురుషాకారమనఁగా నీవల్ల నీకార్యము కావలెనని వచ్చిన వారియిష్టములు శక్తికొలంది నెరవేర్చి నిష్కపట ముగఁ బ్రయత్నించుటయే సుమా!

గీ. భక్తుని యుపచారములు సేయ వచ్చినాను
చేఁతనైనవి తగునట్లుఁ జేసి కొలుతు
నద్దమాఁటలు సెప్పక యరసి కొన్ని
పనులు వివరించి చెప్పుమా పరమభక్త.

భృంగి—అబ్బబ్బా! యిట్టి సాహసంబుచేయఁజాలను. నీకేమి! నాకు స్థాన భ్రంశమే.

పార్వతి—ఆర్యా! నీకింత భయ మక్కఱలేదు. నన్నొక్కప్రక్క చాఁటుగ నుంచి సందర్భమంతయు స్వామి కెఱింగింపుము. తరువా నా యదృష్టము.

భృంగి—తల్లీ! నీ యీ యన్నమాఁట కడు శ్రావ్యము. మంచి దట్లేచేయుదును. నీ నోముఫల మెట్లున్ననో.

(అందరు నిష్క్రమించుచున్నారు)

---

## తృతీయ రంగము

### పర్ణశాల సీన్

(ప్రవేశము—పద్మాసనంబు వేసికొని జపముఁజేయుచు శివయోగి, వాని యెదుటఁ జేతులు జోడించి నిలుచుని భృంగియు, ఒకప్రక్కఁ గొంచెము దూరమున సఖియలతోఁ బార్వతి.)

భృంగి—స్వామీ! నేను భృంగిని.

శివుఁడు—(కన్నులు దెఱచిమూచి) ఏమిరా!

భృంగి—నాది యొకచిన్న విజ్ఞాపన.

శివుఁడు—ఏ మది?

భృంగి—ఆగ్రహపడకుంటిరా చెప్పుచున్నాను.

శివుఁడు—ఆగ్రహ మేఁటికి? మాకు శాంతమే ప్రధానము.

భృంగి—మీకు శాంతము ప్రధానము కాని పొడుగున నీ కది కనుపడవలెగా!

శివుఁడు—కామక్రోధాదుల వర్జించి కేవల వైరాగ్యనిష్ఠలోనున్న మాకు నింక ననుమాన మేలరా!

భృంగి—(గడగడలాడుచు) ఆర్యోత్తమా! మీ రట్టివారె. నోఁట నాఁడు చున్నది. చెప్పుటకు నోరు రాకున్నయది.

శివుఁడు—నీకు వచ్చిన భయములేదురా!

భృంగి—స్వామీ!

ఉ. కామములెల్ల బోవిడచి కానలఁగోనల నివ్విథంబుగా
నీమములెల్లఁ గొల్లఁగొను నీకడ కల్లదె వచ్చుచున్న దీ
కామిని పెద్దశక్తివలెఁ గన్పడుచున్నది నీ కిదేఁటి కీ
భామిని సాగసంపుదునె పైబడెనా నగమాదు వీశ్వరా.

ఆ. వె. సరస నుండకుండ సాగసంపుదునయ్యా
తపముఁ జెఱుపునేమొ తలిరుఁబోణి
నీవు దీనిఁజూడ నిజముగా యోగంబు
వదలి దీనివెంటఁ బడెద విపుడె.

శివుఁడు—(చిఱునవ్వు నవ్వి) ఏమిరా! ఎవరా తన్వీమణి? వచ్చిన యుద్దేశ మేమో కనుగొంటివా?

భృంగి—(అంగనిటుఁ జూచి)

ఉ. చక్కనిబొమ్మవచ్చినది స్వామి యిదేమొ భవత్తపంబు పెం
పెక్కనె యింక నీ సరస కీ రమణీమణి చేరునంతలోఁ
జిక్కులపాలు గాఁగలవు చిత్తము నిల్పుము సొఁగసంపెదర
నిక్కము నాఁటినుండికల నిబ్బర మిప్పుడమావె కావలెన్.

శివుఁడు—అగునురా! ఆ చిన్నది యెవరు? ఎందుకువచ్చినది? సంగతి చెప్పవేమి?

భృంగి—అ! అ! చిన్నదా! యీ హిమవంతుని కూఁతురఁట; పెండ్లికాని పడుచఁట; నిన్ను సేవించుటకు వచ్చినదఁట.

భృంగి—అన్నిమాఁటలు రాదీసినానుసుమా! కాని నామాఁటవిను.

మ. ఇది నీ దగ్గరఁ జేరి నీ పనులు దా నేమేమొ కావించి నె
మ్మది నీదాస్యముఁ జేయవచ్చినటు లీ మాఁటల్నిరూపించుచు
న్నది నీ వొప్పితివేని దీనివలపాలై యోగమున్వీడి త
న్మృదుభోగంబుల మున్గుచుండెదవు స్వామీ యింతి నంపింతునా.

శివుఁడు—

ఉ. ఏమిర భృంగి నన్నిటుల హాస్యపుమాటలఁ బోకరింతువే
నేమరుపాటుఁ బొందకదునె యింతి దనంతనె చెంతఁజేరి యే
మేమొ యొకింత సేవ చరియించినమాత్రనె లోపమేమి యా
భామయు భక్తురాలిచట భావమునిల్పిన నిల్పుగావుతన్.

ఉ. చిన్నది బుద్ధిగల్గి మనచెంత నిరంతర భక్తితోడఁడాఁ
జెన్నెసలార సూనతులసీదళము ల్మనపూజవేళలో
మిన్నక తెచ్చి యిచ్చుచు సమీపమునం దిలకింపవచ్చు ని
వన్నియు లించుకైనను భయంబునరా దిట నుండనిమ్మురా.

భృంగి—అబ్బ! అబ్బాల చక్కఁదనాలనప్ప అదేమి ని నుపచార మేమి? దాని నెగాదిగఁ చూచుటతో సరి. మొదట సంసారభ్రష్టుఁడ వైతివి. తరువాత స్థానభ్రష్టుఁడ వైతివి. తుదకిప్పుఁడు యోగభ్రష్టుఁడవుకూడ నయ్యెదవుసుమా! నన్ననవలదు సుమా!

శివుఁడు—

చ. మన కిది హానిచేయ దనుమానము పెట్టకు మోరకంటనై
నను లలితాంగిఁ జూడను మనంబునఁ దల్చను బల్కరించ నొ
య్యనఁ దరివేచి పూజకను నన సుమాదులఁ దెచ్చియిచ్చులాఁ
గున నియమింపు మోరి వరకుంజర కుంజరగామినీమణిన్.

భృంగి—(నవ్వి తలయూఁచి) పామునకాళ్లు పాముకే తెలియునట్లు మొదట నుండియు నీపట్టిన యతను యోగంబ తనుయోగంబై తుదముట్టునని తోచుచున్నది.

శివుఁడు—(నవ్వి) ఓరీ భృంగీ! నీమాటలలోని వ్యంగ్యము నాకుఁ దేటతెల్లము కాదనుకొంటివా కొడుకా! అంతపని యెంతటను గాదనుకొమ్ము.

భృంగి—దేవా! మీ యాన కడుఁగు దాఁటుదునా! యిదుగో. (కొంచె మావలకుఁబోయి పార్వతితో) తల్లీ! నా చమత్కారంబుఁ గనుపెట్టితివా! యీ కాలంబునఁ ద్రోవనేపోయి త్రోవనే వచ్చువానికిఁ గార్యసిద్ధి దుర్ఘటము. నేనెట్లుమాటాడవలెనో యట్లే మాటలాడి మీకార్యం నీడేర్చుకొని వచ్చినాను సుమా!

కలవాణి—భృంగీ! శివాంతరంగీ! నీమాటలిక్కడను నక్కడను బ్రతికూలము లేకా!

నవమాలిక—(కలవాణితో) ఓసీ! అన్నియు మన చెవులఁ బడుచునేయున్నవి. యింకఁ దరచకు.

పార్వతి—(సఖియలతో) కొన్నికొన్నిచోటులఁ బ్రతికూలముగ నాడినఁ గాని యనుకూల పడదుసుమా ! అక్కడ సందర్భమంతే. భృంగి వారియంతరంగ మెరింగినవాఁడు.

భృంగి—ఆహాహా !

చ. తరుణి ఫలించె నీతపము తప్పక చెప్పినయంతలోనె యీ
పురహరుఁ డాదరించి తనపూజకుఁ బూవులుదెచ్చియిచ్చు న
ట్లరయు మటంచు నన్ననిపె నన్నిజగంబుల తల్లివాదు విం
దరమరలేక నీ విక సదాశివు సన్నిధి సేవసేయుమా.

(ఎవరు వినకుండగ ముందుకు వంగి)

జననీ ! సదాశివుఁడు నిన్ను గరుణించినాఁడు. ఎన్నఁటికైన మీరిద్దరొక్కటి యైతిరేనిఁ దద్దయు గరుణ నామీఁద నింపవలయు సుమీ !

పార్వతి—(చిఱునవ్వునవ్వి సిగ్గు నభినయించుచు శివునియొద్దకుఁబోయి ప్రదక్షిణముచేసి స్తుతించుట)

ఉత్సాహవృత్తము.

బాలచంద్ర చారుచూడ పరమచిద్విలాస నీ
పాలజేరినాను లీలభక్తి ముక్తిపాల నీ
శీలమెఱుఁగఁజాల బాలఁ బిన్నసేవలిడుదు నా
పాలిభాగ్యమీవదేవ, వాలుగంటి నేలవే॥

ఉత్సాహవృత్తము.

నేలతాల్పుపట్టి నేను నేర్పుమీఱ నోర్పుతోఁ
బూలునవలు మంచిపండ్లఁ బూజవేళ నీకునే
నోలిదెత్తుఁ బాళినిత్తు నుత్త రోత్తరర్ధిగా
నీలకంఠన న్నకుంఠనిచ్చలచ్చ నేలుమా॥

(చెలులతో) మనము పుష్పావచయనార్థము వనమునకుఁ బోదము.

(అందరు నిష్క్రమించిరి)

---

## చతుర్థ రంగము

### వనము

(ప్రవేశము—పార్వతి, చెలికత్తియ లిద్దరు)

పార్వతి—

చ. గుమగుమ లాడుచున్నయవి కోయుదమా చెలులారపూవులన్

కలవాణి—

సుమము లివెల్ల నిప్పటివె సుందరి యుందికొనుము నేర్పుతో

నవమాలిక—

సమయము మించకియ్యవలెఁ జయ్యన కోయరె కందకుండఁగా;

పార్వతి—

శమదమశాలి పూజకివి చాలవు పోద మికిన్నికోయరే.

కలవాణి—

ఉ. పువ్వులు వంతువేసికొని పొల్పుగఁగోయుదమమ్మ పార్వతీ
నవ్వులమోము తల్లివిఁక నవ్వకు రవ్వకు రాకు నవ్వితేఁ
బువ్వుల కానవాలు గనబోలము వైలను నీవుపోవలెన్
దవ్వుల కేల నీకడలఁ దాఁకిన వెల్లను గిల్లుమల్లనన్.

తరళవృత్తము.

నవమాలిక—

వనలసందున దాఁగియున్నది నాఁతికమ్మని తావులం
దనరుచున్నవి పూవులెన్నియొ దాటిపోవఁగ నేఁటికే
మనకు నేఁటికిఁజాలుఁ బూలను మందయానరొ కోయరే
తొనకనీకుము పూవుదేనెలఁ దోలుతోలుము తేఁటులన్.

అంబురుహ వృత్తము.

పార్వతి—

తుమ్మెదలిమ్ముగ గ్రమ్ముచునున్నవి గోలిన న్వాడి పోవుపూఁ
దుమ్మెగఁజిమ్ముచు జుమ్మనుచు న్వడిఁ దోయజాక్షిరో తోలరే

కలవాణి—

ద్రిమ్మరిహుమ్మని పొమ్మనఁబోవును ధీరవైవిరు లేరవే
నమ్మిఫలమ్ములు నెమ్మది ద్రుంచవె నాఁతిరో వెఱపేలనే॥

పార్వతి—

పచ్చరాలకు రంగు లిచ్చెడి పచ్చిదూర్వలయగ్రము
ల్మెచ్చకంటిరో చిచ్చుకంటికి మచ్చువంటివి కోయరే
పచ్చవిల్తుని హెచ్చరించెడి పంచపుష్పము లేరవే
నిచ్చనిచ్చటివేన తెచ్చెద నీవు తెమ్మని నెచ్చెలీ.

నవమా—

ఇంతిరో మన మింతలో వనమెంతజూచినఁ దీరునా
వింతవింతగఁ బూలుపూచెను వీనితావులు నీఁచెడిన్
గొంతులెత్తుక కూయుచున్నవి కోకిలల్విరికొమ్మలన్
సంతసంబిట సంతకంతకుఁ జాలఁ బెద్దదగుం జుమీ.

పార్వతి—

బంతిగానలి సంతతు ల్గనుపంతము ల్గెలిపింతు మం
చంతలోఁ బిలిమింతరాలిడు చంతికంబున నున్న చా
మంతిపూవుల సంతకుందిగి మంతనంబునఁ బాడుచు
న్బంతిపూవుల కంతఁబోవను పంతుగాఁ బిలుపింతమా.

కలవాణి—

కలికిచూడు గులాబి గేదఁగిఁ గాఁగలించెను వాసన
ల్వెలికి మించెను జాజిమల్లెల పిల్లతెమ్మెర హాయిగా
గులుకుచున్నది గండుఁగోయిల కొమ్మసందునఁ గూసెనే
చిలుకబలుకులో నీదుపలుకులో చెప్పఁజాలనె నెచ్చెలి.

నవమాలి—

చ. మునితరు వల్లదే కనుము ప్రోలఁ బరాకు చిరాకులేక చి
క్కని ముకుళైకభాగ్యమునఁ గ్రాలెడుదానికి వామసీమ నీ
వనలత పూలుపూయుటకు వాసితమై మఱి రెండు తీవియ
ల్గన జతఁజేరి రాఁగవియఁ దా సరదాకలదయ్యె నియ్యెడన్.

పార్వతి—

చ. నవనవ పుష్పజాతులు మనంబున ముగ్ధలు మూఁటఁగట్టుచు
న్నవి చెలులార పూజకివి యాదిన మేలగుఁ గందనీకయీ

పువ్వులను గోయ రే నవల పొంకము జూడరె కన్నులారనా
శివుఁడివి పూజసేయునెడ శీతల భావముఁ జేయునామెడల్.

కలవాణి—పువుఁబోణి ! యీగంగానదీ పరిసరారణ్య ప్రదేశంబుఁ జూచితివా! యిది నీతండ్రిమహాభాగ్యము. మహాదేవుం డిచ్చటఁ దనయిచ్ఛతీరఁ దపోనుష్ఠానంబవలం బించె నద్దేవుని యుపచారంబులు నీవు నలవడె. దీనం జేసి నీకుఁ బరమైశ్వర్యం బనివార్యంబుగ రానున్నయది.

నవమాలి—(నవ్వి) చక్కనిబొమ్మను నిక్కమ యెక్కసక్కములాడు చున్నావఁటే ?

కలవాణి—కాదుకాదు. శివపూజాఫలం బూరక పోవునా ! మనచెలి మహారాజ్ఞి కాదే !

నవమాలిక—అట్లైనచో మనశకము నిరాతంక మే. కానిమనల నింక నోరకంటనైన గనుంగొనునే !

చ. శివుని ప్రసాద మొందుటకు సిద్ధముగా నొక కొన్ని సేవలం
దవహితమైనటించు తఱి నాదరము న్మనమీఁదఁ జూపెడిం
జవరకు వానిలోఁ గలిసి చిత్తములో మనలం దలంచునో
శివశివ చిన్ననాఁటి మనచెల్మి యిదేఁటికి నింక బోఁటికిన్.

పార్వతి—(కనుబొమ్మల చిట్లించుచు)

ఉ. మీరిటు మీఱి చెప్పుదురె మెళ్కువలే కులికుట్టుమాఁటలం
గోరికచాలుజాలు నికుగోపదరే పరమేశు పూజకై
బోరునఁ బూలుగోసికొని పోదము మోదముతోఁడ రారెమో
నీరజనేత్రలార నుడి నేర్చితిరొర యవేటిమాఁటలే.

(నాలుగైదడుగులు నడచి పూలుగోయుట)

కలవాణి—

ఉ. రూపవతీమణీ వరనిరూపణ ముచ్చట కంటి మింతలోఁ
గోపమిదేలనే నిలుము కూఁడనె పోదము పూలుఁబత్తురు
ల్ధూపపుద్రవ్యము ల్వరుసఁదోడ్కొని వచ్చెదమమ్మ కొమ్మరో
నీపతి పూజ వేళ కివి నేర్పున నొర్పున నందఁజేయవే.

నవమా—

ఉ. నవ్వుల కన్నమాఁటలకు నాతిరొ కోపముఁజేయ నాయమా
దవ్వుల కేఁగుఁదెంచితిమి తాళుము తాళుము కూఁడఁబోదమీ

పువ్వులు నాల్గు నందుకొనఁ బూజకుఁజాలినవన్ని యౌనుమా
యవ్వపుపువ్వుబోణి యిపుడా సమయం బిటు రవ్వజేయఁగా.

పార్వతి—సకియలారా! యొకసక్కెపుమాఁటలు మానిరండు. చూడు డివ్వన ప్రదేశంబు లెంత సొంపుతో, గండుంగోయిలల పంచమస్వరంబుల నంచితంబైన క్రొమ్మావి తోఁటలు, పన్నీటియంత్రంబుల చెంగట రంగారు బంగారు పనిరంగుల సింగారంబై నింగికిఁబొంగారు బంగళా మేడముంగలఁ బలుతెరంగులఁ జెలంగిన సంపంగల గుమగుమలనొప్పారు నప్పారిజాతంబులు గుప్పుగుప్పున నుప్పరంబునకు నుప్పతిల్లెడి కప్పురంపు బుప్పొళ్ళతోఁ బరువమ్ముద్రొక్కెడి మరువంపు మల్లెలును, మల్లె పందిళ్ళ కిరుగడల గడలుకొని పెచ్చుపెఱిగిన పచ్చకప్పురపుటనఁటుల నల్లిబిల్లిగ నల్లికొని వెల్లివిరిసిన ద్రాక్ష పందిళ్ళకీవంకలఁ బొటకరించెడి దర్భమోటికల బీఁటికెలకుల నోటి కలర మేఁతమేసి సెజ్జల నొత్తిగిల్లి పల్వాలంబుల నిల్వంబడిన పూదేనియల నొప్పుగఁ దప్పిదీర్చుకొని పూఁబొదలఁగుఱిసి విఱిసి పారుచున్న పన్నీఁటి తెలినీఁటికాల్వలఁ జెల్వుగ నోలలాడి వెడలినకమ్మని ముల్కతెమ్మెరలవలన హాయిగలిగి మోరలెత్తి పరుగులెత్తెడి లేడికొదమల యడుగుల నక్కడక్కడ నల్గుఁడు వారిన చామంతి కుదుళ్లును, జామంతి కుదుళ్ల సందున నింపు సొంపులు పెంపగుచున్న సుర పొన్నలును, సురపొన్నల జెన్నొందినపొన్నలును, పొన్నలపై నెగబ్రాకు లవంగలతాకుడుంగములును, లతాకుడుంగములనిండ బిండారబోసిన విధంబున నిండారినవ్వుచున్న క్రొవ్విరులుంగల్గిచూడ సొంపైయున్నయవి. నేటికి శశికిరీటునికి పూజార్హంబీపుష్పంబులు చాలు మఱుపూట మఱల నరుదెంతము. పోవుదమే?

కలవాణి—(నవమాలికతో) చెలీ! మనచెలికి నొక్కచిన్న చెలువంపుమాఁట చెప్పుచున్నాను. నీవును పరధ్యానంబులేక విను. (పార్వతితో) మందగామినీ! ముందట నందంబైన యిమ్మందారంబుఁ జూచితే! చిగురుంజెడల జెన్నొంది పొందికతోఁ బెనవడి యల్లికొనిన తీగలనెడి పాపఁపేరులఁబేరువడి విరుల చాలనెడి నెలకూనపైకడ నింపుమెఱయఁ బుప్పొడియను బూఁది పూఁతనలందికొని యమంద మకరందధారా మందాకినిం దాలిచి భృంగుల యభంగురకుటిల నటనంబులచేఁ బ్రసన్నంబై యపరశివుం డనఁదగి యున్నది. దీని సరసనించుకంతఁ జేతులుజోడించి నిలుచుండుము. చూతు నెట్లుండునో?

పార్వతి—(చిఱునవ్వునవ్వి) నన్నేమి నవ్వెదవే! గనుకనే కలవాణివి. (మఱి నాలుగడుగులు నడచి పూలుగోయుట)

నవమాలిక—కలవాణీ! మనచెలికి శివపూజాపారవశ్యం బింతింతని చెప్పఁదరమా చూడు.

సీ. ననలు గోయఁగఁ బోయి ననలంచుఁ దన చేతి
కొనఁగోటి తళుకులఁ గోయబోయె

తన చేఁతి కొనగోఁటి తళుక్కు లేయని మూనె
నవలఁ జేఁజేతఁ బట్టినవె 'యహార
తనచూఁపు గుంపులు తవిలి తోలఁగఁబోయె
దరికించి తుమ్మెదదాటులనుచు
మునరు తేట్లను జూచి ముఱిపెంపుఁదన చూఁపు
లని తోలఁబోవ దియ్యలరుఁబోఁడి
తే. గీ. చూచి నావఁటె గట్టురాచూలి శూలి
మీఁద మనసున నెల కొల్ప మెల్ల మెల్ల
జేయు పనులివి నిచ్చ లచ్చెఱువులయ్యె.

(పార్వతితో)

పూవులివిచాలుఁ బోదమా పూవుఁబోణి.

పార్వ—(ప్రొద్దువంకఁజూచి)
జపిశ్రీఁ దెచ్చినావు శీఘ్రిమ పోవలెఁ బూజాకాలము సమీపించుచున్నది.

(అందఱు నిష్క్రమించుట.)

---

## పంచమరంగము

### పర్ణశాల

(ప్రవేశము—యోగనిష్ఠఁజూపుచు శివుఁడు, పరిచర్యఁజేయుచుఁ బార్వతి, కొంచెము దూరముగా నొకప్రక్కను, కలవాణి, నవమాలిక.)

కలవాణి—చెలీ! చూచితివా! మనచెలికి నీశ్వరోపచార పారవశ్య మింత యొప్పునే? చూడు. చూడు.

చ. నిరుపమ రూపవేషములు నెయ్యము నొయ్యనఁ జూపునట్లు సం
బరమునఁ జేరువం దిఱిగి మాలిమితాలిమి బాళిమీఁరనీ
గిరిజ గిరీశుభావగతికిం జతయై మతయై పరాకుసే
కురనిఁకు కొక్కరీతి ననుకూలపుఁజేతలు సేయుచున్నదే.

నవమాలిక—ఓసీ! అగునే! అదుగో చూడు.

చ. కరము కరంబులున్ముడిచి ఖండనిశాకరమౌళి చుట్టునుం
దిరిగెడి వేళఁ జెక్కులఁదీర్చిన వజ్రపుఁ గ్రమ్మజోళ్ళ త

త్తరపుఁ దళ త్తళల్దుఆలి దట్టపుఁ గెంజెడలోని యేఁటివెం
దరగల మీఁదఁ బారి వెడ తైతకలాఁడుచునున్న వే చెలీ.

కలవాణి—

చ. కులుకుచుఁ జిన్నినవ్వ్వులయఁ గూరిమి సన్నిధిఁగోల్పుచున్నయా
కలికి కచప్రభాచకచక ల్చెలరేఁగి విరాగిమైన యు
త్పలసుహృదంకురాభరణు భద్రగళంబును గౌఁగలించెఁ దో
య్యలి నిలఁబాటి వారిహృదయంబు నెటింగనొయేమొచూచితే.

నవమాలిక—

ఉ. తిన్నఁగ జేఁతు లొగ్గి యొక తీరున నొఁదలవంచి మ్రొక్కుచోఁ
జెన్నెసలారు నెన్నొసఁటి చెల్వము చూచి సహింపులేకయా
పన్నగరాజభూషు తలపైఁగలపు వ్వది వాడుసూపి తా
మిన్నక చిన్నవోయినది మేచకవేణిరొ చానఁ జూచితే.

కలవాణి—

ఉ. పంకజనేత్రఁ జూచి కరపద్మమునం గల జింకపిల్లసా
శంక మనస్కమై బెదరి సాఁగఁదలంచు టెటింగి బాలచం
ద్రాంకుఁడు యోగలీల కనువౌ యరచూపున నీయొయారి ని
శ్శంకమనంబుతో నరసి చయ్యన నిష్ఠను బెంపు చేసెడిక్.

(భృంగిప్రవేశము)

భృంగి—(అర్ధనారీ రూపముతో)

(ముక్కున వ్రేలు ఘటించి యాశ్చర్యముతో) ఏమిచిత్రము! మీచెలికిప్పుడే స్వతంత్రప్రచారము యోగప్రచారుని యొద్దఁ గలిగినట్టులున్నదే. అదుగో యీయిద్దరకు బూర్వసంబంధ మేమైనఁగలదా!

కలవాణి—మీరట్లనఁదగునా; మహానుభావా! మా హైమవతి కిన్ని యాలోచన లున్నవా! కన్నియగదా! పూర్వ సంబంధ మేమైన నున్నదా యంటివి. మాకేమి తెలియుఁ బరమేశ్వర సన్నిధానవర్తివి. నీకే తెలియందగు.

భృంగి—

ఉ. కన్నియ మైననేమి! మఱికన్నెకె వన్నెలు జిన్నె లెక్కువౌ
నన్నుల మిన్నగాదె; యిది యన్నెలదాలుపు మున్నుగన్న య
ట్లున్నది గాని దీనికిట నుగ్రుని యొద్దను గ్రొత్తలేదు పో
యెన్న విచిత్రమయ్యె నిది యేమగునో యిఁక ముందుఁజూడ రే.

పరిసరమున నీ విరాగి యెడమ భాగము నెగాదిగ రెప్పార్చక చూచుచున్నది. చాలుచాలు రమ్మనవే!

ఉ. సందాక యింత యీయెఁగనె చక్కఁగఁ దాబోఅవేయుచున్నదీ
సుందరిఁజూచితే తనకు శూలి వచింపని చెయ్వు లేలని
య్యందఱ మిందుమౌళి కహహా! విడువందగు వారమాదు మే
మందును జాలురమ్మనరె యమ్మని పొమ్మననందమా యిఁకన్.

(పాఱఁజూచి) ఆ! ఆ! వద్దు వద్దు పూజోపచారము లర్పించి యీ కన్నియ యిటుమొగంబై వచ్చుచున్నదిలే?

పార్వతి—(వచ్చి)

ధ్రువకోకిలావృత్తము

పార్వతి—

మునికిఁ దెచ్చిన పూవులిచ్చితి ముందుగా మన పూవులే
తనదు పూజకుఁ బ్రీతిఁ జూపుచుఁ దా గ్రహించెను జక్కఁగా
మనమిఁకన్మఱి పూఁట పూఁటకు మానకచ్చటి పూజవే
పునికి తెత్తము రారె పోదము పూలతోఁటకు నిప్పుడే.

నవమా—చెలీ! యీ భృంగి మనకు నిక్కడ ననుసంధానకర్త గదా! యితఁడుపదేశించు మాఁటలు వినుము.

కలవాణి—సఖీ! నిర్ణీతమైన యుపచారము మాత్రముఁ జక్కఁ బెట్టుకొనుము. ఎక్కువకుఁ బోకుము.

పార్వతి—భృంగీశ్వరా! నీ యభిప్రాయ మేమి?

భృంగి—అమ్మా! యీయోగి మహా రాజయోగి. వీని చిత్తవృత్తి కడు సున్నితము. ముక్కునఁ గోపము పిలిచినఁ బలుకుచుండును. గాని వీనికి గోపప్రాసాదములు రెండును సులభములే యైనను నీపని యెంతో యంతఁ జేసికొని కంటిముందట నిలువక తొలఁగిరమ్మ. చను విచ్చెగదా యని చొఱబడి మీదిమిక్కిలిఁ దెచ్చుకొనకుము.

ఉత్సాహావృత్తము

తిన్నఁగా జగన్నివాసుఁ దెలిసికలసి మెలసినీ
వన్నగాధిరాజు మనసు నలుసు చేసికొనకయో
పొన్నిసేవ లెన్నఁబడుచుఁ బొసఁగు మమ్మ యిమ్ముగన్
మిన్ను సిగవి క్రింది కంఠ్లు నిమ్నఁజెందు సుందరీ.

పార్వతి—క్రిందికన్నులంటివి లోకములో నెల్లరకు రెండు కన్నులేకదా! యీ మునికి మూఁడు కన్నులేల వచ్చినవి? చిన్నదానను క్రొత్తదానను. మర్మమెఱుంగక యడుగుచున్నాను. దాని మర్మమెఱింగితేని నా కించుక నిరూపించుట.

భృంగి—సుందరీ! సత్యము. ఆమాటయే సత్యము. వీనికి నెగువ నొకకన్ను దిగువ రెండుకన్నులు పుట్టువలో నేయున్నవి. యెక్కడకుఁ బోవును. నీ కన్నులకుఁ జక్కనివాఁడు గాఁడని యెంచుచుంటివా! యింకఁ గొన్నినాళ్ళు వీనియొద్ద నాశ్రయించియుంటివా ఇతఁడు నీకును మీఁది కన్నొకటి మొలపించఁగలఁడు సుమా! ఇతని చక్కఁదనమప్పుడు నీవ మెచ్చికొందువు.

పార్వతి—శివానుచరమణీ! రమణీమణిని గాన నీ విట్లనుచున్నావు గాని యిదంతయు నిన్నడుగలేదు. మూఁడుకనులుండుటకు మర్మమెఱుఁగ నడిగితి.

భృంగి—తల్లీ! యుల్లసమాడకు. చెప్పుచున్నాను. వీనికి మూఁడు కన్నులుండుటకు ఫలము వినుము. క్రిందిరెండు నేత్రములు లోకానుగ్రహార్థమై కరుణామృతపూరితంబులై మొదటి మూఁడు పురుషార్థంబులకు సాధకంబులయి యున్నవి. యూర్ధ్వ నేత్రమొక్కటియు, నీచెప్పిన గుణంబులలో నొక్కటియైనలేక కేవల తేజోరూపంబై నిష్కామస్థితికి మూలమై యున్నది. సర్వస్వతంత్రుఁడు గాన నెప్పుడెట్టిమాపు చూడవలెనో యట్లనే చూచుచుండు. ఇతండిప్పుడు నిష్కాముఁడగుటంజేసి సహజమైన చూడ్కి సడంచివేసి యమ్మూఁడవ చూడ్కితో లోనఁదన తేజోరూపంబుఁ దాఁగనుఁగొనుచున్నవాఁడు. శృంగారమొకప్పుడు గడమ రెండుకన్నులనుగూడఁ బైఁబొనువిప్పి పురుషార్థత్వంబున లోకవిడంబనంబు బాటించిన నాచరించవచ్చు. నీవాదర్శంబు వదలక నీ చెప్పుటట్లు యీతని నేత్రస్థితినే యుండును. నీవడిగిన మర్మమిదియ.

పార్వ—సరేకాని నీవిప్పుఁడు సగము మగరూపుగ సగ మాఁడురూపుగ వేషము ధరించినా వేల?

భృంగి—అమ్మా! మాయయ్యవారు ప్రతిదినంబుఁ బూర్వాంతరమున రెండు మూఁడు క్షణములు మదీయవేష స్థాపానటన ఘటనంబులచే వినోదింతునుఁ గాన నిప్పుఁడప్పరమేశ్వరుని వినోదార్థమై యర్ధనారీరూపము వహించితి. మాపని మాను చూచుకొనుఁడు నాపనికి నేను బోవుదును.

పార్వ—(జ్ఞాపకముఁ దెచ్చుకొని నాలుగడుగులు ముందుకుఁ బోయి స్వగతము.)

మ. ముని యానాఁడట వచ్చి నాజనకుతోఁ బొల్పార బోధించిన
ట్లనరం దేవుని కర్ధనారి తనువెంతో వినోదార్థమా
సని యే నెంచుచునుంటి దాని కిది దృష్టాంతంబుగా నుండె నీ
ఘనుఁడర్ధాంగము నాకునిచ్చునొకొ యేకాంతంబి దెట్లుండునో.

(మరల నాలుగడుగులు వెనుకకుఁ జని ప్రకాశముగా) భృంగీశ్వరా! నీవిట్లర్ధనారీశ్వరరూపంబు దాల్చి లీలానటనంబు సేయువేళ నా క్షణమైన దేవుని హృదయంబు గబుంరంజితనుండునొక్కొ!

భృంగి—అమ్మా! యిప్పుడు నా యీ వేషంబుఁ దిలకించితివిగదా! నీమనసున నెట్లున్నది.

పార్వతి—ఆర్యా! నామనసునకు బహురంజకముగఁ దోఁచె!

భృంగి—అయ్యవారికి నెటుఁబోలె మనోరంజకమే!

కలహా—ఆర్యా! మీరు నుడివిన యీ యుపమానోపమేయభావము మీ రిరువురకు నైకమత్యమును బోధించుచున్నదే.

నవమాలి—ఓసీ! నీ తెలివియే మాయె. ఐకమత్యమంటివి. ఐక్యమే యనఁదగు.

భృంగి—(నవ్వి చప్పట్లుగొట్టుచు) ఐకమత్యమే చివరకైక్యమై పరిణమించును. ఎట్లున్నను సరే! మీ యుద్దేశ మట్లున్నదేమో. అభిప్రాయము పునరుక్తి నాఁడు గనుగొందము.

పార్వతి—భృంగీ! నీవు వేసిన యీయర్ధనారీ వేషమున కుపయోగమడిగితిని గాని వేఱు గాదు.

భృంగి—జననీ! దానిపేరే అది. యెవరెఱుఁగని దేమున్నది. కారణ సామగ్రి యంతయు దానికదే యొనఁగూడుచున్నది. కొమ్మా! యిక్కడ నీవిఁక మసలకుము.

పార్వతి—సన్నిధానమునకు నీవు వినోదార్థమేఁగ నంటివి. మేమును బుష్పావచయార్థము పోవనుంటిమి భాగమంతయు నీది సుమా! (చెలులతో) రారె పోదము. (పార్వతి చెలులతోఁ బూలవనమునకుఁ బోవుట)

భృంగి—(ముందుకు నడచి పూర్ణానందపరము సమాధిని బట్టిపోవు శివుని యొద్దకరిగి చమత్కారముగ నృత్యముఁజేయుట)

శివుఁడు—

చ. పలువిధమైన వేషములఁ బాయక యచ్చున గ్రుద్దినట్లు నీ
వలవడి వేయ నేర్చితివి హావము భావముఁ జూప నేర్చితీ
వలరఁగ నర్ధనారివయి తౌర ప్రకాశక నిన్నుఁజూడ నీ
కలనను నా మనంబున వికాసముఁ జెందుచున్న దింపుగన్.

భృంగి—దేవా! యిట్టి వికాసముఁ జెందుచున్నదన సార్థకమా, నాయది వేషము నీయది జోషము. నీజోషము జోషమును గా నెంచి నిక్కమైన యర్ధనారీశ్వర వేషము నీవు ధరించితివా నా మనంబున నిజమైన వికాసము రాఁగలదు.

శివుఁడు—ఓరీ! చాలుఁజాలు; చాలింపుము. సమాధిసమయంబైనది ద్వారమునకుఁబొమ్ము. (అని యోగంబు పట్టుట. భృంగి ద్వారంబునకై వెడలుట.)

(నంది ప్రవేశించుట)

భృంగి—ఓహోహో! నందికేశ్వరా! నీవిటు రాఁగతంబేమి. మనయీ శంకరుని తపోనుష్ఠానంబులకు విఘ్నము చెందెడి వారెందఱో! వానినొక్కనినైన

నియ్యాశ్రమంబున నడుగిడ కుండు నటుల జాగరూకుండునై యుండు మనికదా, నిన్నీ యాశ్రమంబునఁ గొంత పరివారముతో నిలుపుట !

నంది—భృంగీ ! నాకేమియుఁ దోచకున్నది ముందుగతియేమో !

భృంగి—ఏమి మునిఁగినది ?

నంది—పురందరాదు లెందుకో యోచించి మన్మథుని బిలువ నంపినారఁట. చూచాయగా నీకింవదంతి నాచెవులఁబడినది. యాపదుచు కుఱ్ఱడేమి సాహసించునో !

భృంగి—ఇక్కడ నేనుఁ జాలియుందును. నీవు వనాంతములయందు దిఱుగుచు నింద్రసభలోని సమాచారముఁ గనుపెట్టుము.

(నంది భృంగి నిష్క్రమించుట)

---

## షష్ఠ రంగము

[ప్రవేశము—ఇంద్రుఁడు, మన్మథుఁడు, బృహస్పతి.]

(10 నిముసములు రంభ నృత్యము.)

మన్మ—మహేంద్రా ! మీరలిపుడు నన్నుఁ బిలువనంపిన కారణం బెయ్యది?

ఇంద్రు—

ఉ. మారకుమార శూర సుకుమార గుణాకర శ్రీ కుమారనీ
బారికి నెవ్వరైన నిలువంగలరా జగదేకవీర నీ
వారయఁ దండ్రిఁబోలిన దయాళుడ వౌదువు మాయెడన్మహా
ధీర ప్రపంచము ల్భవదధీనము గాఁగద మాకు నీపుర
స్కారమె యిప్పుడొక్క యుపకారముఁ గోరముగారచింపవే.

వత్సా ! మాయిక్కట్టు లిట్టివని చెప్పనలవికావు. మేము లోకాధిపతులమని పేరేకాని శోకాధిపతుల మేకదా ! బహుపర్యాయములు నీతండ్రిచేత బరిపాలితులము గామే ! నీవు నెఱుంగుదువు. మాప్రాఁపు మీరుకదా ! మీకన్న మాకు దిక్కెవ్వరు ? స్వర్గవాసము భర్గవాసమువలె నున్నది వింటివా !

మన్మథు—తండ్రీ ! యట్టి మీఁదిమిక్కిలి యిప్పుడేమి సంభవించినది ? మీకు నేను జయంతుని వంటివాఁడను గానే ? మీభారమునాయది. యింతమీన మేసముల లెక్క పెట్టనేల ? తుట్టతుదకైన బట్టుదలతో నెట్టి యిక్కట్టునైనఁ గొట్టివేయఁగలను. వినుము.

మ. జగము ల్నా యరచేఁతిలోనివ సదా సత్యంబ నాచేతఁగా
దగుకార్యంబది చేతఁగాదనుదునే ధైర్యం బవార్యంబయో

నగవైరి మది సంశయింపక యనూనప్రేమతో నానతి
మ్మొగిసాధింతును నాపరాక్రమము గాయో పండో చూపించెదన్.

బృహ—మదనా! నీ ప్రభావ మింతయని చెప్పఁదరమా? బ్రహ్మసృష్టిలో నంతటను భవదీయసత్తావేశములు గదా! నీ ప్రచారము లేనిచో నిర్వీర్యత్వమే కదా! నీ సంకల్పమునకు నెన్నఁడైన వికల్పముకలదా! నీ సహాయులు సామాన్యులు కారు. నీవు సత్యసంధుండవు.

మన్మ—ఆచార్యవర్యా! మీరన్నమాఁటలు రత్నాలమూఁటలు. మీ రనెడి గురువు లుండఁగ మాకేమి కొఱఁత! మా భావనలు మీ దీవనలే!

ఇంద్రు—కుమారా! నీవు మహాలక్ష్మీపుత్రుండవు. మహారాజు భాగినేయుండవు. చక్రధరుని దివ్యతేజంబున నావిర్భవించిన పుణ్యమూర్తివి. నిఖిలజగదంతరాళసత్తామంగళ విగ్రహుండవు; నిరంతరస్వచ్ఛందనిర్వక్రపరాక్రముఁడవు. భవదీయ సముద్యమంబునకు నేమైన యపయశంబుండునే? వెఱటిచెట్టు మందుకు రాదను మాఁట నిజము. నాఁటనుండి నీ మాఁట విస్మృతి జెందె. సురలకష్టంబులు దీఱెడి మేలిసమయంబు సమకూరె. లోకోపకారము నీకుఁ దక్కవలసియున్నది. నీవు వెనుకఁ దీసినచో నియ్యాపత్సముద్రమునుండి దరిఁజేర్చువా రెవరు?

మన్మథు—

చ. మగఁటిమి కేమి తక్కువ సమానులు నాకెవరింక నీకు నీ
వగపులఁ బోవనేల నను వాసవ నమ్ముము మీనిమిత్తమై
తెగఁబడి కార్యసాధనముఁ దీర్చెద బేర్చెద కీర్తి పూర్తిగా
బెగడకుమయ్య నిక్కమిది భేషజ మన్నక నాత్మనమ్ముమా.

ఇంద్రు—

చ. సుమశర యీచరాచరముఁ జొక్కముఁ జేయుట నీదెభారము
త్తముఁడవు సూనృతవ్రతనిధానుఁడ విచ్చినబాస దప్పవ
ద్దమరుల కార్య మిద్ది యుపహారముగా నెరవేర్చి పెట్టితే
నవిరళమైన కీర్తిఁ గొనవౌదువు సాధువటంద్రు నా నిన్నొగిన్.

మన్మథా! సురభూసురులు పడునిడుములు నుడువఁ దరమా! వినుము.

రగడవృత్తము.

సురరిపు లేఁపున ఘోరతఁజూపఁగఁ
బరి పరి విధముల బరుగులు వెట్టిరి
సిరులను వదలిరి చేరిరి కోనలఁ

బరగళ్ళంబడి బరువడి బారిరి
చింతర వందన చేసిరి స్వర్గము
చందము తోహారిచందన నగముల
సందుల నసురులై సలిపిరి క్రీడలు
పఱుగడుపులతోఁ బడలుచు వెడలిరి
జఱజఱ మనయుచ్చరలను సడ్చిరి
చఱచిరి యుచ్చైశ్శ్రవమును జబుకుల
నుఱుకుచు మాయేనుఁగు నుఱికించిరి
నవరత్నంబులు నర్మిలి దోచిరి
పుష్పదోఁటలు మాపురిఁగల కోఁటలు
నవనపుఁబేటలుఁ బవనపుఁబోటులు
పుష్పుల విమానంబులు సనుబాఁటలుఁ
జడఁగొట్టిరి కొట్టుడుములఁ గొట్టిరి
కడు ధర్మంబులు గడముట్టించిరి
నడమంత్రపుసిరి నడుపుచునుండిరి
జడియరు మడియరు చటుకున గెల్తురు
బ్రహ్మాండంబులు బ్రహ్మబలంబున
బ్రహ్మోత్తరముగ బ్రహ్మలు లేరని
జిహ్మగులై నరసింహులకీఁడుగ
బ్రహ్మలుదారై ప్రబలి భరించిరి
యమృతపుఁగలశము సత్త్రి హరించిరి
సమయించిరి వాసములను బలుఁగుల
సమరము లమరఁగ సలుపుదురొగి సం
భ్రమమున జన్నపుభవనము లవిగో
హోమము పాడై క్షోభిలుచున్నవి
మోఁదుగ లవిగో యీ మోఁదుగలెల్లను
బోఁడిమిచెడి వాపోవుచునుండిరి
తాడితులై సుకృతాత్ములు సూచితే

ముందుగ మాపని మూలను ద్రోసిరి
మందకుఁ దోలిరి మా సురభినిహా
పందలమైతిమి బందికిఁబోతిమి
సందియ రెన్నఁడుఁ జాలియెనిక్షే
పములను ద్రవ్విరి ప్రమితులనవ్విరి
సమితులఁ గ్రొవ్విరి స్వమతుల దవ్విరి
శమనుని మెట్టిరి శమగులఁ దిట్టిరి
మమతలు బెంచిరి మమ్ము నశించిరి
మా పని యీ గతి మాపై యున్నది
రాపులఁ బెట్టిరి రాక్షసు లెంతయు
వేఁపులఁగా చెట్లవైపులఁ దోలిరి
తూఁపులఁదాఁడికిఁ దూఁటులఁ బడితిమి
పడఁతులఁగూడుచుఁ బకపకలాఁడుచు
బడకఁటియింట్లను బవళించుటకే
చెడితిమి పడితిమి చిటిమొటికాయలు
పిడుగులుగ్రక్కిరి పెడసర మొక్కిరి

చ. భువనము భోగిభూషణుని భోగములంబలనాఁటనుండి వి
ప్లవముల మున్గుచుండె నిరుపల్లవవైఖరి గాని కొల్లదో
దివి భువి నెవ్వఁడుం గరుణఁదేలిచి గట్టుకుఁ దీయువాఁడె లేఁ
డవిసితి మిట్టి కష్టముల కాలన పాలన లేని మన్మథా.

చ. శివునిసపర్య లెల్లపుడుఁ జేయుచు భూరిబలప్రతాపుఁడై
కవిసి స్వజాతిశీలమునఁ గ్రౌర్యముఁ జూపుచు సర్వదేవము
ల్దవిలి ప్రభుత్వమేలుచు సుధర్మ నధర్మముగా వహించి సం
భవదవలేపుఁడై ప్రజకు మారకుఁ డయ్యెను దారకుండొగిన్.

శా. క్రౌంచద్వీపనివాసితారకుఁడు బల్ క్రౌర్యంబుతోఁ రెచ్చి దు
స్సంచారుండయి తాఁ జతుర్దశ జగత్సామ్రాజ్యముం దాల్చి మా
ప్రాంచత్సంపదలెల్లఁ దోచికొని మమ్మాక్రాంతము న్వంతల
ల్ముంచంజొచ్చెను దిక్కులేదికట శంభుం డాత్మగుం డౌటచేన్.

మన్మ—(తా నెఱుఁగనట్లుల) యేమేమీ! శివుఁడెక్కడ. ఆత్మనిష్ఠయెక్కడ!

మ. కినుకన్నిండినవాని కేమి జపమక్షీణోల్బణుఁడై నాఁడె మో
హిని వెంటంబడె నిప్డు తా విధురుఁడై యేమౌనో యీనుమాని యే
లని యీ కొంగజపాల కేమి సురపాలా యవ్వఁడౌ తారకుం
డన మీఁదై నలుగంగనేల శివపూజారంభసారంబొకో.

ఇంద్రు—ఘృతోదధి మధ్యంబున నసాధ్యంబైన క్రౌంచ ద్వీపం బొండుకలదు. అందు వజ్రాంగుని వలన వజ్రాంగీదేవి గర్భంబున నుదయించిన మహాక్రూరుండు దారకుండనువాఁడు చిన్ననాఁటనుండియు, మహేశ్వర వ్రతదీక్షాదురంధరుండై, పరమేశ్వరు ననుగ్రహంబున నొక వేయి బ్రహ్మాండంబులకుఁ దా నేకచ్ఛత్రంబుగ రారాజై బ్రహ్మవంశ సంజాతుం డగుటంజేసి ప్రపత్తిగమమున ధర్మబద్ధుండై యేయున్న "బుద్ధిః కర్మానుసారిణి" యన్నట్లును మా మా ప్రారబ్ధ కర్మఫల పాకంబునంగాఁబోలు; దక్ష ప్రజాపతి దాఁదలపెట్టిన యాగంబునకుఁ దన యల్లుండగు నల్లకుత్తుక వానిం బిలువక మమ్మెల్లరఁ బిలచిన కతంబుననే మచటకుంబోవుట యొకతప్పు, దాక్షాయణి తనపతి యనుమతిఁగొనకయె తాఁదనతండ్రి యజ్ఞంబునకు మాయందఱితోఁ బాఁటుగఁ జూడరానమ్మాత్సండాఁడిన యసహ్యపుమాఁటలు విననోపక యాతని రేతో వికారమగు నద్దేహంబు నీశ్వరు యోగ్యంబు గాదని చింతతోఁడ వామపాదాంగుష్ఠంబున మహీతలంబు లిఖించిన రేఖతోడ నుద్భవిల్లిన యోగానల జ్వాలలో నహుతంబు గావించిన సమయాన మేమందఱము వేఱ చేయునది లేక చూచుచుంటి మిదియు రెండవతప్పు; యజమానుని తప్పులు రెండును స్పష్టమే కదా! యిక్కతంబున దురాగ్రహ మహోగ్రుండగు నయ్యీశ్వరుని ప్రేరణంబుచె వీరభద్రుండు వెడలి యాజన్నంబు ధ్వంసంబుచేసి విజృంభించిన యా వేళ మేమెల్లరము వాని బారంబడి, తదీయకర చరణ తలాఘాతంబుల భగ్నీభూతులమైతిమి. శివుఁడంతటఁ బ్రాపంచిక ధర్మముల విడనాఁడి హిమాచలా శ్రమంబునఁ దపోనిష్ఠ సలుపుచున్నవాఁడు. యిదియు కారణంబుగా శివ భాగవతోత్తముఁడగు నత్తారకుండు సహస్రముఖంబుల విషంబుగ్రక్కుచుఁ దొల్లింటి యపరాధ ద్వయంబును శివద్రోహంబుగా నుద్ఘాటనంబుఁజేయుచుండాన యీశ్వరు ప్రతినిధిగా నేర్పడి ధర్మపదంబు నిర్మూలంబుఁజేసి బ్రహ్మాండ జాలంబులన్నియుఁ దన యధికారంబులోనివే కానఁ దన యధికారుల నక్కడక్కడ స్థాపించి సర్వలోక లక్ష్మి నెల్లప్పుడుఁ దానె కొంపోవుచుఁ బ్రజల కెట్టి సౌఖ్యంబును గలుగనీయక పలుతెఱంగులగు నూతన విధి ప్రమాణంబులఁ బ్రమరింపఁ జేయుచు నగ్రత్రిమోహాయ ప్రధానుండై తలయెత్తిన గుణగరిష్ఠుల నెల్లఁ గారాగారనిబద్ధులఁ జేయుచు లోకంబులన్నిఁటిని క్షామదేవతకు నరణంబుగ సమర్పించి విజృంభించి యున్నవాఁడు వీనిబోలిన క్రూరసాహసుల నెన్నఁడు వినము. కనము. సురభూసురుల కుటుంబ సౌఖ్య వార్తలు కలలోనివార్తలాయె. మన్మథా! యిందునీసాహాయ్యం బత్యావశ్యకము.

మన్మ — పురందరా! మనకిప్పుడు తారకరాజ్యం బవసానము నొందించుటకదా ముఖ్యము. యిందుకే నొకయుపాయముఁజెప్పెన. నీవును నీయాచార్యుండు నందలి సారాసారంబుల నిర్ణయింపుఁడు.

చ. వరతను రత్నము ల్గలరు వాసవ నీకడ రంభ మున్నగా
నరువది వేవురం దొక యొయారిని జక్కనిబొమ్మ నా నిశాచరు
వలపింపఁ బంపుమదె సందుగ ముందుగ నంప సోనల
న్గురియుచు వాని దానివల్ గుంకి నశింపఁగఁ జేయుదు న్వడిన్.

చ. కులుకుమిటారి బంపుమటఁ గూరిమి దాని కటారిచూపుఁ దూఁ
పుల చులుకుందనంబులకు మూర్ఛిలఁజేసితినేని వాఁడు న
వ్వలపులలో మునింగి మనవంకకు రాఁడు బిరాన దాని చి
క్కులఁబడిపోవు గామహిమఁగొల్పుదు మీకు స్వభోగ్యభాగ్యముల్.

మ. అలనాఁడక్కడ మోహినీతరుణి యొయ్యారంబుతో నై హొయ
ల్విలసింపం జనుఁదేర గాదు శరసంవేగాలకుం దాళలే
కెలమిం దాని నెగాదిగం గనుచు దేవేంద్రా ముహూర్తంబులో
పల దైత్యుల్గను చేతఁ జిక్కిన సుధాపాత్రంబు గోల్పోవరే.

చ. ఇటువలె రావణాది దనుజేంద్రులు బ్రహ్మబలాఢ్యు లెందఱో
కుటిలవిచారులై భువనకోటికి మాఁటికి బాఁటిలేక సం
కటములఁ గూర్చువారు పరకాంతల నొక్కపుఁ డాత్మఁ గోరి గా
చటుల శరాగ్నిపాలగుచుఁ జావరె ముఖ్యది నీ వెఱుంగవే.

(బృహస్పతివంకఁ జూచి)

చ. గురుఁడవు దేవకోటులకుఁ గ్రూరులు నెచ్చెడు నిట్టి కష్టము
ల్గురుతుగఁ దొల్గఁజేయు టనుకూలము నీకును బెద్దవాఁడ వెం
దరయఁగ నూరకుండఁదగు నాశకు నాలకుఁగాదె నీ బహూ
కరణము దీనిఁజూచి సరిగా వివరింపుము స్థూలసూక్ష్మముల్.

బృహ —

మ. మదనా నీ వనినట్లు వృష్టసనిమ మావారు మన్నింత్రు స
న్మదనావశ్యక మేదియైనగలదా మానంబు నాకేల క్షే
మద నానావిధచింతల న్మనుఁగు నా మర్యాద లిట్లుండు నే
మదనాతంక మనంగనేనె మదనాహార్యంబె నీ వెంచుమా.

ఉ. క్రూరుఁడు ధీరు డిట్టివాఁడఁగూడదు వానికి శూరమానికిన్
బారవు చిన్ని చిన్ని వెడమాయలు జాయలెడాయ రెన్నఁడున్
ధోరణి దేవభూసురుల ధూననమందు మహేశువందె సా
ధారణ మేమిచేసిన వృథాయనవచ్చు నసాధ్యుఁ డేరికిన్.

కుసుమశరా! తారకుఁడు పామరుఁడుగాఁడు. లాఁతి యవగుణంబులేమియు లేవు. దినదినము షష్టిఘటికలు మానసికశివపూజల యాడంబరము దప్పఁడు. శివునంతటి మహానుభావుండు శివునివలన సకల వరంబులు గొన్నవాఁడు. శివుఁడు గాలవశంబున విషయ వాంఛావిముక్తుండైనను వాని ప్రాణశక్తి తపోనిష్ఠుఁ బూర్వక్షణంబున సతీ వియోగనిమిత్తంబుగ వెడలిన తామసశక్తితో మెళనమై యీ తారకునందుఁ బూజా తాత్పర్యవశంబున మూర్తీభవించి యున్నయది. దానంజేసి యాశైవుం డుగ్రాకారుఁడై స్వచ్ఛందశైలిని విజృంభించియున్నవాఁడు. వర్తమాన కాలమందలి వారిలో నొక్కరికైన సాధ్యుండగునే?

ఇంద్రు—మన్మథా! గురువచనము యదార్థము. దీనిగురించి యొక పరమ రహస్య మున్నటుల నేను, మీ జనకుండును, మా యాచార్యుండును, మీ యన్నయు యోచించి మర్మముఁ గనుపెట్టితిమి. అది నీవలననే నెరవేరనున్నయది.

మన్మథు—

తే. గీ. నుడువఁదలఁచినదానినే నుడువు మిపుడు
వెనుకదీయక వెంటనే పేరుప్రోఁగఁ
గడఁగి నా చేతనైనంత కార్యఫలముఁ
జేసివత్తును ప్రాణాల కాసపడను.

ఇంద్రు—శివుఁ డల్లనాఁడు దారకునకుఁ గోరినవరంబు లొసంగె. నీశేళ నంతటి వాఁడు మరొకండు మదీయ ప్రాణశక్తి యుండై నిన్ను [illegible] నవ్వానిం ధిక్కరించితివేని యదియు నీ యవసానంబని నిరూపించెనటఁ. ఈ యున్నవారిలో శివునంతటివాఁడు వాఁడేకాని యింకొక్కఁడు గలఁడే; వినుము. నీవు యోచించిన యంశము తారకునెడఁగాదు గాని యా యీశ్వరునెడ నుపయోగింపుము. దాని కితర ప్రయత్నము లక్కఱలేదు. హిమాచలకన్యక పార్వతి యతిరూపవతి. యిపుడు శివ యోగీంద్రునొద్దఁ బరిచారికయై యున్నది. నీ విప్వేళ నీసన్నాహంబుతో వెడలి వాని సమాధి భంగంబు నొనర్చితివేని నయ్యీశ్వరుండు సానురాగుఁడై యబ్బాలికను వివాహ మాఁడగ నా దంపతులకు నుదయించెడి కుమారుండు శక్తిధరుండై దేవసేన కొడయుఁడై వానిం దాఁకి పిలుకు మార్చఁగలఁడు. నిక్కంబీ దేశోపకారంబు నీవలనఁ గాఁదగి యున్నది. నీవింతదనుక విరాగులను సరాగులను జేయుటచేయుటకాదు. యిప్పుడీ విరాగుని సరాగునిఁ జేయుట కీర్తికరము.

బృహస్పతి—శివుఁడుగ్రుఁడని సంశయింపకుము. వానియుగ్రత్వమప్పుడే నీట గలసె. పరమశాంతుఁడు. నదియునుంగాక చలికొండరాచూలియగు కన్నియ వన్నె కెక్కిన యందకత్తియ. యచటఁ జెలికత్తియ నీతలఁచిన కార్యమునకుఁదోడు కాఁగలదు. నీతండ్రి పాదము నొదలఁబెట్టుకొన్నవాఁడు. నీ తోఁబుట్టువు నక్కడనే మన్నించుచున్నవాఁడు. నీతల్లిమగతోఁబుట్టువను శిరోభూషణంబుగఁ జేకొన్నవాఁడు. నిన్నుఁ జూచినతోడనే నీవారలబోలె మన్నించి యొకకంటఁ గనుపెట్టఁగలఁడు. సృష్టిజాల మంతకును నీవే ప్రధానుండవు. ఇది నీకెంతపని.

మన్మథు—సురాచార్యా! వన్నెలు చిన్నెలుఁజెప్పి భూషించెదవు. మీ మాఁట కడుగు దాఁటుదునా! మీదీవన నాయందుండవలెఁగాని నాపేరుఁ జెప్పినమాత్రానఁ బదునాల్గుభువనంబులు గడగడ వణంకవే!

చ. ఇది యొకలక్ష్యమా విను సురేంద్ర యుపేంద్రునికూర్మి కుఱ్ఱఁడన్
వదలని పట్టుపట్టి భువనంబుల సంతసపెట్టువాఁడ నా
కెదురుగ నిల్చువాఁ డెవఁ డిదెంత పురాంతకుచింత నింతలో
జెదరఁగ గోఁటమీఁటెదను జీఁకటి నరుణుండువోలె దేశికా.

(ఇంద్రునివంకఁ జూచి)

చ. సురవర దీన సంధియముఁ జూపకు నీ విఁకఁ దేపతేపకున్
వెరవకు మిప్పుడే చనెద నీరపథంబునఁ గీర్తినిల్పెదన్
వరుసగ నస్మదీయపరివారముఁ గూర్చెదఁ బూవుటమ్ములం
గురిసెద శూలిపై గుఱిగఁ గ్రూరతపంబులు భంగపుచ్చెదన్.

నా పరాక్రమంబులు నీ వెఱుంగుదువు.

చ. హరుఁడన లెక్కసేయ నహహా సమయంబిది నాకుఁజిక్కె నా
కరముల దీఁటదీర్తునసకత్తులు వాయలుదీర్చియున్న నీ
శరములఁ జూడుచూడుము నిషంగములం దలలెత్తుచున్నవో
సురవర నమ్ము నా ప్రతిన జోగిని రాగినిజేసి మించెదన్.

చ. మతి తపమున్ ద్యజించి క్షణమాత్రములో ననురాగయుక్తమై
కుతుకముఁజెంద నద్రిసుతఁ గూరిమిఁ జేకొన నా లతాంగియం
దతి గుణశాలి శక్తిధరునాత్మజు నొక్కనిఁ బుట్టఁజేయున
ట్లితనిమనంబు నమ్ముల జయించెద నిమ్ముగ దెప్పపాటులోన్.

(భుజములప్పళించుకొని)

చ. మగతనమున్న సార్థకముమానక ౼ట్టి పరోపకారము
ల్దగునటు లాదరించి క్రియ తప్పకచేయుచు నుండనౌను నా
మగఁటిమి నీకు నేఁ జిటికెమాత్రములో గెలుపించి చూపెద
న్వగవిదు మో పురందర ప్రపంచము నావశ మీా వెఱుంగవే.

చ. పువులు ననల్జివుళ్ళుఁ బువుఁబొళ్ళు సుగంధపుఁ బిల్లతెమ్మెర
ల్నవనవనైక వైఖరుల నా వశమై చెలరేగ వేగ ని
య్యువజనకోటి చిత్తముల నెత్తుచు మొత్తుచుఁ గళ్లుగప్పి గా
రవముగ గారడీ గ్గొలిపి రంజిలు నా కిది లక్ష్యమా హరీ.

చ. తవిలి మదాశుగంబు లవి దట్టముగా సుడిగొంచు వీవ దా
నవులను దివ్వె బ్రువ్వల కనారతచంక్రమణంబు లిచ్చు నీ
భవునిసమాధి దీపశిఖ భద్రముగాఁ గెడకుండు కొట్టులో
దివిజవరేణ్య నా ప్రతినఁ దీర్చెద ధైర్యముగొంది యుండుమా.

బృహ—నీవు అంతవాడ వగుదువు.

మన్మ—(మీసము వడివేయుచు)

ఉ. ఈతని యోగనిష్ఠ వదలించి యుమాసతిఁ గూడునట్లుగాఁ
బ్రీతిసెలంగ వెనక్కడుగువేయక చేయక పోతినేని నా
చేఁతిది తుంటవిల్లె! వలచేఁతిది పుష్పశరంబె! యూార నా
మూఁతిది మీసమా! కలుషమోచన నే నిఁక మన్మథుండనా.

బృహ—నీ పౌరుషం మెచ్చదగినదే!

మన్మ—

చ. మన కిదిగాదు శాశ్వతము మంచిదొ చెడ్డదొ పెద్దపేరు గై
గొనుటయెకాని దీనిఁ గొనగోటను మీఁకెద నొక్కయేటునం
దునిసిపడంగ నీశు మదినూఁకుగ నీ పువురేఁకు, బాఁకుచే
మునుకొని యో శచీరమణ! మూసినకన్నరవిప్పునంతలో.

బృహ—నీవు సత్యసంధుండవోయీ!

మన్మ—

చ. కుదురుగనేఁగు రాచిలుకగుఱ్ఱము వే దుమికించి యంతలో
నెదురయి మైదుమోవులముసీశుని చిత్తము రెండు వ్రయ్యలై

చెదర శరంబు లైఁదిఁటను జేఁతికోలందిని గొట్టి పార్వతిం
గదియఁగఁ జేయనేని శచికాముక! నేనిఁక మన్మథుండనా!

చ. విరు లివిగో! సురేంద్ర! ననవింటను జూపినయంతలోనె యీ
గిరిశు మనంబులో విఱియు కేవల యోగము రాగమౌచు నా
గిరిసుతమీఁదకు న్భ్రమరకీటవిధంబునఁ బారదేని నా
పరువు ప్రతిష్ట లేమయినఁ బారునె బారున నాఱితీరితిఁ.

పురందరా! యరవింద భవాదులెందఱో యననేల! మదీయ శరసంధానవేగంబునకు బాలైరకాదే! యమ్మహాదేవునకు నీ నడమంత్రపు వైరాగ్యంబు సిగిలింతసిరి యనుకొనుము. మన్మథనామధేయంబు విన్నమాత్రానఁ జతుర్దశ భువనంబులు గడగడ లాడవే! మదీయ పరివారంబులు, సామాన్య మనికొంటివా? వసంత మలయానిలులు, సూరకత్తులు. చిటుకమాత్రములో నికార్యంబు సమర్థింతు.

ఇంద్రు—వత్సా! సత్యము మఱవకుము. లోకోపకారము మహాకీర్తికరము. కీర్తి యొక్కటియే స్థిరపదార్థము. పరాలోచనా పరతంత్రుఁడవు కావని యెఱుఁగుదువు. (మన్మథునికి వినఁబడకుండఁగ బృహస్పతితో) గురూత్తమా! తెఱఁచుగ నితఁడు స్త్రీప్రియుఁడు. వీని సంకల్పంబు గడుఁగష్టసాధ్యంబు. వీని సతి రతియతిరాగవతి. వీని ప్రయాణంబునకు నడ్డుకదా!

బృహ—అదియు నిజమే! యోచనీయము. ఇప్పుడే యా సంశయము దీర్చుము. (మన్మథునితో) శశాంకభాగినేయా! నీ తండ్రి చక్రధరుండు పలుమారు పలురూపంబు లెత్తి పలుగండంబులఁ దొలంగించి యీ సురలను నుద్ధరించినవాఁడు. వాని గర్భంబున నుద్భవిల్లిన నీవు నట్టివాఁడవు. ఇదియే మా నమ్మకము. కాని లోకధర్మ మొక్కటి గలదు.

చ. తనమతి నమ్మినం దనకుఁ దప్పక సౌఖ్యమొకల్గునెందు నిం
కను గురుబుద్ధి నమ్మనెడఁ గల్గు విశేషసుఖంబు సంభవిం
చును బరబుద్ధి నమ్మనెడ శోకము లోకములోన మీనకే
తన సతిబుద్ధి నమ్మఁగ సదా తనకుం బ్రళయాంతమౌఁజుమీ.

కార్యసంధానభారంబు నీయందయున్నది. యిది కడుదుర్ఘటము. అనన్యసుగమము. పురుషుఁ డొక్కకార్యంబుఁ బూనికొనినచో మంత్రరక్షణంబు చేసికొనుచు గుంభితముగ సాధించుట శీఘ్రసిద్ధికరము. కొందఱు దారునిక్కముగనో ముఖప్రీతిగనో కార్యభారంబు పైన మోపికొని యావలకుం బోయినకోడనే డాఁచఁజాలక యొరులతో గతితతో నోరుజారి పోతువారి కాపియలపాలై తుదకుఁ బఱగడలఁబట్టి యిరుగడలఁ దిట్టివాఁటుకులోఁబడి వ్యర్థపడుదురు. బృందారక బృందంబులకెల్ల నే ననాది

నుండియు నాచార్యపీఠంబు వహించినాఁడను. మనసార నీచే వాగ్దానం బీఁబడినది. నాయందు భక్తితాత్పర్యంబులు నిలిపి పరమంత్రంబులకుఁగాని స్త్రీమంత్రంబులకుఁగాని చొరక యాత్మబుద్ధిని గురుబుద్ధి ననుసరించి కార్యంబు నిర్వహింపుము.

మన్మ—(అసూయ నభినయించుచు జమత్కారముగా) తారాసహచరా! నా తండ్రి చక్రధరుండు మిమ్ము నుద్ధరించిన వాఁడనియు, నేను నటివాఁడ ననియుఁ బొగడుచునే స్త్రీయాలోచనలకు లోఁబడవలదని యుపదేశించుచుంటివి. నోరు మాఁటలాఁడుచుండ నొసలు వెక్కిరించుచుండు ననుసామెతకు నీవే నిదర్శనమైతివి. యహహా! నా తారాసహచరుని మేనల్లుఁడనియు నల్లుడనియు స్మృతికివచ్చెనా! శుద్ధనైదికపుఁ బిచ్చిపట్టినదే. మదనుండనఁగ నుద్దండపిండం బనుకొమ్ము.

(గురుఁడు తలవంచుకొని సిగ్గుపడును)

ఇంద్రు—(భయముతో) కుమారా! కడువృద్ధుఁ డియ్యాచార్యుండు. వీరి సంభాషణంబు లికాలపువారికి నసహ్యముగఁ దోచెడి. నీవంటి నవనాగరికులు మన్నింపఁదగినవాఁడుగాని రెట్టింపఁదగినవాఁడు కాఁడు.

మదను—అగును. మీగురుఁడు మామామ కతంబున నాయందు నసూయనూచింపుచున్నవాఁడు. తన నోఁటికంపుఁ దనబోఁటికిరంకుఁ దానెఱుఁగఁడను మాఁట నిక్కము. వీరుండగు మారుండు నా నారాయణుని కుమారుండు మహోదారుండు దారమాఁట వినునే? విన్నను లోఁబడునే.

ఇంద్రు—మకరకేతనా! నీమగఁటిమి యట్టిద గురుని మఱల నోరెత్తక యుండు నటుల నోనాఁడితివి. యెంచితిచేసిని మంచమంతటఁ గంతలే. గతజలసేతు బంధనముతో లాభమేమి. ప్రకృత యోచనకు నాతంకము రానీయకుము.

బృహ—కందర్పా! నీకెట్టిపోడువ న్యాయమా! యీఁడుకు నీకంటెఁ బెద్ద వాఁడనుగదా! చేసుకొనిన పతి పతికిహితాహితజ్ఞానం బుపదేశించుట లోకసహజము కాదే! కార్యార్థులము గాన నెవఁడ్డపెట్టినను బట్టినవ్రతంబు విడువక యుపకరింతువని నాయాఁడిన వాక్యంబున మాఱ్ఱంబు స్ఫురించుట కవకాశంబు రవంతైనం గల దేనాఁడను.

మన్మ—(అవుఁడుగఱచి తలయూచి యోరకంటఁజూచి) పురందరునిఁజూచియు నీవృద్ధత్వంబు వేచియు నింతసైచితిని. కాని కానిచో నీయొడలికి నాసాయంబు లేమి మఱలఁ దారానుభవంబు గళ్గాగురుని పాలఁబడకుండునే. శశాంకభాగినేయాయని నన్ను సంబోధించితివి. యీసంబోధనలోని యర్థము నెఱుఁగలే ననుకొంటివో!

ఇంద్రు.—రతికాముకా! యూరకొనుము. మనకందఱకు నాచార్యుఁడితఁడు. గురుధిక్కారము ప్రస్తుత కార్యోపయోగి గాకుండుట నుపరియనర్థకము. గురుని సమ్మతి పడసి కడుఁదడవుగానీయక వసంతమలయమారుతాదులతో నరిగి కార్యంబు సాధించుకొనుము.

మన్మ—(పకపకనగి) సురేంద్రా! యర్ధసిద్ధియైనసరే! యనర్ధసిద్ధియైన సరే! యన్నమాఁట దప్పుదునే! కాలక్షేపము సేయుదునే! ప్రమాణ మిదియేయనుకొనుము! నాకుఁ దారబలము చంద్రబలము నెప్పుడు నొక్కతీరే. యీరేయి యింటికేఁగి వసంత మలయానిలులను దోడ్కొని హిమాచలాశ్రమంబు ప్రవేశించి క్రొక్కారులు మెఱుంగుఁ దీవియఁబోలి తళుక్కుమనుచు నెదురు బరిచార పరవశయగు పార్వతీకన్యకను జూచి మోహించి తపంబు విడుచునటులఁ జటుల పటులతాంతశరపటలంబులఁ గురిసి నాపరాక్రమంబు త్రిభువనంబులను టముటమావేయించనే!

ఇంద్రు—పార్వతీ పరమేశ్వర పరిణయఫలంబుఁ గుమారసంభవ ఫలంబు నీకు దక్కనున్నయది.

బృహ—వత్సా! భవత్సామ్రాజ్యంబు జగత్సామాన్యప్రాజ్యంబు, వృద్ధవాక్యంబు నందలి స్ఖాలిత్యంబుల లెక్కసేయకుము. నీవు ప్రతినపూనిన యీగడియ విజయముహూర్తంబు దారబల మొక్కట దక్క తక్కిన బలమంతయు సర్వోత్తమంబుగ నున్నయది.

మన్మ—(యింద్రునితో) సుత్రామా! యీవృద్ధుఁ డిప్పటికి నిశ్లేషోక్తిని విడువఁడు. (బృహస్పతితో) చూఁడు. కానిమ్ము యేమితార.

ఇంద్రు—మకరధ్వజా! యింక నావిషయ ముపేక్షణీయము. కార్యాతురుండవు. నీవనన్యచిత్తుండవై మమ్ముద్ధరింపుము.

బృహ—మన్మథా! నీ పలుచుఁదనపుమాఁటలకుఁ బ్రత్యుత్తర మీఁజాల వినుము. నీజన్మతార ‘మఖ’గాన బ్రయాణతార జన్మతార యయ్యెనని సంశయంబు వలదు. ‘మనోజయంతు మాండవ్య’మను శాస్త్రమునుబట్టియు ‘శుభస్య శీఘ్రం’ ‘అశుభస్య కాలహరణం’ అను లోకోక్తి ననుసరించియు, విళంబము గానీక వెంటనే కదలుము. భవత్సంకల్పము నిర్వికల్పముగ నెరవేఱును.

మన్మ—మహేంద్రా! యుక్తప్రత్యుక్తి వైచిత్ర్యంబు గొంతవడక యిట్లనే యుండును. జన్మతార నన్నేమిచేయును. నీవనిన రెండుఫలములను దక్కించుకొందును.

(అని మన్మథుండును, తక్కినవారును నిష్క్రమించిరి)

గద్య: ఇది శ్రీ తర్కవేదాంతాది సకలతంత్రస్వతంత్ర శ్రీమదనుగమభట్టాచార్యాది ప్రసిద్ధబిరుదాంకిత శ్రీమదభినవగౌతమ నామాంకిత శ్రీ పిసుగంటి వేంకటరామశాస్త్రి కంఠీరవ పౌత్ర శ్రీ కురుగంట్యప్పయ్యశాస్త్రిపుత్ర శ్రీ వెంకమాంబికా సతీతిలక గర్భశుక్తి ముక్తాయమాన శ్రీ హారీతసగోత్రపవిత్ర శ్రీమదుభయభాషా భూషాయమాన లలితకవితాధారా ధారాళ యశోవిశాల సహజపాండిత్య సాహిత్య శ్రీ బాలాత్రిపురసుందరీవరప్రసన్న బుధజనవిధేయ శ్రీ కురుగంటి సూర్యనారాయణశాస్త్రి నామధేయ ప్రణీతంబులగు సత్కృతులలో నగ్రగణ్యంబగు కుమారసంభవ నాటకంబునఁ ద్వితీయాంకము సమగ్రము. శ్రీ

---







# కుమార సంభవము

## తృతీయాఙ్కము

### ప్రథమ రంగము

(మైనాకుఁడు ప్రవేశము)

మైనా — (స్వగతము) అంత యెంతకావలయునో అంతయైనది. ఎంతపని. ఎంత పని. ఛీ! యొకని మాట వినవచ్చునా! పదిమంది పదియాలోచనలు చెప్పుదురు. వినెడి వానికే చెప్పెడి వాఁడును. తనకేంగుకు! నివాళి పళ్లెరములు పట్టిన వారెల్ల నిషేక ముహూర్తమునకు వత్తురా? ఆ! కలహప్రియుండు పురికొల్పిపోయె. దానివినుటయే తన తప్పు. వలుఁదు గలువయ్యెనా?

ఉ. పుత్త్రుఁడనొక్కఁడం దనకు ముప్పునకక్కర రాకపోతి న
ప్పుత్త్రిక సర్వమంగళగఁ బుట్టినదొక్కతె దానిపెండ్లి దా
మిత్త్రులలోనఁ జేయక యమిత్త్ర శిరోమణికీయఁబూనె హా
చిత్రము జోగితోఁబడునె చిక్కులువచ్చెను దండ్రికియ్యెడన్.

(కొంచెమాలోచించి) అహహా! ముక్కుపచ్చలారని యిక్కన్య నీయ ముక్కుబట్టుకొని కూర్చున్న ముక్కంటి యగు నీముక్కోపి యెక్కడ దొరికె. కట్టా! వానికి వచ్చిన బైరాగియఁట; పెళ్లికొమరుండఁట; పెళ్ళికూఁతురు ముందుగ నాబైరాగిని సేవించవలెనఁట; కటికి జోగికడ నక్కటికములేక దిగవిడచెనఁట. ముసలివాండ్రకు నిప్పటికి యాలోచనలు తోచవు ఏనింద్రుని వజ్రపాతంబువలని భయంబువలన నాఁటికి నేఁటికి వరుణాలయంబునఁ గాలంబు గడుపుచుంటిఁగాని యే నెఱుఁగనుగదా! (ఆకాశమువంకఁజూచి విమర్శించి)! ఇప్పుడనుకొన ఫలమేమి! యెట్లయినఁ గన్నెచెఱ విడిపించుకొనవలెఁగదా! యింతకు నాసహోదరి యదృష్టం బెట్లున్నదో! (ఆశ్చర్యముతో బొఱజూచి) అదృష్టంబు ముందుగానే యెదురగుచున్నది. చాలుచాలు మన మిప్పుఁడ యింటికిం జని మన తండ్రితో ముచ్చటించి మనమచ్చకంటి నప్పచ్చవిల్తుం డప్పిమ్మచ్చ కుంటి యగు చిమ్మచ్చకంటిపైకి రాకమున్న యచ్చోటఁ దొలఁగింతము (ముందటఁ బొఱ జూచి) ఓహోహో! యీవచ్చువాఁడు నందికేశ్వరుండువలె నున్నాఁడు.

(ఎదురుగ నందికేశ్వరుఁడు ప్రవేశించుట).

నంది—ఓయీ మైనాకా! నీలోనీవే పచ్చవిల్తుని పేరు హెచ్చరించు చున్నావేమి.

మైనాకు—ఇంక నీవెఱుంగవా! మాయోగిని విడచి పఱగళ్లబడి తిరుగుచున్నావేమి? సురలు కడు ముష్కరంబుఁ దలపెట్టిరి. వారి ప్రయోగంబుచేఁ బచ్చవిల్తుండు మాబిచ్చపు యోగి మనస్సు వశ్యముఁజేయఁ బంతముఁబట్టి పరివారంబుతో వెడలివచ్చెనని వింటిని. అక్కడ నేమి యొదవఁగునో పంచశర్యాగ్ర మక్కడ మాతండ్రి చేర్చిన నాసోదరి నీలోనే యాపరిచర్య మానుపించి యింటికి రప్పింపఁ జనుచుంటి.

నంది—(ముక్కున వ్రేలు నిడుకొని ఆశ్చర్యముతో) యేమీ విచిత్రము!

చ. మరుఁడిట కెట్లు రాఁగలఁడు మూఁడవకంటివాఁడెఱుఁగ వచ్చెనేని ని
య్యురుతర హేమవేత్రమున నయ్యన నీఁపునుబ్బఁగ లేసి వే
తరుమనె గుండెలున్నవె సదాశివు బంటను నన్నెఱుంగఁడే
మరలకవచ్చెనా యతని మానము ప్రాణముఁ దక్కనిత్తునా.

మైనాకు—

ఉ. ప్రజ్ఞలుమానుమింక రతిపాలుఁడు లోలుఁడు వచ్చెనప్పుడే
యజ్ఞుఁడవైతి మన్మథుఁడయారె కసంబుఁడునా రవంతలో
ప్రజ్ఞరసజ్ఞభావమునఁ బక్వముఁ జేసెడి నేర్పువానిదే
యజ్ఞ విరోధిపై దుముకఁ దెంపుఁ దానికిఁ వెన్కఁదీయునే.

నంది—

చ. కనుపడకుండవచ్చి కరకింపుని దాఁకునటంటె వింతవాఁ
డనఁ గతమేమి కంటఁబడడా పడడా జడదారిడాయవాఁ
డనయ మెటుండు వాఁడిగల యా మొగ మెన్నఁడు జూడలేదు నా
కెనయగ నొక్కసారి వినుపించు మొకించుక వాని వైఖరిన్.

మైనాకు—నందీ! వాని పోకళ్ళు చెప్పఁదరముగాదు వినుము.

చ. విరులును జిల్కపల్కులును వీనులకింపగు మత్తకోకిలో
త్కరముల పల్కులుం బువ్వుల సోఁపులు జల్లని పిల్లతెమ్మెర
ల్నెరచెఱుకుం గడల్కొను శిలీముఖఝంకృతులు న్మరందము
ల్వీరిసెడిచోట్ల వీఁడు వెయివేల విధంబులనుండు నిండుగన్.

చ. వనమిది జూడుజూడు సలువంకల రంకెలు వేయుచున్నవో
య్యనఁ జివురాకులం గొరికి యామనిఁ గోయిల లెల్లఁగూఁడి యా

మని గమదించు తుమ్మెదల మంజులగానము లాలకించితే
ననలివి లాస్యముల్సలుపు నర్తన లింపెసలారు పూవులన్.

ఉ. కమ్మనివాసనల్ నలుమొగంబులఁ గ్రమ్మఁగఁ బూలదుమ్ములం
జిమ్ముచు నిమ్మళం బొలయఁ జిందులు ద్రొక్కెడి పిల్లతెమ్మెర
ల్ద్రిమ్మరులౌచు సేదలను దెమ్మరఁ జేయుచుమంచు నిమ్ముగా
ని మ్మునికానలోనఁగల ప్రోడలమేనుల గౌఁగలించెడిన్.

పరాత్పరునినైన బట్టవచ్చునుగాని మరుని సాధారణముగ బట్టదరమా! (చేతితో జూపుచు) యీ కనబడుచున్న శుకపిక చంచరీక పదాతి సంచయంబులు దోడనడువ నీ కనబడుచున్న మందమారుతి స్యందనం బలంకరించి యుగ్యకీరంబులందరిని దళితలవిత ఘుమఘుమాయిత ప్రసూనస్తబకతూణీర శరంబులు బాహుమూలంబులంబాయ మానం బులై వెలయ వలచేత బంచబాణంబుల నమ్చు డాపలిచేత జంచచ్చంచరీక శింజినీ సముదంచితంబైన కఱకువారిన చెఱుకుస సింగాణి సింగారంబు పొంగారగ ప్రమోగించుచు నింతకుమున్నే మిన్నుసిగజడదారిఁదాఁకి బహిరింద్రియ విముఖంబగు వాని మనోమృగంబు గుఱిగొన మృగయుండువోలె బొంచియుండెనట్టు. ఈ నాటు వసంతకాలంబున నాకర్ణపథం బునఁబడె. నీ వికృతకృత్య చేష్టితంబుల ప్రాగ్దర్శింపుచున్నటికి. అకృత్య గాదగిన కార్యమీ వరకెన్నైనదేమో యీ పెదద మాతండ్రికి వినవచ్చెనో లేదో నాసోదరి యేమా యెనో కదా! యేను వచ్చుటయు నందుకే!

నంది—అట్లేని బంచశరుండు మనకు దృశ్యుండుగాడు ఏను నచటికేపోయెద.

(అని యిద్దరు నిష్క్రమించిరి)

---

## ద్వితీయ రంగము

### పర్ణశాల సీన్

(పూజసేయుచు శివుఁడు, ముందట భృంగియు, కొంచె మెడముగా ద్వారముదరిని పార్వతియు, చెలికత్తెలు.)

శివుఁడు—ఓరీ భృంగీ! నందిజాడ యేమైనఁ దెలిసెనఁటరా! తపోవనము, తపోవనమువలె నుండలేదురా! యీ కాలము వసంతకాలమా! కాదు. ఏమీ విచిత్రము.

భృంగి—మననంది యిప్పుడే వచ్చి పోఁటాఁడి చనినాఁడు. వనాంతమున జాగరూకుండయియే యున్నాడు. కాని స్వామీ! యీ వనలక్ష్మీవిహారములు నవ నవోన్మేషములుగా నుప్పతిల్లుచున్నవి. మీ చిత్తంబు ధ్యానాయత్తంబై యుండవలె సుమా! ఇదే సమయము చలింపగూడదుసుమా!

శివుఁడు—మనకేమి భయమురా! భృంగీ! యిది పూజావసానము. పరధ్యానముచేసి సమాధి నవలంబింప బోవుచున్నాఁడను. యీ వనములోని మనబోఁటి మునులయొద్దకుఁబోయి యీ వనలక్ష్మీవిలాసములకుఁ జిత్తములఁ జలింపనీక ధైర్యములతో నుండుఁడని తెలపిరమ్ము.

భృంగి—అట్లే పోయివచ్చెదనుగాని యీ నిర్జన స్థలములో దగ్గరకుఁబోయి మెల్లఁగా నీఁడువచ్చిన యీయమ్మ సింగారంపుబొమ్మ యీ చెలికత్తియ లిద్దరితోఁ నీసరసమెలంగుచున్నయది. కన్నెత్తి యీయమ్మకె చూడక మీపనిలో మీరుండుఁడు. భవదాజ్ఞానుసారంబుగాఁ బోయివచ్చెద (భృంగి వెడలుట.)

(శివుడు కన్నులు మూసికొని పరధ్యానంబుఁ జేయుట.)

పార్వతి—

మ. లలనా యేమని మీకు జెప్పుదును లీలాఖేలనాసక్తిచేఁ
జలనంబైనది నామనం బిపుడు గంజాతాక్షిదేవుండు ని
శ్చలయోగంబును బట్టె నీని వరివస్యావేళయుం గాదు నా
వలపేలాఁగునఁ దీరుఁ జేరినవి యీవాసంత శోభాతతుల్.

(తెఱలోఁ గలకలము)

కలవాణి—బాలా! తాళు తాళు. ఈ ప్రక్కగా నేదో యొక సంవాదంబు వినవచ్చుచున్నది.

(తెఱలో)

చ. సమయమిదే మదేభరిపుసాంద్ర సమాధిని మానుపింపనా
సమరపు నైపుణింగనుఁడు చక్కనిబొమ్మ్రయుఁ బ్రక్కఁజేరని
కోమల ముఖీలలామఁ గటాక్షింపని నోకకేచేయు వాడిబా
ణములివె నా పరాక్రమము నాకులు మెచ్చఁ బినాకినాఁకెదఁగ్.

(అందఱు నాశ్చర్యముగా వినుట.)

నవనా—

క. శూరుల శూరాలాపము
లారయ వినవచ్చుచున్న వంబుజముఖిరో
వారిటకు వత్తురేమో
పోరుంగనలేము పదరె పువ్వులుగోయన్.

పార్వతి—అవును. తప్పఁ బలికితివి చెలీ.

ఉ. ఇంతటిశూరుఁడామదనుఁడేయుగుఁ గాని మరొండుగాఁడు వాఁ
డెంతకునైన సాహసుఁడు భృంగియులేఁడిట ఫాలలోచనుం

డెంతయు యోగనిద్రగొనె నిత్తఱి నొండెడ కేగఁజాలమి
య్యంతకవైరి చెంతకిపు డందఱమేఁగ చరింతమింతలోన్.

(పార్వతి చెలులు ముందుకు నడచి శివుని పార్శ్వంబునకుఁ బోవుట.)

(ద్వితీయరంగము సమగ్రము)

---

## తృతీయ రంగము

### పొదరిల్లు సీన్.

(ప్రవేశము—మన్మథుఁడు తొంగిచూచి పుష్పబాణములు ధరించి)

మన్మథు—(ఉత్సాహముతోఁ జిందులు త్రొక్కుచు)

ఉ. ఇందుకళాధరుండితఁడిసీ తొలి యింతిని గోలుపోయి తా
నిందు మునీంద్రుచందమున నీమముఁ జూపుచునున్నవాఁడు నా
ముందట నెంతవాఁడితనిఁ బుష్పశరంబుల పాలుచేసి యీ
యిందుముఖిం దగుల్కొనఁగ నిప్పుడె చూపెద నా చమత్క్రియల్.

(చేతిలోని యిక్షుచాపంబు జారిపడుటఁ జూచి తత్తరపడి) అరె! అరే! ఏమిరా అపశకునము. (వంగి యావిల్లు తీసుకొని) కటా! మొట్టమొదటనే యిక్కట్టా! తుద కెట్లగునో! (కొంచెము విమర్శించి) ఆహాహా! ముం దేమి కానున్నదో.

సీ. పయనమయ్యెడివేళఁ బడఁతి కన్నీరు
మున్నీరుగా వలదంచు నిలపి యేడ్చె
నడుగుపెట్టెడి వేళఁ గుడి కేగ నొకపాల
వినఁబడె నొక తుమ్ము వీనులవియ
ననవిల్లు చేజారె మనసు చంచలమయ్యె
నెడమ కన్నదిరె నెన్నడుము వణకె
రెండు మూఁ డడుగులు ద్రొక్కించి నడచునో
విధవ యెక్కడకంచు వెలసె నెదుట
నొంటి బ్రాహ్మణుఁ డెదురయ్యె నుతిమినడువ
చూచినడువంగ సుడిగాలి చుట్టుకొనియె
నెన్ని యవలక్షణములైన నెన్నకిటకు
వచ్చి నిటలాక్షు నెదనేయ నిచ్ఛపడితి.

చ. తుద కిటుఁగూడ వెంటఁబడె దుశ్శకునం బిఁక నేమిసేయుదున్
మదమున నగ్గికంటిముదిమానిఁ గలంచ దలంచనేల నా
ముదము దొలంగెఁ జేతులివి ముందుకు [illegible]ఁడవు గాళ్లురావు నా
హృదయము దల్లడిల్లుగతి యేమిర బ్రోవర నన్ను దైవమా.

ఉ. కన్నులవింటివాఁడ వెయికన్నులవేలుపు మాఁటవింటి నేఁ
గన్నను మిన్నుఁగానక యెకాయకి నీసెగఁగంటి మీఁదికి
న్మిన్నక దూరఁగంటి నిది యింటికి మంటికిగాదు చూడఁగా
వెన్నుని కన్నబిడ్డ నిటు వెన్నునఁ బుచ్చును దెచ్చికొంటిఁగా.

కట్టా! దైవమా! యీ యుగ్రతపస్కుఁడు నాకేల తటస్థుఁడయ్యె. నేనెంత! నా బ్రతుకెంత! నా బాణము లెంత! వి[illegible]పాక్షుని ధైర్యకంచుకం బెక్కడ! ఎంత యున్మాదినైతి. హా! యీశ్వరా! అయ్యో! నీ పజ్ఞశాలకు రాఁగానే కాళ్ళు తొట్రిలుచున్నవి. చేతులు వణకుచున్నవి. యే నేమిసేయుదు నెట్లు సాధింతు. కటకటా! సమాధినిష్ఠుండగు నయ్యుగ్రుని విగ్రహంబు నాకంటఁ బడకమున్నే నా తుంటవిల్లు చెయిజారిపడె. నహహా! యేమి యీచిత్రము. పూవులతోఁ జిచ్చురపిడుగును జెదరఁగొట్టవలె నన్నుఁ గొనసాగునా!

చ. హరిహయుఁడట్టె నన్బిలువ నంపిన [illegible]డనె యేలపోతినా
హరి పురికొల్పినంతటనె యూనని యేటికి నొప్పుకొంటి నీ
పురహరు [illegible]రి కే నెట్టులఁ బోవుదు నక్కట [illegible]తినేని నే
నురిబడకుందునా! మరలి యూరక [illegible]నఁ బేరుదకున్నా.

చరాచరములలో నావలలోఁ జిక్కనివాఁ డొక్కఁడును లేఁడుగదా! యట్టి నాకీర్తి శరీరంబు కాక యీపాంచభౌతిక శరీరంబైన దక్కునో దక్కదో! జన్మమెత్తిన వాఁడు లోకంబున నమానుషకార్యంబులు సాధించి ప్రసిద్ధిఁ గొనవలె. నట్టివానికి నొక్క యవమానము వచ్చెనేని యది మరణంబుకంటె నక్కుడుగదా! బాల్యము నుండి కష్టపడి యార్జించిన కీర్తియంతయు నొక్క చేతఁపనివల్లనే [illegible] పుమాయును. హా! పరమేశ్వరా! నా యపరాధంబు సైపరా! (క్రిందఁ జూచుచు)

చ. హరునకు నాకు మస్తిమశకాంతరమున్నది యెంచిచూడ నా
పరుసని దేటి కయ్యమరపాలుఁడు నా [illegible]డమీఁద బెట్టె నా
పరు వణగారిపోవుటకుఁ బాల్పడి యుంటిని మచ్చకంటికి
న్మరుగున చిచ్చుకంటిరుషి నాకిఁక దిక్కవదేమి చేయుదున్.

కుసుమాకర సమీరకిశోర ! సంతోషించితిని చాలాబోధించి రతి యాటుండనీ. గడచిన రాత్రి నాప్రియసతి యాసుర పరివిఘ్నములఁ బరమేశ్వరుని పైకి జనవలదని యెంత వేడికొనినను వెంగలినై కనుమరపించి వచ్చితినిగదా ! యెదుటకు రాగనే యాధైర్య స్థైర్యంబు లేమాయెనో ! ఆహా ! (ముందటఁ బాఱఁజూచి) ఓహోహో ! రతి తఱుము కొని వచ్చుచున్నదే !

(రతిప్రవేశము.)

రతి—ప్రాణేశ్వరా ! యీపరమేశ్వరుండనగాఁ మీతండ్రి యంతటివాఁడు. వీని జోలికిఁ బోవలదని నేనెంత చెప్పినను నామాట పెడచెవిని పెట్టి నన్ను మరపించి వచ్చితిరిగదా ! చాలుఁజాలు వెనుకకు రండు. (అని పాదములపైఁబడును.)

మన్మథుఁడు—(స్వగతము) ఆహా ! ఏమియీవింత ! నామతి విస్మృతమైనదా యేమి ! యెన్నఁడును వినుకోనని మాటలు నోట వినుకొంటిని. నాదెబ్బకు నీగిబ్బ తత్తడికా డొక్కు లెక్కయే. (ప్రకాశము) రతీ ! నీకింత పిచ్చియేల ? ఆడుదానవు తత్తరపడనేల ! నిలుము. యీసమరసన్నాహ సమయంబున నేను జయశోభాసమాలింగితుండనై నీవు సపతి పోరు తెచ్చి పెట్టుము వినుకొంటివా ! చాలుచాలు, లెమ్ము. (లేవఁదీయును.)

రతి—(అంజలిజేసి)

ఉ. క్రొన్నన వింటి ప్రోడ విధి కూఁడునె నీకు మనోధినాథ నే
నిన్నటిరాత్రిఁ జెప్పితిని నీకొనరం జన వద్దటంచునా
మన్ననమైనఁజూడ కవమానపుఁ గార్యము నొక్కినీర నా
యన్నది సున్నచేసి తరటా ! ఇకనైనను రమ్ము వెనుకకుక్.

మన్మ—కోమలీ ! న్యాయమా ! వెనుకకుం జనుదెంచుట కాదుకాదు. సుత్రాముఁడు గోరినటి పని తప్పకచేయుట నా ప్రతిజ్ఞ. నానీమము నేలతప్పాదును. నిక్కము నాకు భయంబులేదు. నామామయు నాకు తోడ్పడెడు. మానక తూర్పుగఁ జూడు మానిని ! (ప్రకాశముగా) నాతలపెట్టిన కార్యము దేవకార్యము. అవశ్యకరణీయము. దీనికి రావలసిన సన్నాహమంతయు సిద్ధపడినది. నా మేనమామ, నీతండ్రి, నిన్నిచ్చిన మామ, చందమామ, యదుగో ! సమయమునకు నిండుగ నాకుఁదోడగుచున్నాఁడు. చూడు ! (చంద్రోదయము.)

రతి—(తూర్పుగఁజూచి) ప్రాణనాయకా ! (హస్తమునిర్దేశించి) ఈచంద్రుఁడా ! తన పదియారు కళలలో నొకకళ మొలికి పడుటకు వెనుకటి యలుక పాడమికాఁబోలు నిప్పుడీ నిజకళాపీడుని యోగభంగంబునకు సహాయపడుట. ఆహాహా ! మామయల్లుండ్లు మీయిద్దరికే తగును ! నామనోరంజనా ! నాతండ్రియైన నేమి జడుఁడుగాడే విను.

చ. తనకళకాంతులంగొని సదా దిగ్రమింగెడి దేవకోటిపై
నెనరునుజూప నీకిపుడు నెయ్యము నొయ్యన నియ్యకొంచునా

జనకుఁడు సిగ్గులేకయదె చయ్యనని య్యెడఁజూడనయ్యె నా
యనజడభావ మేమనుదు నయ్యయొ దయ్యముతోడఁగయ్యమా.

మన్మ—

ఉ. కయ్యమొ నెయ్యమో యిటులఁగావలె దయ్యముతోడనీఁడుగా
గుయ్యిడలాభమేమి మనకుంగలభాగ్యము దీనికన్ననిం
కెయ్యది కోమలాంగి యిపుడీయ్యమ చక్కని దీడఁజిక్కనే
నియ్యమజేత నియ్యమను నిక్కమయొక్కటి చేసి వచ్చెదన్.

రతి—

ఉ. వచ్చెదనంటివా [illegible]దుగో వచ్చితి నిన్గొనిపోవ లెమ్మునీ
పొచ్చెపుమాటనమ్మ నిఁకబోలదు నీకిది నాథ రమ్మనీ
మచ్చులు మాయలెల్ల మటుమాయములయ్యెడు నీనిముందటన్
బచ్చనిపంటపైని కిది పచ్చగనుండుటకౌనె నిచ్చలున్.

మన్మ—

ఉ. నిచ్చలు నిచ్చకాలగునె నీనుపు హెచ్చులు తప్పవచ్చునే
బిచ్చపు బోగి నిచ్చ[illegible] సోకిన యింత [illegible]ంతిరో
పిచ్చులు వెల్లులె[illegible]వె భీతిల[illegible] నెల్లి [illegible]ంగనే
వచ్చెద నొక్క యేటునను [illegible]ర్థిసిమంగుని యోగచిత్తమున్.

రతి—

ఉ. చిత్తము యోగపక్వ మది చిక్కనె నీశరధార లేపునై
జిత్తడిచేసిన న్విషయశీలుఁడుగాఁడు శివుండు నాథ! నీ
యెత్తులు రిత్తచేయు పయియెత్తుల బన్నెడువాఁడు కాని నీ
పిత్తన మత్తనీయుఁ డీఁక వెనక్కురా చెయిదొసక్కుండగన్.

మన్మ—

చ. అమరులకార్య మే నన్నుతమాఁడుదునే సుకుమారగాత్రి! నీ
భ్రమ లికమాను రానిటకు వచ్చినదానవు దోఁపనుండి [illegible]
సమరపునైపుణింగనుము చంద్రకళాధరు నెల్ల గెల్తునో
నిమిషములోన విల్లిదిగో నింపెద ములుకులు నిప్పుడేసుమీ.

రతి—

తే. గీ. ఎంత చెప్పిన వినవైతి వేమిగతియొ
యేమికానున్నదో [illegible]ము నోముఫలము

సురల పురికొల్పు వినకున్న సొద్దుగలదె
తనకు మాలిన ధర్మంబు దాల్చదగునె.

చ. వలదు మదీశ శంకరునివంకకు జంకక పోతివేని నీ
బలమున కేదియో యొక యపాయము పైబడునేని నిన్నుగ
న్గొలిపిన యా శచీవరుడు గూరిమి పేరిమి నష్టగించునే
వలనుగ సంచరించవలె వాసిదొలంగక యెంత యుండినన్.

మన్మ—

ఉ. ఉండిన దేమొయున్నది మహోత్కటి రమ్మన రాదు కొమ్మరో!
చెందుదు సంప సొంపముల జిందర వందర జేసి జాహ్నవీ
మండను యోగమండలము మాపుదు నోపుదు జిత్తవృత్తి నా
కొండలజానికూఁతునకు గొల్పి దగుల్చెద నేఁపు మీరగన్.

రతి—(చేయి యొకచేత బట్టుకొని రెండవచేత గడ్డంబు పట్టుకొని బ్రతిమాలుకొనుచు)

గీ. వినుము ప్రాణేశ నామాట వినులనొగ్గి
వలదు వల దిట్టి పని నీకు వలనుగాదు
చెప్పబట్టితి వెన్నఁడో చిన్ననాఁడు
నన్ను నేడ్పించ నీ కిది న్యాయ మగునె.

ఉ. శూరులు మున్ను గొంద ఱల సుందరుల న్మదిఁజూచి యిట్లనే
వారి హితోపదేశముల వాసి నెఱుంగక త్రోసివేసి స్వే
చ్ఛారతులై చరింపుచు విచారములం జెడిపోయి రయ్యయో
శూరతఁ జూప నీకు బెఱచోటులు లేవొకొ నీ కిదేటికిన్.

చ. మునిజనధర్మమార్గముల మూల మెఱుంగక కంపగొట్టఁ బోఁ
జను నె రమాకుమార మనసావిరసాలకు సారసాక్షు నం
దనుఁడవు గొప్పవాఁడ విది ధర్మముగా దిక గట్టిపెట్టి నీ
మనసున నెంచికొమ్ము ఘనమా తన హానియు లోకనిందయున్.

మన్మ—అవును లోకోపకారముకంటె ధర్మమేది ?

రతి—

చ. తన కొగిగల్గునన్నియును దాఁగలుగ న్బలవద్విరోధమా
వనరుహగర్భునైనను విపత్తులఁ ముంచును ఫాలనేత్రుఁ డా

య్యనఁబగబట్టి భగ్నముఁ జేయుచుఁ గంటను జూచునేనియా
ఘనులు దిగీశులేమయిన గాతురె చూతురుగాని భీతులై.

శివశివా! జీవితేశ్వరా! విషమాంబకుఁ డతండు సామాన్యుండుగాడు. వానికి దపోభంగంబుఁ జేయవద్దు. వద్దు.

మన్మ—

చ. మగుదరొ నీకు నొక్కటియు మున్గనఁ దోచదు చాలుగాని నా
మగసిరిఁ జూడు మూఁపయిన మక్కువ యెక్కుడు నీకుఁ బుట్టఁగ
ట్టెగ విలుపట్టి యాశిఘ్రుని ఛీకొని కొట్టిన గట్టుకూలిపై
నెగఁబడునట్టు లొట్టుసుమి యిందలి గుట్టువచింతు నమ్మవే.

విషమాంబకుం డతఁ డంటివి. విషమాంబకుఁడను నేను గానను కొంటివో! విషమాంబకంబుల లెక్క వానికంటె నాకింక రెండెక్కువగదా! వాని యంబకంబులలో రెండుమాత్రము చెంయొకటి. నాయంబకంబులలో నాద్యంతంబులవి నొడపెట్టునవే. మిగిలిన దొక్కటిమాత్రము సెగలుపొగలు వెలువడు యుమ్మూర్తమగతిఁ గలవి కావు. నాయంబకంబు లన్నియు జిద్దుబుడిపెంగులు. సమగతిఁ గలవి. పంచాంబకుఁడు త్ర్యంబకుని గెల్చుటఘుకరము. వాని యొక దోసివలన నీనకొక సెగదగులునను దిగులు విడువుము. నీనిమర్కు మిక్కిదని నానమ్మకము.

రతి—నాథా! లోకముసక్తైన వెనవవలెను.

ఉ. ఒద్దికతోడ వాఁడగు యుగ్మలియైనను బుద్ధిసెప్ప కీ
పద్దున కెట్లు పోవిడచె వద్దన మానఁడెయంచు లోకు లీ
రద్దిని నాపయిం బెడుదు రద్దిరి యీపని రద్దుసేయవే
వద్దిక నెద్దు రాతుగిన వద్దెటు పోదము వాదునాయమే.

మన్మ—

సీ. పుడమి బంగరు కెన్ని పుటములు పెట్టిన
　　　మాఱునా యొకవన్నె మీఱుఁగాని
గందపుఁ జెక్క చక్కఁగ బట్టి చెక్కినఁ
　　　దఱుగునా యొక తావి పెఱుగుఁగాని
క్షీరపూరము నెంత సెగమీఁద నుంచిన
　　　విఱుగునా యొకరుచి మఱుగుఁగాని
వజ్రంబు సానపై వడి నెంత యొఱచిన
　　　నలుగునా యొక కాంతి నలుముఁగాని

రతి—"కార్యేషు మంత్రీ" యను ధర్మవాక్యము భార్యల మాటలు తప్పక విన వలయునని బోధించుచున్నయది చదువవే.

మన్మ—అవును చదివినాను. గాని సతుల పలుకులు సద్ధర్మములని యెఱింగియు నిందు నీమంత్రంబు మన్నించను. "స్త్రీబుద్ధిః ప్రళయాంతకా" యను నీతివచనంబు వినకుంటి వే.

రతి—"పరేంగితజ్ఞాన ఫలాహి బుద్ధయః" యనునట్లు సుబుద్ధియగు భార్యచెప్పిన మాటలు వినుట శ్రేయస్సులమూట. ప్రియురాలి మాటలు వినవదేమి.

మన్మ—కొంచెమైన నరమరలేక నమరవగునసంభాషణంబుల గర్భభూషణంబులుగ నమ్మి పయనమై వచ్చిన నీనెయ్యంబున బొంకులు జెప్పవే. సుబుద్ధి విశేషమని వినవే!

రతి—(చెయ్యి విడిచి యవతలకు దిగిరి స్వగతము) ఏమిలాభము! దైవమా! యెంతచెప్పిన వినఁడుగదా! యేమికానున్నదో నామంగళ సూత్రఫలంబెట్లున్నదో హా! హా! (పైకి నభిముఖియై) స్వామీ! ఆలించవే! లక్ష్మీనారాయణుల గర్భవాసంబున బుట్టిన సుకుమారుండవు. అబ్బబ్బ! ఫాలాక్షునితోడ నసాధ్యమగునే!

మన్మ—సాధ్యము కాకపోయినను సరే! సాధ్యము చేసికొని జయము బొందుదు.

రతి—నీవు జయమును బొందఁజాలవు. నీకు నమస్కారము జేయుదు. నామాఁట వినుము మహాత్మా! (అని కాళ్లుపట్టుకొనును).

మన్మ—సుధర్మాధిపతుల యాజ్ఞ మీరరాదని వచ్చితిని.

రతి—వచ్చిననేమి? యామహాదేవు డుమహాయోగారూఢుండు. వాని గెలువ వశము గాదు.

మన్మ—వశము గాకేమి! వశము చేసుకొను చాతుర్యముండుటచేతనే యింద్ర సభలో సత్ప్రతిష గంటిని.

రతి—అన్నమాత్రముచేత నది యొకతప్పుగాదు. మనమున నదిమఱచిరమ్ము.

మన్మ—మఱపురాదు. పురందరుని నిదేశంబు శిరసావహించితిని.

రతి—శిరసావహించిన నేమలాభము రాదు. త్రిపురాంతకుని మీదికి జనవలదునా!

మన్మ—చనవద్దని యడ్డగించుట సతులకు బుద్ధి లోపము. నీమాఁట విననను. వచ్చిన వాడను రానే వచ్చితిని! నూరకమరలి వత్తునే! భోభో పోపో!

రతి—పోపొమ్మన బోవుదానను గాను. మరలిరానను బుద్ధిమరచి పొమ్ము. మరువకపోతివా! పగలు పొగలఁ బడి సెగలు వెడలవే.

మన్మ—పగలెక్కడ! సెగలెక్కడ! నీతండ్రియు నాకు సాయపడడే (చిటికెలు వేయుచు) నిమిషంబులో సుమా వాని తపోభంగము.

రతి—తపోభంగంబునకు జెయిమిగిలితివా! వాని కంటి మం[illegible] మగుదువు.

మన్మ—(కళ్ళురిమి) భస్మమగుదువని పలికినావిన మాటలంటివి. నిన్నిపుడు హతము గావించితినా బాగుండును.

రతి—కినిసి హతము సేయుదు నంటివి. సరిగ నన్ను హతము చేసిపోతివా! వద్దనువారలేరు. న్యాయమువినా.

క. తనబల మెదిరి బలంబును
మనమున యోచించి యెపుడు మఱలక యరిపై
కనికరుగవలయుఁ దప్పిన
వనజజునకు నైన హానివచ్చును నాథా!

మన్మ—

సీ. తండ్రియాజ్ఞఁ జరించి ధరలోన భృగురాముఁ
డెంచడే తనకీర్తి మించుకోణి
తల్లివాక్యముఁబూని తనభాగ నాకుంజు
కీర్తి గాంచడె నాఁడు కీరవాణి
గురుఁడె దేవుండను గుఱివెట్టి ఫగ సాగి
శ్చంద్రహాసుఁడొందఁడె ఖ్యాతిఁ జంద్రవదన
తన పితామహు మాఁట దాఁటకి పాఁటిగా
బలివీడడే శోకములను బోణి

తే. గీ. వారివలెనేను నావజ్రపాణివాక్కు
గుఱిగ నెంచుచు నిటు సెనఁ గువలయాక్షి
వలదు వలదని మిగులగ వగలఁబోగల
నగరె నగరాట్పుయోధరి నగరిలోన.

రతి—

సీ. తనపత్ని వాక్యము ల్దలపెట్ట కల హేమ
కశిపుఁ డేగఁడె నాఁడు కాలుపురికి
సతిమాఁట మతినాట కతిసాహసంబుతోఁ
గృతవీర్య సుతుఁడు దా వెతలఁబడఁడె
యతివమాటలుఁ ద్రోచి యతిబలుఁ డావాలి
గూలఁడే యిలనొక్క కోలచేత
ప్రియురాలి బోధల బెడచెవిఁ బెట్టి యా
రావణుఁ డీల్గఁడే రణములోన

ఆ. వె. గాన సతులమతులఁ గలియకపోవుదో
గీఁడుమూఁడు గూఁడు గింక లెల్ల
విడుమువిడుము నీకు విశదంబుగాఁద్రొక్కొ
విడువఁజాల నిన్ను వినుము నాథ.

మన్మ—

సీ. పరుల కాపదఁ గోల్పు మరగియుండుట కంటె
పరధనాపేక్షలోఁబడుట కంటె
పరనింద లెప్పుడుఁ బరగియుండుటకంటె
పరభామినులను బొందఁదలఁచుటకంటె
తల్లిదండ్రుల మాట దప్పిపోవుట కంటె
మనసు జూదముఁ మీఁదఁ గొనుట కంటె
మద్య పానము సేసి మసలుచుండుట కంటె
[illegible]గిన్నెముకకుఁ దాఁ [illegible]టకంటె

తే. గీ. ప్రబలపాతక మన్యతంబు పంకజాక్షి
యాఁడితప్పఁగ నాదని యార్యకోటి
చదివి చెప్పిన నొప్పైన శాస్త్రమెల్ల
మఱచితివె నీబుద్ధి మందయాన.

రతి—(వెక్కి వెక్కి యేడ్చుచు) ఆహాహా! ప్రాణేశ్వరా! నేను నీకు నెంత చెప్పినను చెవిని నాఁటక యున్నావు. నేమిచేయుదును! ఎవ్వ రడ్డపడుదురు! నీబుద్ధికి నింకొక మాఱు పాటిఁజూచికొనుము.

సీ. దయలేక తనవచ్చు దారిగాంచఁగ నేని
కుసుమాకరుఁడు నీకుఁ గూర్మిసఖుఁడు
జనులు పల్మరు ద్రిమ్మరినను జాపకుండిన
పిల్లతెమ్మెర నీకు బెద్దతేరు
కనిపెంచి కనుపెట్టి కొనువారిఁ గలయుని
పొగరుఁ గోయిల నీకు దగినబంటు
విరియాఁటలాడు క్రొవ్విన మధుపాళి క్రొ
న్నన వింటనంటించ నమరె నీకు

తే. గీ. నిట్టివారిని మదినమ్మి మట్టుమీరి
యలుకఁజూపుచు రిత్తకోరికలను గోరి
త్రుళ్ళుచుంటివి నిన్నెట్లుఁ ద్రోవనిడుదు
ప్రాణహానియందు బొంకిన పాపమగునె.

మన్మ—

సీ. నడుమ నాయకమణిఁ దొడఁగని హారంబు
శశిమండలము లేని శర్వరియును
సంతతి చేపట్టి సంసారిజీవియు
గలహంసయుండని కొలను వలను
సదసద్వివేకంబు చాలని చదువును
చంచరీకము లేని సరసిజంబు
సరసిజాప్తుని దీప్తి నెరయని దినశ్రేణి
రాజరాజు చేపట్టని రాష్ట్రసరణి

తే. గీ. పుడమి శిఖరంబులేని గోపురముతీరు
సత్య మొలయని వాక్కులతోడ సరియనంగ
నట్టి తుచ్ఛపువృత్తి నే నెట్టులోర్తుఁ
బలుక నీ కెట్లు నోరాడెఁ బద్మగంధి.

రతి— (కోపమునభినయించుచుఁ జేయి సాచి)

కాంతివృత్తము.

నీతండ్రి నెఱుంగనె నిక్కముగా
నీతి న్విడనాఁడి యనిందితనా
యాతుప్రియకాంతల యా సుగుణ
వ్రాతంబులఁ దోచినవాఁడె కదా.

మన్మ—ఆహాహా! యిదా నీయెత్తిఁగినది.

తే. గీ. నాఁతి నా తండ్రి సతులమానంబు దోచె
నంటివా సర్వలోకావనైకదీక్ష
గొనినవాఁ డౌట వివిధోగ్రకుటిలదైత్య
కోటిఁ దునుమాడుటకుఁ గాదె పాటిఁగాదె.

## సీసమాలిక.

రతి—

నీ పెద్దతండ్రిని నే నెఱుంగనె నాథ
మునిపత్ని మోహించి మోసపుచ్చె

మన్మ—

సతి యాతఁడా మునిసతి నంటెనంటివా
యదె సహస్రాక్షుత్వ మతనికొదవె

రతి—

నీ యగ్రజన్ముని నే నెఱుంగనె నాథ
తనపుత్రి మోహించి తగిలిపట్టె

మన్మ—

నా యన్న తనకూఁతు నాసించెనంటివా
సృష్టికి భవరీతిఁ జెప్పుటకెకె

రతి—

నీ తల్లి చలచిత్త నే నెఱుంగనె నాథ
భూపులయిండ్లలోఁ బొదలుచుండు

మన్మ—

పొలఁతి నా తల్లి భూపుల బొందెనంటివా
పరిపాలనము చేయ నరుపుటకెకె

రతి—

నీ చెల్లెలగు దాని నే నెఱుంగనె నాథ
తలమీఁది [illegible] వలకుఁ బోవు

మన్మ—

నడుచు ముప్పోకల [illegible] చెప్పుదంటివా
త్రిభువనంబుల నుద్ధరించుట కెకె

రతి—

తే. గీ. ఇట్టి మీవారిచర్యలు గట్టిపెట్టి
యొరులనాఁడెదు నీ కిది యుక్తమగునె
తగదు చాలించు నే మంచిదానగాను
వెనుక కరుఁదెమ్ము మొనయమ్ము విడచి లెమ్ము.

మన్మ—

తే. గీ. అహహ మహనీయగుణులైన యట్టివారి
నెగ్గులాడెదు లగ్గటే సిగ్గుమాలి
తగ్గిమాటాడు నీ కిందు సిగ్గుదోచ
దగ్గికంటికి తపంబిక నుగ్గునుగ్గ.

రతి—(దుఃఖపడుచుఁ గూలఁబడి చెంపను జేయి పెట్టుకొని వెక్కి వెక్కి యేడ్చుచు స్వగతము)

మత్తకోకిలావృత్తము.

ఎంతఁజెప్పిన మానఁడే యిఁక నేమిసేయుదు దైవమా!
యంతకంతకు రెచ్చినాఁ డితఁ డయ్యొ యంతెమొ దైవమా!
యంతకాంతకు నంతరంగ మదంత యల్పమొ దైవమా!
పంతమా! బలవంతమా! మదిఁ బొలుపొందఁడేమొ దైవమా!

హా! పరమేశ్వరా! యీ భయశోకచింతాభరంబు లెట్లు భరింతు. నహహా! దైవమా (రతీదేవి మూర్ఛఁజెందఁ బడును.)

మన్మ—(నలుప్రక్కలఁ గలయఁజూచి తిరిగి తిన్నగా వంగిచూచి తనలో) మూర్ఛ గాఁబోలు! కానిమ్ము. నా ప్రతిబంధకము వదలిపోయినది. సంకల్పితార్థసిద్ధికి దైవబల మిట్లుండవలె. నహహా! యీలోపల నే నాచరించిన యత్నమంతపని నెరవేర్చుకొందు.

(మన్మథుఁడు పర్ణశాలలోనికి వెడలిపోవుట.)

---

## చతుర్థ రంగము

పర్ణశాల

(ప్రవేశము—జ్ఞానముద్ర ధరించి యోగనిష్ఠలో శివుఁడు; వామభాగంబునఁ గొంచె మెడముగా నిలుచుని చేతులు జోడించి ధ్యానించుచుఁ బార్వతియు; ఆ వెనుక ప్రక్కను జెలికత్తియలిద్దఱును; శివునకుఁ గుడిప్రక్కగా గొంచెము దూరములోఁ జెట్ల చాటునఁ జెఱకువిలుగాఁ జేత సారించి పుష్పబాణముల చేతఁ దాల్చి ప్రత్యాలీఢపాదుండై యవష్టంభములో నిలఁబడి మన్మథుండును).

మన్మ—(తనలో)

క. చక్కని సమయం బిదె నా
కిక్కఱకంఠుండు దొరకె నిక్కడ నిక్కం
బిక్కమలముఖియుఁ బ్రక్కనె
చిక్కిన దిఁక చిటికెలోనఁ జిత్తము లవియన్.

ఉ. మిక్కిలి పుష్పబాణములు మెళుకువతో సవరించి వేసెదన్
జక్కులరేనిమిత్రుని నిజంబుగ నీ చెలితోడఁ గూర్తు నా
కెక్కసమా యిదెంతపని యెక్కిడ డాపలిచేత నేనె నే
చక్కెరవిల్లు పట్టితిని జక్కెరబొమ్మను ముందు వేసెదన్.

(మన్మథుఁడు పుష్పబాణములు పార్వతిమీఁద వేయుట).

పార్వతి—(కలవరపడి చెలికత్తెలతో) ఏమీ! విచిత్రము! నామనసు రాగాంకుర ప్రచుర మగుచున్నయది. క్రొత్తక్రొత్త వికారములు కన్పడుచున్నవి.

(పార్వతి మైదూలి పడఁబోవఁ చెలికత్తెయలిద్దఱును బట్టుకొనుట)

కలవాణి—చెలియా! మనమిఁక నిక్కడనుండఁగూడదు. శీఘ్రము మన గృహంబునకుఁ బోదమా!

నవమాలిక—(పండ్లుగొరికి కలవాణితో) ఓసీ! నీవుఁదెలియనిదానిగాని మాటాడకుము. మనయన్నిఁటికి నీశ్వరుండే తీరును. నమ్మినప్పుఁడు మనచెలికేమి.

కలవాణి—(పార్వతి వినకుండఁగా) చెలీ! యౌవనప్రాదుర్భావ మూరక పోవునా?

నవమాలిక—అగునుగాని యిప్పటి నైసర్గికస్థితి యట్టిదని నమ్మను.

పార్వతి—అబ్బా! అబ్బా! నన్ను వదలుఁడు. (సఖులు విడువఁగాఁ బార్వతి కూర్చుని తనలో) ఆహాహా! గేమి! యీయనురాగమహిమ యెన్నఁడునులేదే! శివోపచార తాత్పర్యంబంతయు శివాలింగన తాత్పర్యమయ్యె. ఔరా! కన్యాత్వదశలో నుంటిని. నాహృదయ మిట్టి యసమయములో నిష్కారణమ యిట్లుఁ గానేల? (కొంచెము విమర్శించి) కారణమేదో యుండక మానదు. (ప్రకాశముగా) సఖీ! ఇంతకుమున్ను తెఱలోనుండి మనకువినబడిన వాక్యము మఱల జ్ఞప్తికి వచ్చినది. యీ యజ్ఞుఁడు సమయజ్ఞుఁడుగాఁడు. చుఱుకుటమ్ములఁగొని నా హృదయంబున నాటవేసినట్లుఁ దోచుచున్నయది. వాఁడియ్యెడ నెక్కడనైనఁ బొంచుండినాఁడేమో పాఱఁజూడు.

కలవాణి—(నవమాలికతో) ఓసీ! నీవిక్కడనేయుండుము. (పరిక్రమించి జూచి) ఆ! ఆ! (మఱినాలుగడుగు లవతలకుఁబోయి చూచి) వీఁడెవఁడో యీతరుగుల్మంబున దొంగవలెదాఁగి పొంచువేసినాఁడే! వాఁడెకాఁబోలు వీఁడు. నాకండ్లు చెదరిపోవుచున్నవి. అబ్బబ్బా! (తొందరగాఁ బార్వతియొద్దకుఁ జేరును).

పార్వతి—(లేచి గురిపెట్టిచూచి) చెలీ! యింక ననుమాన మేల! పంచశరుండే (మఱి [illegible] గడుగులుపోయి తీవ్రవేదన సూచించుచు) శ్రీసుమారా! సుకుమారా! మారా! పంచశరా! నీకిదేమిపని; తలిదండ్రుల చాటుదానను. వివాహము కాని బాలికను. సదాశివ సేవాపరతంత్రురాలను. నన్నుఁటరా నీవు పూవుటమ్ములఁగొట్టుట! ఆహాహా! నీవు కార్యజ్ఞుఁడవా!

నవమాలిక—(దగ్గరకువచ్చి) కొమ్మా! నామాటవిను. నీమాటవినువాఁడా! వీఁడా, యీడాగినవాఁడా. వాఁడేపోవును. వానితోడవాగ్వాదమేల? మనకిష్టమైనచో నిక్కడనుండుదము. లేనిచో లేచిపోదము. రారమ్మ చిన్నదానవు. నీకేల?

మన్మథుడు—(స్వగతము) కట్టా! మొదట నేఁదలఁచిన దొకటి; చేసిన దొకటి; నామతి యేమైపోయె. నాకేశు నానతి, నాకాశకేశునికోసమువచ్చియు నయ్యవకాశము చేసికొనకముం దీయాకాశమధ్యను గదలించితిని. కదలించిన మాత్రాన రాకాసివలె నరచుచున్నయది. దీనియాఁపులచేతనే జోగి వేగిరమ కండ్లు దెఱచునేమో కదా! (తిరిగి చూచి) కొంచెము చొప్పుమాటిచి మఱల వత్తునా! ఆ! అదెట్లు. యీ లోపల రతిమూర్ఛ తెలసెనా యీరంగము కూడఁ జెడును. ఏమిచేయుదు. హా! యీశ్వరా! యీశ్వర తపోభంగమునకన్నను భంగము లే. కత్తి నాగఁటికంగు వచ్చినది. కాని మన మిచ్చోటువాసి యిందుకు నేఁపు చొప్పమాటి యల్లకడ బొదలంట నిలుతము. (మన్మథుఁడు నాలుగడుగులు వెనుకకుఁబోయి మాటుత్రోవను మఱియొక చోట దాగుట)

పార్వతి—సఖులారా! యీకొంగ పాఁకిపోయెఁ గాని ఱెంకివదలిపోవునా!

కలవాణి—(నవ్వి) కలికీ! ననవిల్తుండు వేఁటకాఁడా! ననవిల్తుని ముల్కివంటి దానవు గాన నీకన్ను చెదరెనేమో!

నవమా—ఓసీ! నీకన్నుగూడ చెదరెనా!

పార్వతి—(చిఱునవ్వునవ్వి) కలవాణి రాణి యెప్పుడును గలకలవాణియే రండు. మనత్రోవునకు మనము పోవుదము.

(అని అందఱును పరిక్రమించి పూర్వస్థానములు చేరుదురు.)

మన్మథుఁడు—(మఱియొక పొదచాటునఁ బ్రవేశించి) ఆ! పీడ కొందమాని నిమిత్తముగ నుండిరిగాని నాచూపు బాణములు దీని మనసునఁ జాలుకుమనిపించెనో! లేదో! యేమైనను నిదానించి వీరిసంవాదము వినుదును.

పార్వతి—(చెలులతో) ఆపూలరంగఁ డింకను నిచ్చటనుపట్టె నెప్పటట్ల నున్నాఁడని తోచుచున్నదే.

కలవా—భ్రాంతి మఱచిపొమ్మా. నీ యీశ్వరుని నీవు ధ్యానించుకొమ్మా.

నవమా—కలవాణీ! ఇంతమాత్రాన నీపని మానునా! సుందరీ యందాక నోపిక మోపకచేసికొని యెప్పటట్ల యుండవచ్చును.

పార్వతి—(ముఖమున నయిష్టము నభినయించుచు) మీవ్యంగ్యార్థములు నాకుఁ బొడకట్టకపోవునుసుమా!

నవమా—అదికాదు. కొమ్మా! తుంటవిలుకాని తుంటరితనంబున కనుగొంటిమి కాని, నీ హృదయ మెట్లున్నయది?

పార్వతి — చెలులారా! సిగ్గువిడచి చెప్పుచున్నాను. వాని మంటమారితనం బెన్నఁడు మంటఁ గలియునో కాని కామానురాగంబులు నామనంబున నవనవోన్మేషంబులై విజృంభించుచున్నవి.

మన్మ — (తనలో, తలయూచి) ఆ! తళుక్కున నేనీ తలిరుఁబోణి హృదయంబున గలుక్కుమను నాతలిరుటమ్ములు చుఱుక్కుమని నాఁటవేసి యులిక్కిమనిపిఁ [illegible] గిరుక్కుమని దిరుగువచ్చి మఱికడ నక్కియుండుటంజేసి నాచేతి యీయాయు[illegible] బుల వాడితనంబు నాకములకుఁ బ్రత్యక్ష గోచరమయ్యె. నహహా! యిదియొక జయసూచకము. (కొంచెము విమర్శించి సందేహముతో) ఇవి యింతమాత్రమున నిమ్మ[illegible] [illegible] [illegible]షంబుఁ భేదింపఁ [illegible] కొన[illegible]ట్లు. కటా! [illegible] [illegible]నది. పసిపాప కాన [illegible]ని [illegible]మనసు [illegible]ములకుల [illegible] [illegible] గాని దీని యవయవంబులకంటె మదీయసాధనంబు లెక్కుడుగావు. యీచిన్నా[illegible] యెన్ని నాళ్ళనుండి యిక్కడనుండెనో దీని రూపరేఖా విలాస విభ్రమంబులచేత నించుకంతైన వాడు సోకని వీనియవార్య ధైర్యవల్లి నేనెట్లు ద్రుంతును. నేనెంత! నా సాధనములెంత. అయ్యో! యెంత యనాలోచితమైన యీదుష్కార్యమునకుఁ దొరకొంటిని. (కొంచెము ముందుకు నడచి లక్ష్య మొకమూలకుఁబెట్టి, మఱల గొంచె మాలోచించి) ఆహాహా! లోకస్వభావము. సహజశత్రువులనఁగా నన్నదమ్ములే కలసి మెలసియున్నను దఱుచుగాఁ బరస్పర రంధ్రాన్వేషణంబులు చేసికొనుచుందురుగాక. వారిలో నొక్కనికిఁ గనరాని క్రూరత్వముండునా! యది మృదుస్వభావ శీలుండగు నారెండవ వాని కొడుకుఁడు గలిగి సుతుక మీఁదకు వచ్చునందాక బయికిఁ [illegible]. దగంత విశ్రాంత విజయ మంగళుండనగు నాయొక్క [illegible] నోర్చక నాయన్న తన [illegible] చమత్కారము చూపుట కింతకుముందే భావికాలంబుఁ గని పెట్టి కాఁబోలు. నాకిక్కడ విజయంబు లేకుండునటుల నావిజయసాధనంబులనుండి సారంబులనెల్ల సంగ్రహించి తత్క్షణంబున నెట్టి మహాయోగినైన నాచేయు పదియవస్థలలో తన శృంగార విలాసములచే దాన ముంపఁజాలిన యిమోహనాంగిని సృష్టిఁజేసి దీని దగ్గర స్పర్శనాదులచేఁ జిత్తంబు చలింపకుండునట్లుఁ బరిసరంబునఁ బరిచర్యయనెడి నెపంబునఁ జేర నియమించి యీగంగాధరున కింతకాలంబుననుండియు నలవాటు చేయించెనని తోచుచున్నయది. కాదేని దీని లావణ్యలీలా ఝుళంఝుళిచే నితని యోగానల జ్వాల లప్పుడ చల్లారిపోఁవే! ఇప్పుడ నాయీనిస్సారపు బుష్పవర్గంబులు దానిలో నేమూల నిగిడిపోవునో! హా! యింతచక్కని బొమ్మను దగ్గరఁబెట్టుకొని నిర్వికారయోగ సంస్కారంబు లొక్కరీతిగా నిర్వహించు చున్నాఁడు. కటా! యేమి యీయోగనిష్ఠ! యేమి యీధైర్యము! విధినిర్ణయ మిట్టిద? ఈయుగ్రుని ముందరనున్న యీసుందరాంగి ముందర దివిటీక్రింది దీపములువలెఁ గళాహీనములై కనుపట్టుచున్న నాయీసాధనంబులు కార్యసాధనంబులగునా! (పార్వతివంకఁ దేరి పారఁజూచి) ఔరా! నాచురుకుటమ్ములచే ముందుగ నీసుందరి నేలవేసిన? దీని రొద యెక్కుడైనది. ఇదంతయుఁ దప్పుకొని కార్యావసరములలో దొరకొన్నవాఁడు

చీమ చిటుక్కుమనకుండ వచ్చిన కార్యము నెరవేర్చుకొని పోవలెను. గాని నావలెఁ గానిపోని ప్రతిబంధముఁ గ్రొత్తగాఁ దెచ్చిపెట్టుకొనువాఁడు మఱెవ్వఁడు. యీ విళంబముఁ జూడఁగా "నశుభస్యకాలహరణ" మ్మనునట్లు శుభోదర్కంబగు జయము సమకూరునని తోచకున్నది. ఈ యాఁడుదాని నురపించు నుపాయమేమో! (కొంచెమాలోచించి) ఒకట రెంటఁ జెడునది మూఁట మానపడునన్నట్లు శివయోగి హృదయంబునకు గుఱి కుదురునట్లుచోటు గానవచ్చుచున్నది. యింక నాలస్యము చేయరాదు. "నసాహస మనారుహ్య నరోభద్రాణి పశ్యతి" యన్నట్లు శంకాడోల యూగించిన కోలఁది నూగుచునే యుండును. వీరేమి చేయుదురు. దెబ్బమీఁదదెబ్బ. మరికొన్ని పూవుటమ్ముల విసరితినా సొమ్మసిలి యదే యూరకుండును. (కొంచెమాలోచించి)

చ. పని తలపెట్టకుండుటయె పద్ధతి బుద్ధికి నిద్ధరాస్థలిన్
బనితలపెట్టినప్పుఁ డది పాయక యేదెటులైన శ్రద్ధతో
మునుకొని పూర్తిచేయుటయె ముఖ్యము సఖ్యము వేల్పురేనితో
మనకటువంటిదయ్యె ననుమానమికేటికి సాహసించెదన్.

గంతులువేయుచు (శివుని కెదురుగ ముందుకుఁ బోవుట.)

ఉ. సుందరి నొక్కదానినిటఁ జోద్యముగా నెలకొల్పి యోగము
ల్జెందెడు నిందుశేఖరుఁడు చేతికిజిక్కెను చిత్రమయ్యె నా
ముందరనింక నీఁడెటకుఁబోవును బోయినఁ బోవనిత్తునా
కొందలమొందఁజేసి శరకోటులు దూఁటులు వారవేయుదున్.

(మీసము పడివేయుచు)

చ. మునియమశాలి శూలి మనసుం దొరకెం బరికింపకింపు సొం
పౌసరెడి పూవుటంపగుమి పొంకము బింకము గ్రుంకనీక జో
కను గనుమాయు వీనిపయి గాఁటముగా నెద నాఁటవేసి నీ
వ్రణములు మాన్పగౌరి పరిరంభము నోషధిగాగ జేసెదన్.

(మల్ల చఱచుచు)

ఉ. దెబ్బయిదేసుమీ మనసుదీరగ నీరుగ మారుడేయు బ
ల్దెబ్బ మదేభచర్మధరధీరుని భీరునిజేసి వాసిగా
గుబ్బలిరేని కూఁతుఁగని కొంకకఁ రంకెలు వేయజేయునా
దెబ్బతరంబె తప్పకొన దెంపున బొంపిరి వోవుచుండనే.

(కేకలు వేయుచు)

సీ. మామ నీతొలికోల మూపఁడేకరముల
వానిగూండఁగ నీకు నానలేదె !
నీ రెండవది చూడ నీ కెంతొ నూకంత
సార్థకమై నీకు సాయపడునె !
ముక్కచెక్కలు చేసి మూఁడవ బాణంబు
దిగమ్రింగు నీబంటు తెలియలేవె !
ధర్మగుణంబులోఁ దగిలి నీనాల్గవ
సాయకం బదినీరసంబుగాదె !
తే. గీ. తొంటి దటుచేయు నీమామ తుదిదిమాత్ర
ముద్ధరించుట నిత్యమా యోరిమూఢ ?
రూఢసామగ్రి నీ కేది రోషపడక
యరుగుమోఱుఁగవె ? నీయమ్ములైఁదు నైఁదె.

(సొమ్మసిలి పై మఱచి కూర్చుండుట.)

మన్మ — (పండ్లుగొఱుకుచు నట్టహాసంబుతో శిష్యునివంకఁ దిరిగి

చ. హృదయము బ్రద్దలౌనటుల నేసితి బాణము లెన్ని వేసినన్
గదలఁడు, కన్నువిప్పఁడు, ముఖంబునఁ జిత్రకళ మారనీఁడు న
న్నెదుట నెఱుఁగఁడింకఁ బుష్పటీకల కోఁటుల వేఁటలాడినా
కదనఁపు నైపుణి న్మఱలఁ గన్నాడఁ జేసెద సుమాస్త్రకిన్.

(మఱలఁ బుష్పబాణంబులు సంధించివేయును.)

శివుడు — (తనలో) ఇది యేమబ్బా! ఎన్నఁడు నిట్లు లేదే!

క. కుదురుగ సమరెఁడి యోగము
కుదురక మది చెదరినాకుఁ గొఱవడె నకటా!
పదిలముగ మదిని గుదిరిచి
కదలకమది గుదియఁబెడుదుఁ గడుముదమలరన్.

(మఱల యోగముపట్టును.)

మన్మ — (తనలో) కటా! యీ ధూర్జటి మునివధూటుల వెంటఁబడిన నాఁటి వాఁడా? కాఁడు. మాతండ్రిపన్నిన మాయామోహిని వెంటఁదగిలిన నాఁటివాఁడా? కాఁడు. వీని కింతమాత్రము దృఢవైరాగ్యభాగ్యం బెట్లబ్బినదో మన్మథబాణంబు లనఁగా సకల బ్రహ్మాండసమ్మోహనంబులు గావా? రెండుపర్యాయంబులు వీని

చ. భవకలుషంబులెల్ల సుమబాణుని చర్యలె కాని నీనిపై
భవములు కానివేవి సుమబాణుఁ డొకండు నశించెనేని యీ
భువనము నిర్విచారమగు పుష్టినిదుష్టిని జెందుఁగాన నే
నవనవలీలఁ గామదహనం బొనరించెదఁ బుష్టిఁ బెంచెదన్.

(తొంగి చూచి)

మ. ఇదుగో యీపొదరింటనే నిలచినాఁడే మారుఁడీ చోరుఁడి
య్యెడ నాకంటఁబడె న్భవున్మృషతనై యీ ఫాలనేత్రాగ్నిలో
విడువంబోలఁడు భస్మరాశియయి పృథ్వింగూలనున్నాఁడు నే
డిదుగో నిప్పులకన్ను నిప్పుఁడె మనంబింపారఁగా విప్పెదన్.

(శివుఁడు రౌద్రంబభినయించుచు మన్మథుఁడున్నదిక్కు మొగంబై తనఫాల నేత్రంబుఁ దెఱచి చూఁడగా నగ్నిజ్వాలలు వెడలి మన్మథుని చుట్టును గవిసి కవిసి క్రమ్ముట)

మన్మ—ఆహా! యెవరు చెప్పినను వినక మూర్ఖుండనై నా చేసికొనిన దుష్కృతంబు "కర్మకస్యకృతమత్రభుంక్తే" యనునట్లిపుడే నాకనుభవంబునకు వచ్చినది. హా! తప్పుకొనుటకు మార్గమేది? ఏమిచేయుదు! నగ్నిజ్వాలలు చుటును గ్రమ్ముకొన్నవి. (అగ్నిజ్వాలల మధ్యనుండి చేఁతులు మోడ్చి) హా! హా! పరమేశ్వరా!

మహాస్రగ్ధర

మృగభృద్రేఖాంక ఫాలో న్మిషదతుల ధృగుస్సీమల దుద్వేలధామ
స్థగితాఖీలాగ్నికీలల్ ధగధగనుచున్ ధాటిపెంపారగాపై
మిగులన్ ఛట్టించి వేగ్రమ్మినవిట నకటా మేను చుట్టంబొలె నయ్యో
జగతిన్ లేనట్టి మంటల్ ఛటఛటనునె హా చచ్చితిన్ భస్మమైతిన్.

(మన్మథుఁడు పొదతోఁగూడ భస్మమగుట. అందఱు నాశ్చర్యముతోఁ జూచుచుండుట.)

(శివుఁడు తీవ్రగమనముగా నిష్క్రమించును.)

పార్వతి—(వక్షంబున హస్తంబు నప్పళించుకొనుచు) యిమ్మహాదేవునకు నింత మహాకోపం బున్నదని యెఱుంగక పోతిమిగదె! మరల వచ్చునో రాఁడో!

నవమాలిక—ఏమీ! యెఱుఁగనందుకు మనమే చెడిపోతిమి. చెఱుపకురా చెడెద వను కింవదంతి యిదేసుమీ!

పార్వతి—(నవ్వి) తుటతుద కిక్కడ మనము ముగ్గురమే మిగిలినారము.

కలవాణి—ఇక మృగాంకకళాధరుఁడుండు వచ్చుననుకొంటివా! వచ్చినను వారికి మునుపటి నిష్కళంక శాంతస్వరూపము మరల వచ్చుననుకొంటివా!

పార్వతి—చెలీ! దేవదేవుం డట్టివంటి యపరాధిజనంబులయెడ నేమోకాని మనవంటి నిరపరాధ సేవాపరతంత్రులయందు సుప్రసన్నాత్ముండుగాఁడే.

(మైనాకుఁడు ప్రవేశించుట)

మైనాకుడు—సోదరీ! నాచిన్ని ముద్దులతల్లీ! యీకామప్రళయములో నిన్నింత మాత్రము మఱలఁ గన్గొంచు ననుకొనలేతిని సుమా!

పార్వతి—అన్నా! మన తలిదండ్రులు సుఖంబుండిరా. ఇక్కడి సమాచార మప్పుడే యక్కడి కెట్టువచ్చెను.

మైనా—దాఁగునా! యీ కాముఁడు పురందరుని ప్రోత్సాహంబున మృత్యుంజయుని తపోభంగంబున కాయత్తపడినప్పుడే లోకమెల్ల మ్రోతమ్రోగినది. నిన్ను గురించి మన తల్లిదండ్రులు కలవరించుచున్నారు. వారి పనుపున నిన్నుఁ దోడ్కొనిపోవ నరుదెంచితి.

పార్వతి—సోదరా! ఇన్నిదినంబులనుండియుఁ బరిసరంబునఁ బరిచర్యసేయుచుం దుదను దేవదేవుని యనుజ్ఞగొనక పోరాదు.

మైనా—బాలా! బాల్యవశంబున నీకు సందర్భంబులన్నియు బాగఁ బొడగట్టవు సుమా! ఇది కామప్రళయము. కామారిధ్యానం బింతలో మనకు దొరకదు.

(రతి పొదచాటునుండి రోదనముచేయుచు తలవిరబోసుకొని హాహాకారముతో మన్మథుని భస్మరాశి యొద్దకుఁ జేరుట.)

రతి—

శా. హా! పంచాశుగ హా! మనోహరగుణా! హా నాథ! హా! మన్మథా!
హా! పద్మాక్షతనూజ! హా! మధుసఖా! హా! యిక్షుబాణాసనా!
హా! పుష్పంధయ శింజినీక యహహా! హా! మోహనాకార ము
న్నే పాపంబుల జేసినానో యిపు డేనిట్లైతి హా! దైవమా!

మైనా—సోదరీ! యీ కాంత రతికాంత. మన్మథుని కాంత. మన మిక్కడ నీవిడకంబు బడవలదు సుమా! యీ రతి మఱలిపోవుదాక మన మల్లక్కడ నుండుదము.

రతి—హా! ప్రాణేశ్వరా! నాకూడిన హితోపదేశంబు లన్నియు చెవులకు విషప్రయోగంబులయ్యెనే? అయ్యయ్యో! యేవియోగంబున మతిలేకయున్న మిన్నసిగ జోగి వట్టియోగంబు సంగతపఱచి యిమ్ముక్కంటి కంటిమంటల నంటిపోతివా! నాథా! యే నేమిపాపంబు చేసితిని. ఈ దైన్యం బెట్లు సహింతును. లక్ష్మీపుత్రా! యింక నాకు దిక్కెవరు. హా! మనోవల్లభా! యమృతకిరణుని తనూభవను గాన నాకు చావులేదయ్యె. లేకున్న నీదుఃఖానలంబు నాకెన్నవారదవ్వదు. ఏ పెద్దతండ్రి జ్ఞాతిశత్రుత్వ మివ్విధంబున దీర్చుకొనియెనో నా! ఏడీ నిన్ను నీకార్యమునకు బురికొల్పి పంపినవాడేడీ? రాఁడేమి? యడ్డపడఁడేమి? కట్టా! దైవమా! దైవమేమి జేసె! (కొంచె మాలోచించి)

చ. పడతికి నెల్లభాగ్యములు భర్తను బట్టియె తేజరిల్లు నె
ప్పుడు పతిలేకపోవు నవి బూదినిబోసిన నేతిచాడ్పు న
ప్పుడె కడుగల్లలౌ నకట! భూమికి లేక కొలంకబోలు నీ
చెడుబ్రతు కేల నాకుఁ బతిచేరువ చేరువ ముక్తి కయ్యయో!

లోకము మునిగినట్లున్నది. శోకంబు పట్టరాదు నుపాయంబేమి. చెప్పిచెప్పి విసికి సొమ్మసిలి నాపడియున్న యాక్షణములోనే నిన్ను మృత్యువు ద్రోసికొనిపోయె. హా! సుందరాకార! నీగుఱ్ఱంబైన సకిలించలేదేమి? నీపరివారంబుల వీరాలాపంబు లేమాయె? నీ రథసంచారంబించుకైన గనరాదు. నీ ప్రాణమిత్రుని సుమనో విజృంభణంబులు శూన్యంబులయ్యె. నౌరా! బాగుగ నున్నవేళ నందఱు బాగుగనే చుట్టుకొందురు. (కొంచెము విమర్శించి కోపముతో) ఓగు కలుగునప్పు డందఱు ముందుగనే యెఱుకుదురు. యెవని కర్మము వాఁడే యనుభవించి తీరవలయును. పరమేశ్వరా! సతి నింతయుసురు పెట్టెదవా! సర్వజ్ఞుడవు కావా! శిష్టాసక్తులు ధర్మంబు లిటు లున్నవా! యపరాధంబు జేసినవాఁడేయగును. దానికిం దగిన దండంబు విధించక భీరుడై చాటున దాగియున్నవానిని నిలువున దగులంబెట్టి భస్మంబు జేసెదవా! సర్వలోకంబులు నేలు ధర్మమూర్తివి కావా! నీకు పైశిక్షకుఁడు లేడనుకొంటివా! సర్వాధికారి తనచేసిన యపరాధంబునకు దండించు తనపైవాఁడు లేడనుకొనరాదు. తనక్రింది వారిలో సత్యవాక్యుడు ధర్మజ్ఞుఁ డెవ్వఁడో యొక్కఁడే యాయా సమయంబులలో నెదిరించి ప్రతిబంధంబు విధించకపోడు. హా! ఈశ్వరా! నాప్రాణేశుం డిప్పుడు నీయెడల జేసిన యపరాధం బింతియకా! నిన్నుజేసిన సమాధియోగంబునకు భంగమా! దానికా యీశిక్ష! ఆహాహా! యేమి న్యాయము నీవె యిట్లు న్యాయము దప్పినచో లోక మెట్లు నడచు? లోకము నిప్పుడు నిష్కారణముగా జేసెదవా! బ్రహ్మసృష్టి నిర్వీర్యమైపోవు సమయమా! నామంగళసూత్రంబే బాజూచి నిశాంతము నాకేమి? నాపాతివ్రత్యంబు నీకు జూపించెద నిదిగో. (పరిక్రమించి)

శా. ధర్మంబు న్ననుపెట్టకెవ్వఁడు మదాత్మస్వామి భస్మంబుగా
నిర్మించె న్నిజఫాలనేత్ర గతవహ్నిజ్వాలచే నట్టి యా
ధర్మాపేతుని ధర్మరాజహరునిం ధర్మ్యంబుగా నిప్పుడే
నిర్మూలం బొనరింతు నా మహిమచే నిర్ధూమధామంబుగాన్.

పంచమహాభూతంబులారా! రవీందుతారాగ్రహంబులారా! చూడుడు. నే నల్లక్కడ గంగాతీరంబున శాపార్ఘ్యంబొసంగెద. (రతి రౌద్రాకారంబుతో వెడలిపోవును)

పార్వతి—(పరిక్రమించి) సోదరా! యిందిరాసోదరుని పుత్రికామణి శిరోమణి స్థానంబున నిజజనకుని ధరించువాఁ డనియైన దాల్మిఁజెందక శోక మోహావేశంబులతో నీశ్వరనిర్మూలంబునకు బ్రతినపట్టి చనినది యేమౌనోకదా!

మైనా—సోదరీ! పతివ్రతాలక్షణ మట్టిది. యిట్టి సమయంబున నపేక్షించదగు నది మఱొండు గలదే.

కలవాణి—స్త్రీజాతి కత్తిల్లు లేక పుట్టినిల్లుగదా! యీ రతి తుదకుఁ బుట్టినిల్లుఁగూడఁ దుడిచిపెట్టుకొనుటకే.

నవమా—పార్వతీ! కలవాణిమాట కేమి? యొరులవిషయమై యెంతైన జెప్ప వచ్చును. జన్మాంతదుఃఖ మింతకంటె మఱేమున్నది? సర్వం బీశ్వరాధీనమే.

పార్వతి—(భయముతో) సోదరీ! మన తల్లిదండ్రుల సంకల్పము వికల్పమగు నట్లున్నది.

మైనా—సోదరీ! మనవలనగాదగిన దేమున్నది? నవమాలిక చెప్పినదే సత్యము.

(తెఱలో)

ఉ. నిక్కము నా నుడిన్వినుఁడు నేనె పతివ్రతనైతినేని నా
చక్కెరవింటిజోదు నిటఁ జంపుట ధర్మము దప్పెనేని న
న్నక్కలికంటివే ల్వాక నిమేషములో

(అందఱు వినుట)

పార్వతి—పతివ్రతాశాపాక్షరంబు లేమని సుడివెట్టునో కదా!

మఱలఁ దెఱలో

వలదోలతాంగి యీ

ప్రక్కను వీను లొగ్గి విను భద్రము నీ కెఱుగింపవచ్చితిన్.

(అందఱువినుట)

మైనా—అదిగో పార్వతీ! వింటివా! రతియందు నీశ్వరానుగ్రహంబు ప్రసరించుచున్నది.

(మఱలఁ దెఱలో)

చ. పరమపతివ్రతామణివి భర్తృవియోగము లేదు నీకు నీ
వరుఁడు సురూపుఁడౌచు జెలువంబుగ గన్వడు నెప్పటట్ల త
క్కొరుల కనంగుడౌచు హృదయోద్భవుడై జనరంజన క్రియా
సరసయశో విహారముల జక్కగ దాజరియించు నెల్లెడన్.

(అందఱు వినుట)

పార్వతి—(సంతోషముతో) ఆహాహా! రతీకాంత దీర్ఘసౌమంగళ్య మేమని చెప్పుదు! నీశ్వరకరుణ యాకాశవాణీరూపమున బైలుపడినది.

(మజిల దెఱలో)

నిరంతర నిదాఘాత పత్పృషితునకు నమృతవర్షంబునుంబోలె నృణబాధాపీడితాత్మునకు మహాదాతక్రైవడి దరిద్రునకు బెన్నిధివలె సముద్రమధ్య జంఝామారుత పరిభ్రామ్యమాణనౌకారూఢులకు శుభ్రశ్రీంబు వడువునఁ బతిమరణ దుఃఖాక్రాంతనగు నాకర్ణ పథంబులకు బరమానందకరంబులగు వాక్యంబులు గోచరంబు లగుచున్నవి! ఏమి! నాపుణ్యము! మఱెవ్వరునిక్కడలేరే! ఆ! ఆకాశవాణి కాబోలు! (కొంచె మూరకొని) నిజమే! ఓతల్లీ! నీవ యాపూర్ణవాక్యామృత మింకొక్కసారి నాశ్రవణ మార్గంబుల గురియింపుము.

(అందఱు వినుట)

కలవా—పార్వతీ! మనదేవునకు గోపప్రసాదములు రెండును నొక్కతీరువలె నున్నవి సుమా!

పార్వతి—కావుననే రతికోపము నిమిషములో మార్చివేసినాఁడు. దీనదయాళుఁడుగాడే. రతి యాకాశవాణియిచ్చిన యావరమును మఱల శ్రవణానందముచేసికొన వేడికొనుచున్నది.

(మఱల దెఱలో)

(ఆ పద్యమునే చదువుట) "పరమపతివ్రతా......జరియింపుమనెల్లెడన్."

నవమా—ఇప్పుడెల్లరకు స్పష్టపడినది.

(మఱల దెఱలో)

రతి—ఆహాహా! నాదుఃఖనివారణ మైనది. ప్రాణేశ్వరా!

(అందఱు వినుట)

మైనా—పార్వతీ! రతీకాంత నిజకాంత. పునర్జీవనకందళితకుతూహలయై యీ త్రోవనే వచ్చుచున్నట్లున్నయది. తొంటియట్ల మన మల్లక్కడఁ జేరుదుము. (అందఱు చెప్పటట్ల యొకప్రక్క నొదుగుట.)

(రతిప్రవేశము)

(రతి మన్మథుఁడు తన యెదుటనున్నట్లభినయించుచు)

ధృవకోకిలావృత్తము.

మదనసుందర మందహాస సమంచితానన దేవనా
హృదయవల్లభనన్ను గౌగిట నింపు సొంపుగ నింపుమా
ముదముతో మనమింక నింటికిఁ బోదమా మఱివాదమా
మృదుమనోహర మంజుభాషణ మీనకేతన పోదమా.

(రతి సంతోషముతో నిజనాథుని కరంబులు పట్టికొని తీసికొని పోయినట్లభినయించుచు నిష్క్రమించును)

పార్వతి—(పరిక్రమించి చెలులతో) చెలులారా!

మ. మనపైనింతకు నింపుచూడునకుఁ బ్రేమం బించు కంతైన వ
చ్చినయట్లేమియుగానరాదు రతిపై చిత్రంబుగా బాపజ
య్యన నయ్యాశ్రితవాంచితప్రదుని సద్యఃప్రీతుఁగాఁ జేసికొం
దు నమందైకతపంబునం బితృవచఃస్తుష్టప్రకృష్టాత్మనై.

(అందఱు నిష్క్రమింతురు.)

గద్య: ఇది శ్రీ తర్కవేదాంతాది సకలతంత్రస్వతంత్ర శ్రీమ దనుగమభట్టాచార్యాది
ప్రసిద్ధబిరుదాంకిత శ్రీమ దభినవగౌతమావతార శ్రీ కురుగంటి వేంకటరామశాస్త్రి
కంఠీరవ పౌత్ర శ్రీ కురుగంట్యప్పయ్యశాస్త్రిపుత్ర శ్రీ వెంకమాంబికా సతీతిలక
గర్భశుక్తి ముక్తాయమాన శ్రీ హరితసగోత్రపవిత్ర శ్రీమ దుభయభాషా
భూషాయమాన లలిత కవితాధారా ధారాళ యశోవిశాల సహజపాండిత్య
సాహిత్య శ్రీ బాలాత్రిపురసుందరీవరప్రసన్న బుధజనవిధేయ శ్రీ కురు
గంటి సూర్యనారాయణశాస్త్రి నామధేయ ప్రణీతంబులగు
సత్కృతులలో నగ్రగణ్యంబగు కుమారసంభవ నాటకంబునఁ
తృతీయాంకము సమగ్రము. శ్రీ





# కుమారసంభవము

## చతుర్థాఙ్కము

### ప్రథమ రంగము

### కైలాసోద్యానము

ప్రవేశము—శివుడు

శివు—(విచారముతో) తొలుకొల్త నెవ్వరికిని దోచదుకదా! (తలయూచి) అరే! అరే! చేతఁజిక్కినదానినే పోనిచ్చితిని. చిగురాఁకుజోదు మనకుపకారియని గ్రహించలేకపోతిని. మునిమాటకై యోగంబుదొరకొంటి నరకంటిచూడ్కి నున్ననాకు నత్యంతకృత్యము లంతంబునొందినను ఘటితుడను నమ్మొట్టమొదటిది పొడమూపినట్లుగనే యారెండవదిగూడ ముంగువచ్చిన చెవులకంటె వెనుకవచ్చిన కొమ్ములు వాడియను నట్లు ముక్కునకుఁబడి యుక్కునవానిం దెగటార్చె. కటకటా! (కొంచెమూలోచించి) దీనిపని యింతటితోనే ముగియుట లోకాచారము.

ఉ. కాముని గూపిమాపినను గాముని దెబ్బ యిదేమి సేయుదుం
గామినిచేతనే నయముగావలె నామదిగాయ మకటా
కామిని లేచిపోయె మఱి కావలెనన్న నదెట్లువచ్చు నా
కామముదీరు మార్గ మెటుగాంతును వంత మరింత యయ్యెడిన్.

చ. నను గనులారఁజూచుచు ఘనంబుగఁ జెంతఁ జరించువేళ నా
మనసును దాని కింతయిన మచ్చిక హెచ్చఁగ నందనీకపో
తిని లలితాంగియై హొయలతీరును జక్కఁదనాలబారు నా
కనులకుఁ దట్టుచున్నయది గౌరినిగూడక యేను నిల్తునే.

(భృంగి ప్రవేశము)

భృంగి—(అంగవికారములఁ జూపుచు) ఆర్యా! మీ రిట్లున్నఁడును లేని పరితాపమును బొందుచుంటిరేమి!

శివు—(నవ్వి) నీ వెఱుఁగన దేమియున్నది.

భృంగి—(నవ్వి) దేవరచేసిన ఘనకార్యము! నేనకాదు లోకమంతయును.

శివు—అబ్బబ్బా! ఆ మాటమానుము. భృంగీ! యే నటువంటి వాలుగంటి నంటుకొనక కంటనైనఁ దిన్నఁగ గనుఁగొనక యెడబాసి తడబడుచుంటి. నిటువెడలి యొడలుసడల వెడవింటి పసలు గడలుకొన సహించుచుంటిని.

భృంగి—ఆ! ఆ! మీరు జితేంద్రియులుగారా!

శివు—అవును దాని కదే! దీని కిదే! ఇంతకాలంబునుండియు నీవు నాతోడఁ గూడనుంటివి. నా భావ మేమి గనిపెట్టితివి.

భృంగి—గనిపెట్టకేమి! ఊరక పరాకై చిరాకైతిరి.

శివు—అంతేయైనది. రాకేందుముఖికొరకేగదా! మిహికాగిరికి నారాక! అట్టి నా రాక నిరాకరించక గట్టుదొరయునట్టి నా మత మెఱిఁగియే కాఁబోలుఁ దనపట్టి నుపచారంబు నెపంబున నాకడను ననిచె. అదే యదనుచేసుకొని యా జవరాలిని వశురాలినిగఁ జేసికొన నేరకపోతిని గదా!

భృంగి—బాగు బాగు! నా మాటలు మీ రేలవింటురు. మీ రింతమాత్రము నా కప్పు డందనిచ్చినచో నప్పుడె మీ యిద్దఱిని నొక్కటిగఁ జేయకుందునా! యింతకు గానికాలము. సమయానకు బుద్ధి పెడతలఁబెట్టును. కటకటా! మీ సర్వజ్ఞత్వ మిమ్మంతవట్టు దెచ్చినది.

శివు—అవునురా! ముందుగతి యేమి?

భృంగి—దేవా! నాఁడు దాని నాఁడుదానిఁగానైన నెఱింగితిరా లేదా!

శివు—ఛీ! ఛీ! అ దేమిరా!

భృంగి—మనసు సిగ్గు. లోన నెట్లున్నను పైకి సమాధిగదా!

శివు—అవును కంటికి గనుపడకుండునా.

భృంగి—తెలసె, తెలసె. అప్పటి యరగంటిచూడ్కి యిందుకే యుపయోగించి యుండును. కాని మనసేమయిపోయె.

శివు—ఇస్సీ! అదేవచ్చినది. (పరిక్రమించి స్వగతము.)

చ. కరమరగంటదీగయని కంటినిగాని లతాంగిచూపు సే
నరయుచుఁగన్నులారఁ గననైతిర [illegible]తినిబల్కరించనై
తిర చెయిసోఁక లేయలదుఁదీఁగయటంచును నుంటిఁగాని చె
చ్చెరనదె సందుచేసికొని చేర్పకపోతిర నాఁటిఁగౌగిటన్.

చ. పలుకునెపం గడుం జిలుకపల్కులటంచునె యుంటిఁగాని నేఁ
బొలుపుగ దానితోడ నెడముచ్చటలాడఁ దలంచనైతిబల్

బులుపున నిష్టమేమియన మోమటుత్రిప్పితిఁగాని పొందియా
పొలఁతుక చెయ్వులందు సరిపుచ్చకపోతిని మోసపోయితిన్.

(ప్రకాశముగా)

చ. మదిబిగియంగఁబట్టి చెడుమానసముచేఁజెడిపోతి నయ్యయో
వదలవు వట్టియాసలివి వారిజనేత్రను బొందుభాగ్యమె
య్యది యిఁక నాకు వెఱ్ఱిజపమప్పుడయూడెను పాపమేమియా
సుదతిని జూడకే యిటుల సొక్కుచుసోలుచు నెట్టులుండుదున్.

భృంగి— ఉత్సాహావృత్తము

ఏమిసేతు విప్రునీకు హెచ్చుఁదల తలంటెఁగా
సామిచెలియ తెలియరామి సాగుచుంటివొంటిగా
గాము నేలఁబాము నేల గాముచాల దేమొకో
కాములీలఁ దూలఁగాము గామివగుట నీమమా.

దేవా! మీకు రుచించినను రుచింపకపోయినను నేనొకవాక్యము చెప్పఁదలఁచినాను విను.

శివు—ఏమది!

భృంగి—

క. విడచిన సంసారముపై
నడనడ విభ్రాంతిపడక నమ్మినతపముం
గడపుము నడుపుము మఱియొక
కడనైనను నచ్చుబాటు గని జితకామా.

శివు—యీ వలపు మఱలం దపముఁ జొఱనిచ్చునా!

భృంగి—

గీ. బెట్టు వగవంగనేల యబ్బెట్టుగాదె
బెట్టుగావలె మీవంటిదిట్టరులకు
గట్టుదొరనీకుఁ దనపట్టి గట్టినాను
గట్టిపెట్టునె యీమాటగట్టిపెట్టు.

శివు—కుమారకా! విను. సుందరి నాకుఁ గన్నులఁ గట్టినట్లున్నది.

చ. వదలితి నన్నియుం జపతపంబులతోఁబనిలేదు నాకు నా
సుదతిని బోయిచూచుటయె చోద్యముచూచితినేని భృంగి నా

మదికి సమస్తముంగలదు మానకమానిని యొద్దకిప్పుడే
కదలిచనం దలంచితిని గాదనకుంముము చూచివచ్చెదన్.

భృంగి—అబ్బా! ఎంత పొసగినది. అబ్బాలచంద్రాలిక యబ్బాల ముద్దరాలనుకొంటి. అది మహాచండిక. నాఁడే వెడలఁగొట్టిన నింత పొసఁగదుగదా! కాళికా శక్తికాఁబోలు. దేవరా! కానున్న వచ్చుట నున్నది ఇచ్చటి కేల పొడమాపె. గంగాధరా! మీ రేమనిన నన్నవారేకాని మిమ్ములను బట్టనున్నది. అంతకంతకు మీ మేను సగము చేయునేమో!

శివు—

తే. గీ. నెలఁతఁజూడక యే నొక్క-నిమిషమైన
నిలువఁజాలను నా నేర్పుబలిమిచేత
నిపుడ మెఱుకతవేషంబు నీఁటుగులుక
దాల్చిపోయెద నింపుగ దానిఁజూడ.

భృంగి—(గిఱుక్కు-నఁ దిరిగి గంతువేసి స్వగతము) ఇంక లేనిదేమున్నది. ఇంకఁ గావలసినదేమున్నది. (ప్రకాశముగా) స్వామీ! నేనుగూడ.

శివు—

చ. వలదుర నీవురావలదు వచ్చితివా యట వెత్తిమొత్తిచే
ష్టలు వెనుదీయ కొక్కొ-కటి సల్పకమానవు కార్యహాని కా

భృంగి—

కలిగిన వెత్తిమొత్తి మనకప్పటి కిప్పటికొక్క-తీరె కా
గలదిఁకగాకమానునె చకాపికచూపక మాననేర్చునే.

శివు—సరే కానిమ్ము. వేగరమ్ము. మనమిద్దఱ మెఱుకతవేషంబులతోఁ బోవుదము.

(ఇద్దఱు నిష్క్రమించుదురు)

## ద్వితీయ రంగము

## పార్వతి లీలాగృహము

ప్రవేశము :—పార్వతియు; కలవాణియు.

పార్వతి—చెలియా! నాఁటనుండియు మనకు శివుని యుపచారంబులతోఁ బ్రొద్దు పోవుచుండెగదా! యిపు డెట్లునుం బ్రొద్దుపోవకున్నయది. మఱల నీశ్వరసేవ యేనాఁటికైన దొరకునా!

కలవాణి—తల్లీ! యింత కోపధారియొద్ద మన మెట్లు నిలువగలము! బ్రతికి యుండిన బలుసాఁకు దిని బ్రతుకవచ్చు. నీ కియ్యడియాసలేలనే!

పార్వతి—చెలీ! అట్లనకుము. మన కెన్నఁటికి నన్నగేంద్రకార్ముకుని సేవల యందే వ్యాసంగము కావలెను.

కలవాణి—ఔనుగాని; గిరికుమారీ! యా విరూపలోచనుని చూపుబారు నన తూఁపు దొరబిడ్డమీఁదకుఁ బాఱఁగాని ననయూఁపు దొరబిడ్డవగు నీమీఁదకుఁ బాఱినచో నేమగుదువో!

పార్వతి—మనదేవు డంత యవ్యక్తుండే? సర్వజ్ఞునకు మన భక్తితాత్పర్యం బెఱుకపడదే? దేశకాలములతారతమ్యం బెవరికి సవరింపఁదరము.

కలవాణి—సరికాని దేవీ! యాకొలచినన్నాళ్ళలో నించుకైన వానిప్రేమ బొడఁగట్టెనా!

పార్వతి—కలవాణీ! వానిప్రేమంబు పైకిఁ గనబడనిప్రేమ గాదే!

కలవాణి—కనఁబడనిప్రేమంబుగనుకనే శ్రీకుమారునిమీఁద నట్లు పాఱినది.

పార్వతి—చెలీ! కందర్పుఁడు మహాదర్పమున సమయాసమయంబుల గుర్తెఱుం గక యసమదర్శనుం జిక్కువరచుటంజేసి యట్లగుట యద్భుతంబుగాదు.

కలవాణి—ఏమి లాభము! నీ తపని ప్రయాసఫలము. కంటికి గోచరుండగునా? యున్నతావైనఁ దెలియఁబడునా! ప్రేమించుమని మనసులోఁ బాలు ద్రావుచున్నావు.

పార్వతి—సఖీ! నాచేసిన శివపూజోపచారఫల మూరకపోదని నానమ్మకము.

(నవమాలిక ప్రవేశించుట)

నవ—తల్లీ! యూరకవిచారించిన లాభ మేమి? యొక యెఱుకత వీధిని వచ్చుచున్నయది. దానింబిలచి శకున మడిగదేని భావిఫలము చెప్పునట్లున్నది.

పార్వతి—దాని నమ్మక మేలా!

కలవాణి—దాని మొగముఁజూచినఁ దేటతెల్ల మగును.

నవ—మన కట్టిసంశయ మక్కఱలేదు. మన దేశ మేకాదు. చాలా కనిపెట్టితిని.

(తెఱలో)

చ. కలుగును నీకు భాగ్యములు గల్లలుగావు మనోభిలాషము
ల్ఫలములు నీకునందెడిని బద్మముఖీ సుముఖీలలామ నా
పలుకులు కల్లకీవెలమిఁబట్టగు బిచ్చముఁదెచ్చిపెట్టు ని
ర్మలుఁడు మహాబలుండగు కుమారుఁడు శూరుఁడునీకుఁబుట్టెడున్.

(అందఱును నాశ్చర్యముతోఁ జూచుట)

(మఱలఁ దెరలో)

అవ్వో, యవ్వా! మా రాజవే యవ్వా! బంగారుతల్లివే యవ్వా! కొడుకుల కోటవే యవ్వా! చుట్టాలచోఁటువే యవ్వా! పాఁడిపంటలు బలిసినే యవ్వా! బొట్టుకుట్టులబోఁటివే యవ్వా! బందుగులపాలిఁటి పంటవే యవ్వా! అమ్మ! మా యమ్మ! మా యమ్మ! మా యమ్మ! జగదంబ, జగదంబ, జగదంబ, జగదంబవే, యవ్వా! కమ్మని నీ బంగారుగాలికి మొక్కుతానే యవ్వా! చోఁడిగాఁడు నామీద కన్న నీమీఁద జాల బత్తితో వచ్చుచున్నాఁడే! యవ్వా! నీ రొట్టె నేతిలోఁ బడ నుండాది నీకార్యం గట్టెక్కనుండాది.

పార్వతి—నవమాలికా! శకునాలపెట్టవలె నయ్యెఱుకలసాని నీ యడుగులలో నడుగు విడుచుచునె వచ్చుచున్నది. సమయ మిది. దీని నొక కొన్నిమాఁట లడుగుదము. లోనికిం గొనిరమ్ము.

(నవమాలిక పోయి దానింగొనివచ్చుట)

పార్వ—(నవ్వుచు) ఎఱుకతా! సోది జెప్పగలవా!

ఎఱు—అవ్వా! కనుపడ్డదల్లా సోది చెపుతా దంటమ్మా! యిప్పుడిప్పుడు సెప్ప కుంటుండాను.

పార్వతి— ఎవతెనీకు సోదినేర్పినది? యిప్పు డెక్కడనున్న దది?

ఎఱు—అల్లదిగో ఆఁడ ఆయింటి గుమ్మముకాఁడ.

పార్వ—నీవు వేరే తిరుగుచున్నావేమి.

ఎఱు—మాసింగఁడు నన్ను నాసవతులను వల్లక యిడిచేసి కొండారి నిన్నదాని మీద గన్నేసి యెతకు లాఁడు సుండాఁడు. ఆణ్ణి యెతక్కుంటుండాను. సోది కావలె నంతావా! యిప్పుడు సెప్పిన మాకొండసింగిని పిలసడుగుము. బలెలావుగ బత్తెచ్చ ముగా దొడ్డసోఁది సెప్పుతాది.

పార్వతి—(కలవాణితో) సఖీ! నీవేగి దానిని దోడ్కొనిరమ్ము.

(కలవాణిపోయి దానిని గొనివచ్చుట)

నవమాలిక—(పార్వతితో) దేవీ! చూడుమాడు! దీనిముఖకళలే ప్రత్యక్ష ముగాఁ జెప్పునదియని సూచించుచున్నది.

పార్వ—సత్యము. మీరు నోరాడించకుఁడు. నాహృదయగతమెట్లు చెప్పునో (పాఱజూచి) విదేశపదేసుమా!

(ఎఱుకతతో)

క. తొయ్యాలి నీపేరెయ్యది
నెయ్యము గనుపట్టె నాకు నీపైనెంతో
చయ్యన రారమ్మి య్యెడఁ
దియ్యని నీనోఁటినుడులు దెల్పుమిటారీ.

ఎఱు—నాపేరు కొండసింగి. నే నాడాడ సోదిచెప్పుకుంటాను. నన్ను మీరు సూడలేదే. అవ్వోయవ్వ. యీనాడు నాసోది గూర యాదిలచ్చుమమ్మకుఁ బత్తెచ్చను గాదంటే! బతే సోట్ల బవ్వగూనాలుపట్టినాను. నీకేమైన సోఁదికావలెనంటే.

పార్వ—కొండసింగీ! ఒకటి యడిగినచో బదిచెప్పునట్లున్నావే. యున్నదున్నట్లు కావలెను.

ఎఱు—ఓలనాసింగి. నీయొద్ద కొత్తొచ్చిందే, పద్దాలుగు లోకాలు గెలిచొచ్చాను. ఓ—పడడిగి తేనోఁడే అనాటెంటే మాబలేదానవే. చెప్పితే గయించుకోలేవే! యీడాడ సింగులంటి దాన ననుకుంతావా! నాసెత్తి చెప్పుతా యినుకుంతావా! కూకుండు. కూకుండు. (కూర్చుని) ఇదో యీటుంగుబుఱ్ఱ నాకాయిశ్శకమ్మ మెచ్చిచ్చిందే గాదంటే! సింగిసింగోసింగని నాసెకునాలకుఁ గులికి నాకే గవ్వల గుత్తుల పేర్లు సముద్దునిల్లోలో గంగమ్మించ్చింది. కాదంటే! యవ్వోయవ్వ! బుఱ్ఱ! బుఱ్ఱ! బుఱ్ఱ! యిదోబుఱ్ఱ! యేసాదనుకొంటావో! బమ్మన్న రమ్మన్నవోయి కమ్మన్న కమ్మని పసనలెన్నో యిప్పిచెప్పగొప్పగా సుగించి సంకపట్టించిన బుఱ్ఱ! యిదోసింగి బెద్దాము బెద్దాము. చూడుముద్దాదంకే కొండారబోటే పాటాడికిఁ బుఱ్ఱెడుబుద్దులన్నట్లు పొట్టిదే కాని దిబ్బెము చూపఁగానే కూకున్నవారి తౌనాలు గురెత్తి చూపుతాదంటే! నమ్మవంటే! సూఁటిగ యినిపిద్దానురావే (పార్వతి దాని కెదురుగ గూర్చుండుట.)

పార్వతి—నీకిప్పు డేమి కావలెఁ?

కొండసింగి—అవ్వో చాటెఁడు చాటెడు ముత్యాలు దెచ్చి పట్టుకొమ్మా కొమ్మా. (చెలు లట్లుచేయఁగఁ బార్వతి గుప్పెడు ముత్యాలు పట్టుకొనును)

కొండ—నాకట్టము లేమంటావే.

పార్వతి—(నవ్వి)

ఉ. కట్టము లీకపోవుదున గట్టిగ నే ననుకొన్నమాట నీ
కట్టె మనంబులోన బొడగట్టునొకట్టదొ కట్టెనేని నీ
గట్టితనంబు జూపి యొడిగట్టుము కట్టము లిచ్చినట్టెయిం
దొట్టుసుమీ సమీకరణ ముట్టిపడ న్వినుపింపు మింపుగన్.

కొండ—సరే! సరే! (బుఱ్ఱమీటుచు) (కన్నులుమూయుచు దెఱచుచు)

ఎఱుకలకాంభోజిరాంగం. ద్విపద.

మాసామి రామయ్య యీసాలసామి
నీ సేవ లేఁజేతు నిత్తెమ్ము నమ్మి
దామోదరయ్యయో దైవాలతండ్రి
నామాల నల్లయ్య నాచల్లనయ్య

యేదాలుబమ్మకు నిచ్చినయయ్య
మాదవరాయుఁడే మమ్మేలుమయ్య
బూదార యేసంబు బొందినావయ్య
యాదినారాయుఁడా యకిలంబునీవ
బమ్మాండ నాయకా బమ్మంబు నీవ
సిమ్మాద్దిరప్పన్న సీరంగరంగా
యాకెనపలి సోబనాచలసామి
నీకుమ్రొక్కితినయ్య సివదిక్కయ్య
వడిగాచు మోకంచి వరదరాజయ్య
యడవాంజనేలయ్య యందిరావయ్య
యినవయ్యనూజేటి యెంకటేశయ్య
మనవిగై కొనుమయ్య మాపాలిటయ్య
నూజేటి పురపాల రాజగోపాల
తేజుఁగా నాకన్ని తెలుపరావయ్య
బెజవాడ లోనున్న పెద్ద కనకమ్మ
యుజనీమహాంకాళి యోభద్రకాళి
నికితేసి నారాయణీ యాదిశక్తి
పకటించి పలుకవే బగవంతురాల
కొన్నేటి పెద్దమ్మ కోటమైసమ్మ
కొల్లాపురాదాపు గొనులచ్చుమమ్మ
నీడక మారిప్రు వెలుపొప్పగాను
తోఁడుజోడై మాకుఁ దోఁడుగావలయు
నోబమ్మయిల్లాల నోసరస్సతిరో
యో భారతీ మాతయో పలుకుమాత
పలుసగా నాజింమ్మ వదలకయుండి
తెలుగులన్నియునీవు తెలియరానిమ్మ
యిగనాలు పోగొట్టు మిగినేశముండ
సగినాలు పాటిగా సమసించి చెప్పఁ
జల్లంబులో సిల్పుఁడో బజెలంర

పత్తెచ్ఛముగ వాకుఁ బలిసిరానింపు
కాశిలోనున్నట్టి కాలభైరవుఁడ
యాశలెల్ల ఫలింప నవకాశమిదియె
గురితప్పనీకుండఁ గోరినవాకుఁ-
బరగ రానిండిప్పు బమ్మాదులార
యీకలికిఁ మనసు నాయెడ గూడునట్లు
వాకీఁయరే నాదు వాకుఁ ననిలచి.

(దండంబు బెట్టుకొని బుఱ్ఱమీటుచు)

(స్వగతము) ఆహాహా! యిప్పుఁడొక్క మంచివాలుగంటి చేయంటితి. నేను నా పుణ్యము. (ప్రకాశముగా) యీబెత్తము కొన పటుకొమ్ము. (తనచేతనున్న బెత్తము చివరఁ తనచేతితో చేతఁబట్టించి)

ఎఱుకల కాంభోజిరాగము.

అహోదేవీ! బాగ్గంగలచెయ్యి. షట్టిగలచెయ్యి కొంకులుగల చెయ్యి. చల్లనిచెయ్యి అహోదేవీ! యొకటి తలంపుచేసినావో. మనసులోని కోరిక కడగినావో. మంచి మేలడగినావె. నీయడగినది కాయోపండో, కల్లో నిజమో, అప్పునో కాదో, చేకూరునో చేకూరదో, అని తొందరపడుచుండావు. అది కాయకాదు పండు. కల్లగాదు నిజము. తొందరగానే, దగ్గరలోనే గట్టిగ నుండాది. అది యేకోపు కార్యమంటే. యిదుగో యీకోపు. (భుజమును బొడుచుట) ఆడవారి వంక తలంపా మగవారివంక తలంపా అంటే యిదుగో మగవారంటే గడ్డము లేక (భుజముఁ బెత్తముతో బొడిచి చూపుట) ఆడవారంటే లకొటకు. యిదుగో నీమనసులో తలంపు యెన్నిళ్ళకంటే వకటే! రెండే! మూడే! వకటంటే వకయేఁడుకాదు. రెండంటే రెండేండ్లు కావు. మూడంటే మూడేళ్ళుకావు. విడిలోనే యింతలోనే చేకూడు తుండాది. యికదాపరమేలా! కోడెగానితో తకిక్కర చికిక్కరలాడు కుంటూ కులకనుండావు. అప్పుడు నన్ను మెచ్చేవే. కోరుకులిచ్చేవే దేవీ! యిప్పుడు నీనాధుండు నాకు బొడగట్టె. నావళ్లు వణకుతుండాది. చెమటపెట్టుతుండాది. పులకరిత్తుండాది. నీకుఁ గనుపించదు గాని

నీకు మగడనయ్యెదనని యిక్కడనే దిబ్బెము మీదకు వచ్చి యుంటు న్నాడేకొమ్మా! నీపై చాలాదయవచ్చింది. నిన్నింతలోనే పెళ్లియాడు తాఁడు. నీతలఁపు చేకూరును. నమ్ముఁ నాబుట్టలోఁడు.

పార్వ—(ముసిముసి నవ్వులతో చెలులకై చూచి) చెలీ! దీని ధోరణి దీనిది. యడుగవలసిన ప్రశ్నలు నాకుఁ దెలియవు. మీరు రకుంటిరేల!

కలవా—ఎఱుకలసానీ! కోఁడెగానితో నంటివే! యాకోఁడె కాఁడెవ్వరో విప్పి చెప్పు.

కొండసింగి—(ఉరిమిజూచి) యేంటమ్మా! గడ్డము చూపించ లేదంటమ్మా. కోడెగాఁడంటే తెలదంటమ్మా! కోడెనెక్కువాడే కోడెగాడనుకోనరాదంటమ్మా!

నవమా—(కలవాణితో) ఓచెలీ! నీవడిగిన మాటలోనే మనయుద్దేశ్యమును కనుపెట్టినది సుమా!

కం—(నవమాలికతో) అదికాదె, మొట్టమొదటనుండియు దాని ధోరణియే యట్టిది.

నవ—(కలవాణితో) ఏనడుగుదును నీవుండుము. (కొండసింగితో) నీవు మొదట చెప్పిన దెంతో మఱలఁజెప్పిన నదియునంతే. తెలిసినది గాని యిప్పుడెక్కడున్నా డెక్కడి నుండి రాగలడు?

కొండసింగి—ఓళ్ళసామి! యెంతసెప్పినా మళ్లా సెప్పుమంటావు. విదేందమ్మా కొండమీఁద నున్నాడు. కొండమీదినుండి రాఁగలఁడు.

కల—(నవ్వి) ఆతని స్థితిగతు లెట్టివి?

కొండసింగి—ఓల నాసింగి! సోదడిగి పోవని గందమ్మా? అన్ని యిసమపసన లేనా! తెల్లబొల్లి బూచుల రాయుఁడు రాసిపెట్టఁబడియున్నాఁడు. నాబుట్టలోడని చెప్పలేదంటమ్మా!

పార్వ—కొండసింగీ! నామనోగతం దెలిఁగించినావు బహుసంతోషము. (చాటెడు ముత్యాలు రత్నాలు దాని యొడిలోఁ బోయును.)

కొండ—ఓలసింగిని! నీబామానమునకుఁ గొండెక్కినాను. నీవింకఁ గొండెక్కుండావు. నన్నప్పుడు విడనాఁడకుమా, నీవన్నియు నావె యనుకొందును. (ఎఱుక లిద్దరు నిష్క్రమించిరి.)

పార్వ—

చ. కుటిలము లేదు కా కుటిలకుంతలి చెప్పిన మాఁటలోననీ
గుటకలు మ్రింగ నేటి కనుకూలము గా నిటలాక్షు ప్రీతికై

పటుతరనిష్ఠతో జపతపంబులు సేయుట సిద్ధమిందు నేఁ
దటుకునఁ బోయి నాదుతలిదండ్రుల యానతి బొందివోయెదన్.

కాలక్షేపము కార్యసిద్ధికిఁ దెఱవుగాదు వేగరండు.

(అందఱు నిష్క్రమించిరి.)

---

## తృతీయ రంగము

### కైలాసోద్యానము

ప్రవేశము—శివుఁడు; భృంగియు.

శివుఁడు—భృంగీ!

ఉ. కన్నులఁగట్టినట్టులనె కన్పడు చున్నది వన్నెమీరనా
కన్నులమిన్న యెన్నటికి నబ్బునొ యబ్బుటకేమి సాధనం
బున్నది దాని భావమెటులున్నదొ యిందుకుఁ గన్నవారికె
ట్లున్నదొ కోరికోరిత్తయగునో యగునో మఱేలొ చదేమియున్.

నాకు నాంతరంగికుం డగువాడు నీకన్న మఱెవ్వఁడు. కర్తవ్యంబు నిర్ణయింపుము.

భృంగి—దేవా! నీవు సర్వజ్ఞుండవు. త్రికాల వృత్తాంతంబులు నీకు గరతలామలకంబులు. నేనా నీకు గర్తవ్యంబు దెలుపు వాఁడను. దెలిపినను ఫలమేమి. స్వతంత్రుండవు. నీయిచ్చవెంటనే పోవువాఁడవు. ఎందుకు? యిపుఁడు గావలసివచ్చితినా?

శివుఁడు—నీయన్నదంతయు వాస్తవంబే కాని నాచిత్తం బిత్తరిఁ గామమాయాయవనికాంతరితంబైనది. నీయొఱిగించిన తెఱఁగునఁ బోవువాఁడను.

భృంగి—(పకపకనగి) అదనుమించినఁ బదనుమించును. సమయాన వినఁదోచదు. ప్రాతవస్త్రంబుపోయినఁ గ్రొత్తవస్త్రంబుమఱలఁ గొనుట యాచారంబు. నీకడ్డమాడితినని కినియకుము. తొల్లి నాయాడిన దెల్ల మఱచితో? వలదని చెప్పిన దపంబే వలసితివి. వలదని చెప్పిన స్త్రీ యుపచారంబే వలసితివి. కలదని పలుకవచ్చిన యప్పచ్చవిల్తుని యంగంబు నిప్పుచ్చరంబుగఁ జేసితివి. వాడు దేహంబుపోయిన నున్నవాఁడే! వాని ములికి దెబ్బలబ్బబ్బా? నీహృదయంబున జిగురంట నాఁటియున్నవి శాఁబోలు. ఎవ్వనికేనిఁ గడు గడుసుఁదనముఁ గూడదుసుమా! వెనుకఁటిదో!

శివుఁడు—చాలుఁగాని ముందటి సందర్భం బాలోచింపుము.

భృంగి—మన సమాచారము ముందుకుఁ బోవ నయ్యె వెనుకకుఁబోవ గొయ్యె.

శివుఁడు—పురుష ప్రయత్న మూరక పోదురా?

భృంగి—అక్కన్నియ యింక నిన్ను వరించుననుకొంటివా ?

శివు—ఏమి ?

భృంగి—తనవలన నొకలోపంబు వచ్చినచో నెదుటివానివలన నూరు లోపంబులు వచ్చినను లోపమనరు.

శివు—అదియ యేనడుగుచున్నాను.

భృంగి—తన వ్రేలుపెట్టి తనకన్నుఁ బొడచి నీకన్ను నీరుగారుచున్నదేమని యడుగు నట్లున్నయది.

శివుఁడు—ఎందువలన ?

భృంగి—ఎందువల్లనా యందువల్లనే ? వలసివచ్చిన యబలారత్నముఁ గలసికొననేరక ననవిల్తు ననలంబు పాలుసేయు నెపంబున నడవి వెడలి పోవ సమర్జించి మఱల నయ్యబల రాని కతంబడుగుచుంటివి.

శివుఁడు—అదియ నీపొరబాటు. స్వయముగనేగి దాని మనసు గరగింపఁ జూచెదనురా యోరీ !

భృంగి—

సీ. గట్టురాయని పట్టి కఠినరాలగఁగాని
వేసము ల్మదినమ్మి మోసపడకు

శివుఁడు—

గంగచంద మెకాని గౌరియునటుగాదు
తత్ప్రాప్తి దనువు సార్థకముగాదె

భృంగి—

నగునది యెటులౌను నగరెయీపనికల్ల
దల్లిదండ్రుల కేమి తల్లడములో

శివుఁడు—

కన్నియ నాయందుఁ గడురక్తిగలదేనిఁ
దల్లిదండ్రుల ప్రాపుఁ దలఁపనేల.

భృంగి—

తే. గీ. గన్నె తనకట్టె వరుమీఁదఁ గాంక్షయున్నఁ
గన్నవారిని విడనాఁడి కలియఁగలదె

శివుఁడు—

బుద్ధి తెలియు కన్నెను దానిబుద్ధికిఁదగు
వరున కొసఁగుదు రద్దాని వార లవని.

భృంగి—బుద్ధి తెలసిన కన్నె యనుచోఁ గామదహనంబు నాఁటి రౌద్రావేశంబే యనుమాన మూలమని తోఁచెడిని. కాని వివాహలక్షణంబు లెట్టివో యెఱింగింపు.

శివుఁడు—భృంగీ! కన్యకపుట్టినతోడనే యిటునటు నిరువదియొక్క తరము వారు దుఃఖ తరణోపాయంబు దొరకెనేని యువ్విళ్లూరుచు నుత్తకాలంబున దానివారలు దానపాత్రునకు భగవదర్పణబుద్ధితో సాలంకృత కన్యాదానంబుఁ జేసిరేని దానంజేసి తరింతురు. కుమారా! యదియు కన్యాదాతలకు మహాఫలమంద్రు.

భృంగి—(నవ్వి) అయ్యా! దానపాత్రుఁడంటివి. వాఁడెట్టివాఁడు.

ఉ. శ్రీయుఁ గులంబు రూపమును శీలము విద్యయు బంధువృద్ధియుఙ్
బ్రాయము సాధులక్షణము భాసిలుచుండెడి వానిఁబిల్చి నా
రాయణునంశ భావములర న్విధి యుక్తముగాఁగఁ గన్నెఁదా
రీయవలెన్నుదానమది యిచ్చినవారు దరింతు రెంతయుఙ్.

యిదియే సాలంకృత కన్యాదానము.

భృంగి—స్వామీ! కొందరు స్త్రీశిశువు గలిగినతోడనే పత్రమపంటే పంట! పిత్రమపంటే పంటయని యుప్పొంగుచు నేఁటేఁట నొక్కొక్కవంద నెక్కించుచు బేరంబుల బీరంబులు చూపుచుఁ గన్నెకు భావికాల సౌఖ్యంబు లరయక యేరికైన నరాల నమ్మి వరాల మూటఁగట్టుదురు. దాని పేరేమి?

శివుఁడు—

శ్లో॥ విత్తమాభరణంచైవ
బుణంచ గృహసేవనం
పరస్పర వివాహశ్చ
పంచైతే కన్యకాక్రియాః.

విత్తముఁగొనుటయు, నగలడుగుటయు, నప్పుదీయుటయు, నిల్లరికముఁగోరుటయు, వినిమయంబు చేయుటయు, నీయైదువిధములు గన్యావిక్రయములు. వీనిలోఁబడినవారు దుర్గతిపాలగుదురు. వారియింటఁ గుడుచుట యమేధ్య భక్షణప్రాయము.

భృంగి—స్వామీ! కన్యాదానమునకు వరసంపత్తి ముఖ్యమంటివి. అట్టి వరుని సంపాదించుట యీకాలంబునఁ గడుదుర్ఘటముగదా! కొందఱు

ఉత్సాహావృత్తము

పిలచి పిల్లనిత్తుననిన బిగిసి యరణమిత్తువా
తొలఁగ కేమియిత్తువనుచుఁ దొడవు లొడమెలడిగియ
ల్లిలమిఁ బుచ్చికొనుచుఁ గన్నెనిచ్చువాని నొచ్చున
ట్లలయఁజూతురలయకుందు రర్థవంతులంతయుఁ.

దేవా! బలాత్కారఁపు వరదక్షిణలు గన్యాదాతల కొంపలు దీయుచున్నవి. దానంజేసి కన్యాదానఫలంబు లోపించదుగదా?

శివు—వత్సా! నీయన్నట్లు కట్నముల కట్టడిగొనుటయు, నందు గన్యాదాతలు దల్లడిల్లుటయు, నివి ధనమదపరిణామములే! కాని దానసాఫల్యంబుఁ జెందనీయనేరవు. అత్తయు నొకయింటి కోడలే యన్నట్లు దాతయునొకప్పుడు ప్రతిగ్రహీతియగుఁ బ్రతిగ్రహీతయు నొకప్పుడు దాతయగు. వీరిరువురుఁ గన్యాదాన ప్రతిగ్రహములయందుఁ బరస్పర ధన నిరపేక్షులై తదేకాగ్ర మనస్కులై కార్యంబు సమర్థించుకొనుటయు నుభయ తారకము.

భృంగి— అన్నియుఁ దెలసినవారే బొందంబడుదురు. నీవు హైమవతిమీఁదఁ గన్నువేసితివిగాని నీబుద్ధి యెట్లుండునో యాకన్నవానిబుద్ధి యెట్లుండునో! యీషణత్రయములో ధనాశయనునది గడ్డి తినుపించకమానదు.

శివుఁడు— (నవ్వి) నీవు విదూషకత్వమునకే తగుదువురా! నిరవధిక స్వేచ్ఛాపరమైశ్వర్యధుర్యుండనగు నాకు నిట్టి తుచ్ఛద్రవ్యాపేక్షకలదే.

భృంగి—అదికాదు స్వామీ! కట్నమెంత పుచ్చుకొంటి వనుమాఁట రాఁక మానదు. అదియే ప్రతిష్ఠ యనుకొందురు.

శివుఁడు— సత్పాత్రమని యెంచి శక్తికొలఁదిఁ గన్యాదానమిచ్చెద ననఁగఁ ద్రికరణ శుద్ధిగఁ బ్రతిగ్రహించుటయే యుభయతారకముగాని యసంతుష్టులయి నిర్బంధపూర్వకముగ లంచపుఁగట్నములఁ గైకొనుట మేలుగాదు.

భృంగి—నాసంశయంబు మీవలనఁ దీరినది. కన్యావిక్రయము, వరవిక్రయము, నొక్కరూపమేకదా! యింకొకటి.

శివుఁడు—అడుగు మదిగూఁడ!

భృంగి—కలిమిలేముల తారతమ్యమే యిట్టి చెడుకార్యముల యభివృద్ధికి మూలము. నీవు సర్వేశ్వరుఁడవుకదా! కలిమి నెల్లరకు నొక్కతీరుగ నీయరాదె!

శివు—ఎవనితరము? కర్మసూత్రానుబద్ధములు కావా, కలిములేములు. తలఁచుగా లేమియే యుక్తప్రవర్తనకు మూలము. కలిమి యనేక దుర్వికారములకు నిదానము.

తే. కలిమికలవారు మదదుర్వికారులగుచు
బలసి సదసద్వివేకంబుఁ బడయ రెపుడు
సరసులగు బీదలనుజూచి విరసవృత్తి
నెత్తిపొడుతు రిట్టిదకాదె విత్తమహిమ.

భృంగీ! ధనమదవికారము లిట్టివని నోఁట వచింపదరమా! తొలివిచారమునందలి పుణ్యంబులు స్వర్గాదిభోగంబులకుఁ జాలమింజేసి యిత్తటి విత్తభోగ రూపంబున దేహుల ననువర్తించును. అట్టిదేహులు దానివలనఁ గనులఁ బొరలుగప్పి రాజసతామసంబులఁ బొఱలుచుఁ గామక్రోధాది వాగురలం దగులుకొనక రగులుచున్నవారయి యనూయాంతరంగ స్ఫులింగంబులచే స్వకీయపరకీయ వివేకలేశంబైన లేక కాల్చఁ బేల్చ నుద్యమించుచు నిలుసొచ్చిన బంధుగులను విద్యావయోవృద్ధులను నిరుపేదలను నెకసక్కెములాడుచు మోమోటమించుకైనలేక కుటిల ప్రవర్తనులయి కృతఘ్నతావృత్తిని పొత్తుకొని దానధర్మంబుల నెండఁగట్టి యర్థకామంబులఁ బండబెట్టి విత్త సంపాదన కాయత్తచిత్తులయి శుభకార్యంబులపట్ల దాతలను మితిమించిన కట్టములను దెమ్మని విసికించుచు దుర్వ్యాపారంబులచే మానావమానంబులను విడచి సాధుబాధలకు వెఱవక విర్ర వీగుచుందురు. ధనవంతులకట్టి మదోన్మాదంబులంతకు నూరంతలుగ విస్తరించి యొక్కింత కాలములోనే మూలచ్ఛేదంబునకు మూలంబులై పరిణమించును.

భృంగి—స్వామీ! సర్వజ్ఞుండవుగాన నీకట్టి యాసయుండదుగాని యింకొక్కటి.

శివుఁడు—ఏమది? దాచక యడుగుము.

భృంగి—(గడగడలాడుచు మెల్లమెల్లన) దేవర కన్నువేసిన కన్నెకుఁ గన్న తండ్రి యతడేమైన (ఊరుకొని హస్తములతో నోరుగప్పికొని వెనుకకు నడచుట).

శివు—ఓరీ! చెప్పఁదలఁచినమాఁట సగమేచెప్పితివి. (నవ్వి) పైదియేదీ.

భృంగి—అయ్యా! నోరుజారితిని మన్నింపుము.

శివు—వహవ్వా! నీదిరా, చమత్కారము. ముందటికాళ్లకు బంధాలు వేయుదువు. సంగతిఁ గనుగొంటి సంశయంబుఁదీర్తు వినుము.

చ. తనసుత నొలి నమ్ముకొనఁదల్చును దుచ్ఛుఁడెవండొకాని స
జ్జనుఁడటు దల్చఁడెన్నటికి సత్యముగాఁ దన కేదిలేక పో
యినఁ దిటిపెంబునైన జరియించి ఘనంబుగఁ గన్నెదానము
న్మనుకొని చేయుబో కులము పూర్వపువాసిఁ దొలంగకుండగన్.

హిమవంతుఁ డనంతరత్నరత్నాకరుండు, మహౌషధి జన్మస్థానమూర్తి. పారమార్థిక శిఖరుండు. హవిర్భాగార్హుండు. మహామేరున కల్లుండు. నతనియొడ నెట్టియను

మానంబుఁ బెట్ట నవకాశములేదు. గట్టురాచూలి సతీమణియేయని తోఁచుటయు కాక వారిచే దొలువోల్త మనోదత్తయైన నా సాత్తేయని నా నమ్మకము.

భృంగి—దేవా! అట్లేని నడనడ నీబుడబుడలు నీకేల. గుంభితముగ మనయింట మనముండుదము. నారికేళములోని నీరువలె దానియంతట నదే జతపడును.

శివు—అవునుగాని యనంగుడు వెనుకఁటి కసిపెంపున మనల నూరకొననీయఁడు.

భృంగి—హుం (పకపకనగి) అయ్యో! పిచ్చిపని చేసితిని.

శివు—ఏమిరా! యది.

భృంగి—ధర్మపన్నాలతో నీచింత మరచితి వనుకొంటి. నింక మఱింత సేఁపు దర్మపన్నాలే కానిచ్చినచో మనసు నూరకొననిచ్చునేమో కదా!

శివు—ఓరీ! నీతెచ్చిన లాఁటి ప్రసంగములు ప్రస్తుతోపయోగములే కాని పార్వతి యిపు డెక్కడ నుండును?

భృంగి—నాఁడే తలిదండ్రుల యనుమతిఁగొని తపంబుఁ జేయఁబోయెనట!

శివు—నాకు నంతియ తోఁచుచున్నది. యాత్రికఁ బ్రహ్మచారివేషంబుతోఁ బోయి దాని మనోధైర్యంబుఁ గనుపెట్టదలచితిని.

భృంగి—దేవరతో నేనుఁగూడ సిద్ధపడియున్నాను.

శివు—శిష్యభావంబు నభినయించుచు రమ్ము.

(అని యిద్దఱు నిష్క్రమించిరి.)

---

## చతుర్థ రంగము

### ఉద్యానవనము సీను

ప్రవేశము—తపోనిష్ఠ సలుపుచుఁ బార్వతి. యుపచారములు చేయుచు చెలులిద్దఱు.

కల—(ఎదుటఁజూచి) సఖీ! యిటు చూడు. బ్రహ్మచారియొకఁడు శిష్యునితో నిటు మొగంబై వచ్చుచున్నవాఁడు చూడుచూడు.

నవ—(పారఁజూచి) సఖీ! వామనమూర్తివలె నున్నాడే. (పరిక్రమించి తిరిగి చూచి) మనచెలికి జపావసానమైనట్లున్నదే. (చెలులిద్దఱును బార్వతియొద్దకుఁ జేరుట)

(బ్రహ్మచారి, శిష్యుడు, ప్రవేశము.)

బ్రహ్మ—(స్వగతము) ఆహాహా! యీతపోవనరామణీయకము! పార్వతీలీలోద్యానము కాఁబోలు. మాకందమందారపిచుమందకుంద చందనాదులు శుకపికశారికాదులకు వాదులొనర్చుచున్నవి. తరుల దరులఁ జెన్నలరు. నలరుల నందంబగు తిన్నని పొన్నగున్నలనీఁడల జాఁడల గిసిమిసి చప్పరంబుల నొప్పిదంబులగు రుద్రాక్షపొదలఁ బొదలు ద్రాక్షతీవల త్రోవలఁ దామర కొలంకుల కెలంకుల నచ్చేడియవిచ్చేసి క్రీడ

లాడుచు శృంగార తపోభారంబు సలుపుచున్నది కాబోలు. హైమవతి నెప్పుడు జూతు నెన్నఁడు చెట్టబట్టుదు! (ముందుఁజూరఁజూచి) యిదుగో! యిచటనే గంగా తీరంబున నేఁటికి జపంబు చాలించి చెలులయొద్ద ఫలహారంబుఁ జేయుచున్నట్లున్న యది. (నిలఁబడిచూచి ఆశ్చర్యముతో) వహవా! నలువ తనచాతుర్యమంతయు దీని యందె కనపఱచె, దీనిచక్కఁదన మెంతనివర్ణింతు!

ఉ. పున్నమనాఁటి చందురునిబోలు నిదే నగుమోముఫాలమా
క్రొన్నెల నేలు నెన్నఁడుము గుప్పిఁటిలో నిమిడింపవచ్చునా
కన్నులు నల్లకల్వల రకంబులె తుమ్మెదరెక్కలే కురు
ల్చన్నులు పొన్నకాయలకు సాఁటివె నాఁటివె కంటి నేఁటికిన్.

చ. కలకల నవ్వు నెమ్మొగము కన్నులఁజేరలఁ గొల్వవచ్చుఁ జె
క్కిళులు మెఱుంగుటద్దముల కేల్గవ కెంజిగురాఁకు చేవపు
వ్విలుతుని విండ్లె కన్బొమలు వీనులు శ్రీలకు శ్రీలొసంగుఁ బి
క్కలు వరిపొట్ట లౌర గిరికన్నియ వన్నియ యెన్నశక్యమా.

చ. కలకలలాఁడు దీని ముఖకాంతులు నా మకుటేందురేఖకుం
బిలబిలపూర్ణభావము లభింపఁగఁజేయు ట దింక నెన్నఁడో
తళతళలాఁడు దీనిమయితావులు నాసకు నాసనింపఁగాఁ
గిలకిలలాఁడుచు స్మరుని కేళులఁదేలు ట దింక నెన్నఁడో.

చ. కరములు పల్లవంబులు నఖంబులు చంద్రసఖంబు లౌర యీ
చరణము లంబుజంబులు కచంబుల బారులు బారెడేసి ప
ల్వరుసలు మల్లెమొగ్గలె భళా! యబలామణి యందగత్తెరా
సరసను జేరి దీని సరసం బరుసంబుగ నేలు టెన్నఁడో.

సీ. కంటినా యిటువంటి కలకంఠి నెప్పుడైనఁ
గన్నులు చెదరిపోచున్న వౌర
కను ముక్కుతీరు చక్కఁగఁ దీర్చియున్నది
నెలఁతఫాలము లేఁతనెలను బోలు
బిట్టు కన్బొమ లోరపెట్టినట్లున్నవి
కెమ్మోవి పగడాల కేళిదీరి
నునుఁజెక్కుఁగవ మెఱుంగును దోమినట్లున్న
దింతి చక్కఁదనాలదొంతి గాదె

తే. గీ. కఱఁగిపోసిన యపరంజి మెరుగుబొమ్మ
ముద్దులాడఁగ మనసాయె ముద్దుగుమ్మ
యెన్నఁటికి నాకు దొరకునో చిన్న దార!
మరుని వలచేత నాడెడి విరికటారి.

సీ. బుగ్గల తళతళ ల్మునువ్రేళ్ళతోఁ బుణికి
ముద్దులాడఁగఁబోలు ముగుదమోము
కులుకు గుబ్బలతళుకు లులిపి పయ్యెద పైనఁ
జిందు వేయుచునున్న వందమలర
తొలకరి మెఱపుతోఁ దులఁదూఁగు మైదీ
సౌందర్యఝురిలోని స్మరుని నావ
కంఠంబులో నీడ గనుపట్టుచున్నది
పోలఁతి మారునిచేఁతి పూలబంతి

తే. గీ. యింతి కీ ముద్దుమొగ మేమి! యీ యొయార
మేమి! యీ మేని బందుబస్తేమి! యార!
దీనిఁ గలయని బ్రతుకేల దీనికడకుఁ
బోయి యీ భావమంతయుఁ బోలఁ గనుదు.

(ప్రకాశముగా) భృంగీ! అల్లదె పార్వతి నిత్యతపోవ్రతంబు నిష్ఠాఁడు సలిపి సకియలతో ముచ్చటించునట్లు తోచుచున్నది.

భృంగి—యింకేమి. ఆఁడబోయిన తీర్థమెదురయ్యెనన్నట్లు తపోవిరామసమయమే యిది. కాని మనము మాఱువేషములతోఁ బోవుచున్నారము. వారక్కడఁ గేవలము స్త్రీలు. సమయోచితముగ మాఁటాఁడుట మేలుసుమా!

శివు—నాకును గొంచెము తెలియును గాని మంచి చమత్కారము చేయవలయును. రారమ్ము. (ఇద్దఱు ముందుకుఁబోవుట.)

కల—(పార్వతితో) ఓబాలా! నీపాలికి సాంబమూర్తియుంబోలె మహాతేజోనిధి యగు నొక బ్రహ్మచారి శిష్యునకు వేదపాఠంబు చేయించుచు వచ్చినాఁడు. మహానుభావులు వచ్చినఁ బరమలాభంబని పెద్దలు చెప్పఁగా వినుముగదా! యక్కా! నీవీతనికి మ్రొక్కి యితనిచేత దీవనలందుకొనుము. (పార్వతి నవమాలిక వంకఁజూచుట)

నవ—మహాత్ములూరక రారు. బ్రహ్మచారి ముఖవర్చస్సునుబట్టియే సర్వజ్ఞుఁడన వచ్చు. నప్రయత్నముగ వీరిరాఁక జూఁడ నీకు నేదో గొప్పలాభమున్నదని తోచుచున్నది.

పార్వ—సఖీ! పీఠంబు గొనిరమ్ము. (వీరియొద్దకువచ్చి నమస్కరించుట.)

బ్రహ్మ—శీఘ్రమేవ వివాహసిద్ధిరస్తు. (సఖితెచ్చిన పీఠంబుపైఁ గూర్చుని)

ఉ. ఎవ్వరిదానవే తరుణి యిట్టి తపం బొనరింపనేలనే
జవ్వని నీ మనోరథము చక్కఁగనే సఫలంబయౌను నీ
మవ్వపు నామమేమి? జనమాన్య వనన్యగుణాభిగణ్యా వీ
వివ్విధిఁ గాయకష్టముల నెక్కుడు వేసఁటఁజెందనేలనే.

వన్నె వానికెక్కిన కొండంతవాని యింటిపడుచువలెఁ దోచుచున్నావు. బాగా! బాలాతపంబైన సోఁకరాని కలువ పువ్వులగంప పట్టపగఁటి పేరెండకుఁ దాళునా! నీవెక్కడ! నీ శరీరమెక్కడ! నీచేయు నుగ్రతపంబెక్కడ! నాకద్భుతం బగుచున్నది. వెన్నెలకు వడదాకు నీమెత్తని మేనిత్తటి నిత్తోఁటలో నిత్తెఱంగున వేసఁట పెట్టుట మానుము.

చ. తిలసుమనాస! నీవు వనదేవతవో! హిమశైలనాథు ము
ద్దులసుతవో! కరం బిటులఁ దోఁచుఁ జక్కఁదనాలకుప్పవై
తిల సరిలేనిదానవని యెంచితి నుంచితి మంచిచూఁపు నీ
తలఁపున నున్నదాని నిఁక దాచకయో చకితాక్షి తెల్పవే.

కల—(నవ్వుచు హస్తంబుతోఁ జూపుచు).

చ. వినుము మహాత్మ! శీతపృథివీధరు కన్య యుమాభిదాన యీ
వనజదళాక్షి భక్తజనవత్సలు నీశ్వరుఁ బెండ్లియాఁడఁగా
మనమునఁ దల్చి నిల్చి యిట మానుఁగ నీ గతిఁ దండ్రియాజ్ఞ చే
కొని వ్రతనిష్ఠమై భవుని గొల్చుచునున్నది చిన్న దీయెడన్.

బ్రహ్మ—(పకపక నవ్వుచుఁ పార్వతితో) బాలా! యేమి యీవిచిత్రము?

క. నిక్కము చెప్పినదో? యక
సక్కెంబున కిట్లనెనో? సకియ! సరసిజముఖి! నీ
వక్కట యక్కటికంతుని
నెక్కుఁగొని పెండ్లియాఁడ లెక్కించితివో.

గీ. సుదతి నీ కిట్టి వెడబుద్ధి సొంతముగనె
తోఁచెనో! లేక యెరులు నీతోడ ననిరొ
కలికి నీబుద్ధి బంగారుగాను వినవె
కినుక నిన్నిట్టు లెవరు భంగించినారొ.

కొమ్మా ! యేను సర్వకాల సర్వావస్థలయందు సర్వజ్ఞుఁడ ననిపించుకొన్నాను. ప్రశంస వచ్చినదిగాన నీసంకల్పమునందలి గుణదోషము లాకించుక పరిశీలించుదము. నీవు ముగ్ధవు. పెండ్లియనఁగ వేయికాలాలపంట. శీఘ్రపడక యోచింపవలె సుమా !

(పార్వతి తెల్లబోవుట)

కల—మహాత్మా ! మీరన్నటు సర్వజ్ఞులగు వారికి దోషములను గూఁడ గుణములనుగా గ్రహించుట సహజమేకా ?

బ్రహ్మ—(పార్వతితో) బాలా ! నీసఖియనినమాఁట వింటివా ! సర్వజ్ఞుల సహజ గుణమిట్టిదియైనను లోకోపకార మెట్లువిడువదగు.

నవ—ఆర్యా ! పృచ్ఛలేనప్పు డట్టి తెలుఁగునకుఁ బోనేల ?

బ్రహ్మ—(పార్వతితో)

బాలా ! యీవికటసఖీజనులు నీకెక్కడ దొరకిరి ! మావంటిసర్వజ్ఞులకుఁ బృచ్ఛ సేయనేల ! యెఱిఁగినయంశము చెప్పిపోవుటయే పరమధర్మము.

కల—మహాత్మా ! మాచిన్నదింతకంటె నెక్కుడవకాశమీయదు. మాతోఁ జెప్పరాదో !

శిష్య—ఓసీ ! యాబిడయూరకున్నప్పుడు మాపుట్టిమునిఁగినదా ! కందకులేని దురద చేమకేల ! మీతోఁ జెప్పనేల ? మీపనిగాని నాపనిగాని యిప్పుడు లేచి పొమ్మనినచో లేచిపోవవలసినదే !

బ్రహ్మ—(శిష్యునితో) ఓరీ ! నీకెందుకూరుకొనరా (పార్వతితో) బాలా ! నీవు చిన్నదానవు. శివుని వివాహము చేసికొనుటకుఁ దపించుచున్నావని నీసఖియలే వాక్రుచ్చిరి. నాకు నట్లనే తోచుచున్నది. మొట్టమొదట నీకీ పీఁటముడివేసిన వారెవరో కాని విప్పుట కష్టతరము. నాచెప్పఁదలఁచినవాక్యము నీవీనులఁ జొరనిచ్చితివా ! యీముడి దానంతట నదే విడిపోవును. మేలుగొనెదవు.

కల—మహాత్మా ! మీరంతసర్వజ్ఞులరే యైనచో మాచెలికున్న యీముడికిఁగల పూర్వసంబంధ మున్నదున్నటు చెప్పితిరా ! నమ్మి ముందు మీచెప్పెడి వాక్యంబులు రుచియుక్తంబైనచో వినుటకు మాచెలి యవకాశమీయనున్నది.

శిష్య—అబ్బో ! ఎంతపని ? నీయడగినది నన్ను జెప్పమంటివా చిటుకలోఁ జెప్పఁగలను.

కల—విన్నావేమో !

శిష్య—ఛీఛీ ! మా జ్యోతిషమట్టిది. వీరు త్రికాలజ్ఞులు.

బ్రహ్మ—ఛీ మూఢా ! యీ కాలంబున విశ్వాసముంచిన వారికే కాలమును కనిపెట్టువారికే జ్యోతిషముగాని లేనివారికా ! ఊరకుండుము (పార్వతితో) బాలా ! నీకుమనసుసిగ్గును గూడనా ! యిట్టిభ్రాంతిపెట్టికొని నీ పడిన కష్టము లనేకములున్నవి. నీకింతకుమున్ను తపశ్చర్యాపర్యాప్త మనస్కుఁడగు శివునియొద్దఁ బరిచర్యాక్రమంబు నాఁడేమయ్యె ! మధ్యవచ్చిన మన్మథుని మన్నుచేసి నిన్ను నట్టడవిన విడిచి పోవఁడే

మటిల నీవ్రెక్కు నాడొక్క ప్రబోధికచే సోదె చెప్పించుకొని తొంటిపద్ధతినే యుంటి విగా! సోదికిబోవ సుద్దులకు గొదువా! యడిగెడి క్రమమును బట్టియే చెప్పుటయు జెప్పెడి క్రమమునుబట్టియే యడుగుటయు సోదిలో నీ రెంటికి జతగాదా! సోదినిబట్టి కార్యారంభంబు లెండమావులవలె ఫలోన్ముఖంబులగునా. రాజకుమారీ! నీకు దపస్సుతో గార్యసిద్ధి గానేరదు. నీ వివాహమును గురించి నాచెప్పినటు వినుము.

పార్వ—(నాలుగడుగులు పరిక్రమించి బ్రహ్మచారికి వినఁబడకుండఁ గల వాణితో) చెలీ! యితఁడు గతాగతమంతయుఁ జూచినవిధముగా వక్కాణించినాఁడు. విశేషజ్ఞుం డనఁదగునుమా! మన కితర మక్కరలేదు. గాని మదీయ తపస్సిద్ధికి నింకెంత యాలస్యమో యడిగి తెలిసికొనుము.

కల—యిందుకే యేవంత తలచితి నతని ముఖమున వచ్చెడి యంశముల నన్నిఁ టిని రానిచ్చితిమా, కొలికి యాము త్తమంతయు నదేవచ్చును. రావే! (మటిల నొద్దకు జేరుట)

శిష్య—యేమి? ఆలోచన ముడిపడినదా!

కల—మును పే ముడిపడినది.

బ్రహ్మ—వానినిఁ గదల్పక నన్నడుగుము.

కల—ఆర్యా! మాచెలి తపస్సిద్ధికి నింకెంత యాలస్యమో.

బ్రహ్మ—(పార్వతితో) బాలా! నావచించు హితోపదేశమంతయు వినుము.

చ. శివుని గుణంబులెల్లఁ గడుఁ జిత్రములైనవి వాని నీ వెఱుం
గవె కమలాక్షి లోకమున గన్గొదలేనివి లేనిపోని వై
భవములు వాని కున్నవని భ్రాంతిని బొందితివేని నీకు వా
స్తవముగ ముందుఁ గష్టములు తప్పవు గప్పవంశంబె చెప్పఁగాన్.

పార్వ—బ్రాహ్మణోత్తమా! మీ హితోపదేశము ధృతకోశాతకీన్యాయముగా నున్నయది. ఆహా! బ్రహ్మచారి దశలోనున్నవాఁడ వయ్యుబ్రహ్మాండనాయకుని బ్రహ్మాండాతీతునిగా నెఱుంగనట్లు భ్రమప్రమాదంబులతో బోధింపు చున్నాఁడవు.

చ. శివుని గుణంబులెల్లఁ గడుఁ జిత్రములౌట నిజంబు నీ వెఱుం
గవు వటువర్య లోకమున గన్గొతఁగొన్నవి శాశ్వతంపు వై
భవములు గావటంచు మది భ్రాంతిని బొందితివేని నీకు వా
స్తవముగ నీవు చెప్పినవె తప్పవు తప్పక చెప్పకుండుమీ.

బ్రహ్మ—భూధరేంద్ర పుత్రీ! యాభూతేశు వృత్తాంతంబంతయు వినుపింతువిను.

మ. కుల గోత్రంబులు లేనివాఁడు ఫణిరాట్కోటీరకుం డెల్లెడన్
గల భిక్షాన్నముఁ గాలకూటవిషమైన న్మెక్కు కుక్షింభరుం

డలసుం డేదియు లేనివాఁ డఖిల మాయాకోవిదుం డయ్యయో
చెలి! దోషాకరశేఖరుం డెఱుఁగవా! ఛీ! నీకు వాఁ డేలనే?

పార్వ—ఆర్యా! యెఱిఁగిన మూర్ఖునికి వినుపించుట దుర్ఘటము గాదా!

క. లోకాతీతుల కాయా
లోకాచారంబులెల్ల లోపము కావా?
నీ కాలోపము దోఁచిన
నా కేమియుఁ దోఁచ దదియె నమ్మకము సుమా.

బ్రహ్మ—బాలా! ఉన్నమాట చెప్పినప్పుడు నీకేల పరిశీలింపఁదోఁచదు.

చ. కరము బికారి పేరుఁబుముక ల్మెడనిండ ధరించువాఁడు దు
ష్కరరుధిరార్ద్రమత్తకరిచర్మము నర్మిలి కట్టికొన్నవాఁ
డురుతర భస్మలేపన మహోగ్రసమగ్ర దురాగ్రహుండు నా
పురహరుఁడేల నీకుసరిపోలునె యేలునె నిన్నుఁ గోమలీ.

పార్వతి—విప్రవర్యా! యప్రస్తుత ప్రశంసలతో నుపయోగమేమి? మీకంత మాత్రము తెలియదో! యాశ్రితులకు సకలైశ్వర్యముల నీయజాలిన సమర్థునకు నాయా పైపూఁత లెట్లున్న నేమిలోపము?

చ. నవనిధు లీయఁడే తనను నమ్మిన జక్కులరేని కెంతయు
న్నిపుఁడు దరిద్రుఁడా యహహా! చిత్తజువైరికి లేనివేవి! యీ
భువనము లేలువారు తమ భోగము లాత్మఁ దలంప కాత్మవై
భవముల భక్తులం దఁపి భావములోఁ దిలకించుచుండరే.

బ్రహ్మ—ఉన్నవన్నియు సాకల్యముగ వింటివా ఉన్నది.

చ. తిలకమకస్సేయ కీ విపుడు తిన్నఁగ నూఁకొనుమో లతాంగి కా
నక చెడిపోదు పూరకయె నవ్వులుగా వివి! రుద్రభూమిలో
నకనకలాఁడుచుం దిరుగు నగ్నుఁడు గాఁడు పిశాచసంవృతుం
డాకఁడు దిగంబరుండు కఠినోగ్రుఁడు చూడ నసహ్యమౌఁ జుమీ.

పార్వ—మీయనెడి వాక్యంబులే యసహ్యంబులు గాని యామహేశ్వరుని నామరూపక్రియాగుణంబులు పరమ శ్లాఘనీయంబులే.

చ. జనుల మనఃప్రవర్తనలు చక్కఁగ దాఁగను పెట్ట నీశ్వరుం
డనయము పై కసహ్యమగునాకృతి దాల్చిననేమి లోకపా

తులలేని మణిహంస తూలికనుండఁనీ
వలస్మశానపునేల నలరుటెట్లు
పరిరంభ మొట్లబ్బుఁ బడఁతినీయూరుపైఁ
బేరుటలకనుబాప పేరులుబ్బ
విషదగ్ధమగువాని వెడదనాలుకనీకు
వాఁతెరచవిచూడ వలనుపడునె

తే॥ గీ॥ విషముఁదిన్నాఁడు రసనపై వెగటుపోవ
నింతచక్కెరకోసమై యెంచినీకు
యిట్టిచెడుబుద్ధి నేరిపి యిత్తుసమర
సాక్షి యెవ్వరు నీయుసు రోసుకొనిరొ॥

పార్వ—(తనలో) శివశివా! యీపాపం దపారముగఁ బరమేశ్వరుని దూరు చున్నాఁడు (ప్రకాశముగా) నిన్నడిగినందుకీ చెప్పినవిచాలు! పొమ్ము పొమ్ము.

బ్రహ్మ—మేము తీర్థయాత్రాపరులము నీయొద్దనూర్చుండరాలేదు. మార్గవశం బున వచ్చి ప్రసంగవశమున సత్యమాఁడుచున్నాఁడను వింటివా! సంతోషము. వినక పోతివా! పరమ సంతోషము. చెప్పఁదలఁచినదంతయుఁ జెప్పకమానను. వింటివా! నీవక్రబుద్ధి సాధుమార్గమున కప్పుఁడేవచ్చును.

కలవా—ఉపదేశమింకఁ గొరఁత పడెనా! యేదీ కానిందు.

బ్రహ్మ—(పార్వతితో)

మత్తకోకిలావృత్తాంతము

తోకశీతకరాంకు ముందఱఁ దోయజాక్షిరోయుంటివా
కాకిముక్కున దొండపండును గట్టినట్లులనుండవా!
ప్రాకటంబుగ రత్నమున్ మసిపాతగట్టిన యట్లెసూ
లోకులెల్లను నవ్వఁజూతురు లోపమయ్యదిచాలదే.

పార్వ—

కం. లోకాతీతున కెప్పుడు
లోకులు నవ్వంగ నేమిలోపం బహహా!
లోకమున వీరికంటెను
లోకారాధ్యుండు గలఁడె లోపముగలదే.

బ్రహ్మ—(పకపకలాడి) శ్రీరామరామ! నాచెప్పినదేమాయె? రామాయణ మంతయు విని రామునకు సీత యేమగుననునట్లున్నది. లోకాతీతుండగుట యటుండ

నిమ్మ. ముందు లోకములోనివాఁడు కాఁడా! లోకాచారము లెంతవానికైనఁ బరిహ రింపనగునా! చుక్కానికొక్కమాఁట వినుము.

గీ. కలికి యింతకంటెను బుస్తెగట్టుకొనఁగ
సరిగనుండును జక్కని స్థాణువైన
నవ్వుఁబాటులపని యిది నమ్మనాదు
మాఁట నీ కాతనికిఁ బెండ్లియాఁట తగదు.

కలవాణి—(బ్రహ్మచారి వినకుండఁ బార్వతితో) కొమ్మా! యిపుడు బ్రహ్మ చారి యక్కఱలేని ప్రసంగములకు వచ్చినాడు. వీనిభావంబిం కెట్లున్నదో!

పార్వ—అడిగి తెల్పుము.

కల—(బ్రహ్మచారితో) అన్నిటికన్నియు జెప్పితిరి. మీభావమేమి?

బ్రహ్మ—(పార్వతితో) నా యభిప్రాయమునుబట్టి నడచుకొంటివా! నీరొట్టె నేతిలోఁబడినట్లే. నేనంటివా జితేంద్రియుండను గాని నీనిమిత్తమిపుడు వివాహము చేసుకొనుట కొప్పుకొందును. నాకు స్వాధ్యాయమంతయు క్రమాంతముగా నధ్యయ నాధ్యాపనంబులతో బూర్తపడినది. బ్రహ్మచారిని బ్రాహ్మణుండను. భువన పావ నాత్మకుండను. కేఁద బాఁపఁడను గాను.

గీ. కొండనెక్కెద విప్పుడు కొఱఁతలేదు
ముందుగా నేమిచెప్పుదు ముగ్ధగుమ్మ
కొమ్మ యీ మేను నీ దనుకొమ్ము లెమ్మ
తపము జాలించి నా కీవు తరుణివగుము.

పార్వ—(చెలులతో) విన్నారా! చెలులారా! భగవద్భక్తుండు, బ్రహ్మచారి, యభ్యాగతుండు, నని వీనిని బూజించితిని. భగవద్భక్తులు పరమసాత్వికులు. పరనింద సేయరు. చేసిన వినరు. ఏడిప్పుడు దివ్యమంగళ విగ్రహుండును, నిత్యసుఖాత్మ కుండును, నిగ్రహానుగ్రహసమర్థుండును, నిరంతరాష్టైశ్వర్యుండును, భగవంతుండును, వాచామగోచరమహిముండును, స్వాశ్రితావనకరుణాపూర్ణ హృదయుండును, సచ్చి దానంద స్వరూపుండునగు పరమేశ్వరుని నిందించుచున్నాఁడు. సత్యము. వీఁడు బ్రహ్మచారిగాడు. పరమకాముకుండు. మీరిద్దరు వీనిఁబట్టి తగినబుద్ధిచెప్పి వెడల గొట్టుడు. వీనిముఖముచూచుట భావ్యముగాదు. (పార్వతి జపశాలలోనికి బోవుట)

కలవా—చెలీ! యింకఁజూడనేల?

ఉ. మన్నన గొన్నవానివలె మార్గవశంబున వచ్చి యిచ్చఁగ్రొ
క్కొన్నవిధాన రెచ్చి మన క్రొన్ననబోణిని జిన్నఁబుచ్చె నీ
చెన్నఁటి బాపనయ్య నిట జెంపజెటేలన రాలఁగొట్టి వే
తిన్నగ బుద్ధిచెప్పి పలుత్రిప్పులు పెట్టుచు వీనిఁ బుత్తమే.

నవమా— ఓసీ! (ముక్కున (వ్రేలుపెట్టుకొని) ఏమి సోద్దెమే! ఔరా!

ఉ. ఇంతులమున్న చోటికిటు లెంతొ మహాత్ముఁడు వోలెవచ్చియీ
వంతయుశంక లేక యనె(వక్షంబున హస్తంబద్దుకొనుచు)
నమ్మరయో! యమ్మరయో! యెంతవాఁడె! యీ
చెంతకుముం దికెన్నటికి జేరకయుండెడి లాఁగుఁ జేసియుం
పింతమురావె! వీని వటువేషమదెట్టిదొ! చూడగాదగుణ్.

(సఖులిద్దఱును బట్టముంజ్లు రవికెముండ్లు మొదలయినవి సవరించుకొనుట)

శిష్యుఁడు—(భయమభినయించుచు) అయ్యవారూ! చివరకు నియ్యాఁడు వాండ్రచేతిలో బడితివిగదా! చూడు సుందరాంగు లందమైనతమ పెందొడల తళుక్కులు పైకుప్పతిల్ల గట్టు చీరల క్రింది కుచ్చెళ్ళచెంగులు వెనుకకు లాగి ముడియగట్టి కరపల్లవంబులతోఁ బయెంటలోని రవికముళ్ళు బిగియింపుచు బొమముళ్ళు చిట్లింపుచు నిన్నరచేఁతి చఱుపులతోఁ జఱచుటకు సిద్ధపడుచున్నారు. కాలోచితముగ దూసి కొంటివామేలు (అటునిటు పరుగెత్తుచుఁ బెద్ద గొంతుతోఁ గరతాళంబులు వేయుచు)
(గురువుతో)

ఉత్సాహవృత్తము

మృకువు తప్పిమాటలాడి తేమి సేసెదయ్యయో!
యిదిగోవచ్చి తన్నిరింతు లెంకుబోదువయ్యయో!
తుదకు యోగమిట్టి దయ్యె దొలఁగ వేలనయ్యయో!
మదనుబారి కింతలోనె పదను బాటి తయ్యయో!
(తనలో)

ఉత్సాహవృత్తము

అయ్యవారినిదుగొ పట్టి రమ్మలకటలయ్యయో!
కుయ్యొ మొర్రోయనిన వీని గోలవినరికయ్యయో!
తియ్యమాఁటలాడి పరువు దీసి వేసి రయ్యయో!
నెయ్యమేది యయ్యవారి నీఁటు నడచి రయ్యయో!
(గురువుతో)

మత్తకోకిలావృత్తము

బులుపు దీరిచి పొంకపెట్టక పోవనిత్తురె చిత్తరు
లెమ్మెళకువంగని పెట్టకిమ్మయి మేళ మాఁడితివక్కటా!
నిలువరా దెటుఁబోదు నే నికనిత్యవర్ణివటన్నను
న్నిలువనీయరు దేశికోత్తము నిన్ను దన్నుదు రీచెలుల్.

అయ్యవారూ! గ్రుడ్లొప్పగించి చూచుటయే నీపని!

చ. మదవతు లౌర మిమ్మిపుడ మర్దనజేయుచు రిప్పు దూరకే
వదలరు మీవలెం జదువు వాసిగఁ జెప్పెడివా రిఁకేరి నా
మది భయమౌచునున్నది సుమా గురుశేఖర
(పార్శ్వమునఁ జూచి హస్తముతోఁ జూపుచు) వీరె వచ్చి రీ
సుదతులు సిద్ధమైరి తనుశుద్ధిని మీ కొనరింతు రక్కటా!

కల—పడతీ! యీ బుడుతపారు దూరక మొర లిడు చున్నాడు. వీనిపని ముందర జూతమా!

నవమా—ఓ! పదపదముందు వీనిజలుబు వదల్చవలసినదే (చెలులిద్దఱు శిష్యునిపై గలసి చికాకుపఱచుట)

శిష్య—(హస్తంబుతో నోరప్పళింపుచు) ఇదుగో! నామీఁదకు రాకుఁడు. మడివస్తువులు ముట్టకుఁడు (ఒద్దనున్న వస్తువుల నొడిలోనే యిముడుచుకొని) ఇది మాయయ్యవారి బుడిచెంబు. వారిదే యీ ప్రాతతాటియాకుల పుస్తకాలకట్ట. యిది మాయయ్యవారిదే జపాసనము. వారివే యివి కట్టివిడిచిన ప్రాతధోవతులుసుమా! యిదిగో వారి దేవతార్చన పేటికమీరు ముట్టకుఁడు. ముట్టితిరా; మీకును నాకును జివాట్లెఁకనున్నవే!

కలవా—మీయయ్యవారిపాట్లు ముందున్నవి. ముందుఁజూచెదవు. (నవమాలికతో) ఓసీ! యితడేమి సేయునో చూతము. ఒక్కొక్కదానినే యూడలాగవే. (నవమాలిక కలఁబడి పుస్తకము నూడలాగుట)

శిష్య—(నోటిమీఁదఁ జెయ్యివేసుకొని లబలబలాడుచు నన్నియుఁ గ్రిందఁ బాఱవైచి) ఓనాతల్లులారా! మీ పుణ్యమాయెగాని నన్ను వదలుండు. చాలు చాలు, సిగ్గువచ్చినది. యినుమును గూడుటంజేసి యగ్గికి సమ్మెట పెట్లన్నట్లు యీయయ్యవారి మూలాన నాపని బాగాయె. నీయయ్యవారియొద్దఁ జదువవచ్చిన నాఁటనుండియు నచ్చులు హల్లులు విడఁదీసి యచ్చరంబులైనఁ గుదురఁజెప్పలేదు: నాకింక నీయయ్యవారి శిశ్రూషలు చాలు. మీరును నయ్యవారు నొకపట్టు చూచుకొండు. నాకక్కఱ లేదు. అటునిటు బరుగెత్తుచుఁ బాదము భగ్నమైనట్లు కుంటి కుంటిపడుచుఁదిఱుగుట)

కలవా—(నవ్వి) చెలీ! శుద్ధవైదికపు వెఱ్ఱి యితనియందు రక్తికట్టినది సుమా!

నవమా—(నవ్వి) వీనిచే నింకను గంతులు వేయించి మొఱ్ఱో మొఱ్ఱో యనుపించుదమే!

శిష్యుఁడు—(స్వగతము) భయము వెంటఁబడగానే యెక్కడనేమున్నదియు గనుపడదుసుమా! (ఒకపిట్ట తుఱ్ఱుమని యెగురఁగా మిట్టిమిట్టిచూచుచు) ఓయబ్బా! వెనుకజేరి టుఱ్ఱుటుఱ్ఱుమని నన్నులికించుచున్నారటే కొమ్మలారా! (చంకనున్న కత్తుపాలి యెగిరి యెగిరి ప్రక్కలనువగులగా నులిక్కిపడి) అబ్బో! నన్ను బాడవకుఁడే

దాసీమణులారా! (లేచి ముందుకు బరుగెత్తబోవగాఁ గంటకశాఖయొక్కటి శిఖకుఁ దగుల్కొనుట) మీపుణ్యము, నాజుట్టు వదలుండు మీకు వెయివేల దండాలు. (లేచి భయము నభినయించుచుఁ దిరుగుట)

కలవా — చెలీ! సరకు తెలిసినది. మన మెంతచేసినను నింతే! యీ వెఱ్ఱిబాపని విడిచి యసలువానిమీఁదికిఁ బోవుదము రమ్ము.

నవ — (నవ్వి) చాలుచాలు. అసలంతవడ్డి. వడ్డియంత అసలు. హెచ్చు తగ్గులున్నవని యనుకొనరాదు. సరకంతయు నొకవిధంబేసుమా! (ఇరువురు బ్రహ్మచారిని గవియుట.)

బ్రహ్మ — (నవ్వుచు) మీ దూరక యడావడి బడుచున్నారు. గాని మీనఖరాలి నింకొక్కసారి దోడ్కొని రండు. ముత్తెమంతమాటఁ జెప్పెదను.

కలవా — బాపఁడా! నీకెట్టిబుద్ధి యెవరుగఱపినారు. (బ్రహ్మచారిని చేతులు రెండు పట్టుకొని లేవదీసి) ఏవీ! నీకటిసూత్రయజ్ఞసూత్రంబులేపాటిగట్టివో చూడ నిమ్ము. (ఆ రెంటిని బ్రెంచివేయుట)

నవమా — ఏమి! బాఁపనయ్య పెండ్లికి మంగళస్నానమిదిగో! చము రంటక యుండునటుల నీజందెము నీ మొలత్రాఁడు మాచెలి ముందుగాఁ జక్కపెట్టి తల యంటెగా పట్టు పట్టు (చెంబెడునీళ్ళు శిరసున దిగఁబోయఁబోయుట)

కలవా — అయ్యా! పెండ్లికొడుకువా! మాపిల్ల యొడ్డుపొడవునకే రానట్టున్నావు. పెండ్లికిగాను గొంచె మెదిగింతునా (పిల్లజుట్టులాఁగి మిన్నందఁజేయుట)

నవమా — ఇక్కడఁ బులిభయము మెండుగాని పోపొమ్ము. (వ్యాఘ్రాజినంబు పైనవేసి కప్పుట) (ఒక వెలుఁగు కనుపడుట) (ఇద్దఱు నిష్క్రమించిరి)

కల — ఓసీ! చెలీ! దగద్ధాయమానమగు నీ వెలుఁగులో నా నేత్రంబులు మూతలుపడి పోవుచున్నవె.

నవ — నాకు నంతేసుమా! యెక్కడిదీవెలుఁగు (కళ్ళు విప్పిచూచి) చెలీ! బ్రహ్మచారి యేమాయె! శిష్యుఁడేమాయె!

కల — (నాల్గువంకలఁ బాఱజూచి) ఓసీ! నిజమే! మాయమాయగా మాయమైనారే! (శివుఁడు బహిద్వారంబున నిజస్వరూపంబుతో నిలఁబడుట)

నవ — చెలీ! అడుగో సాంబమూర్తి!

కల — ఓసీ! ఏడీ! నన్నుఁ జూడనిమ్ము (ఇద్దఱు భయసంభ్రమంబులతోఁ దొంగి తొంగి చూచుట)

నవ — చెలీ! మనము కనిపెట్టలేక పోతిమిగదా! యితఁడే యతఁడు.

కల — నేను బ్రెంచివేసిన కటిసూత్రయజ్ఞసూత్రంబు లిప్పటికి లేకున్నవి.

నవ — ఏను శిరసునఁబోసిన గంగ శిరసుననే యున్న దదుగో చూడు.

కల — ఏను సాగదీసిన పిల్లజుట్టు సాగదీసినట్లుగానే యిప్పటికి మిన్నందుచునే యున్నదే.

నవ—ఓయమ్మో! బెదురునిమిత్తము నేను వేసిన పులిచర్మము కప్పుకొనియే యున్నాడే.

కల—ఓయమ్మో! లోపలికి వచ్చునట్లున్నాడే!

నవ—ఓయమ్మో! నాకు భయమగుచున్నయదే.

కల—ఓయమ్మో! మనమేఁగి పార్వతితో సాకల్యముగా దెలుపుదము రావే. (ఇద్దఱు నొండొరులను ద్రోసికొనుచు నోపార్వతీ పార్వతీ యనిపిలుచుచు జపగృహంబుదక్క మొగంబై పరుఁగెత్తుట. పార్వతి ప్రవేశించి).

పార్వ—ఏమితొందర?

కల—ఓయమ్మో! నీతపస్సుపండినదే. (పార్వతి చెవిలోఁ జెప్పుట).

పార్వ—చెలీ! నేనేంత బుద్ధిహీనురాలనే! మీరైన గనుపెట్టకపోతిరిగదా!

నవ—కొమ్మా! వానిమాయ యెన్నటికినైన నీకు గోచరమేకాని మాకా!

కల—(కలకలనవ్వి) అమ్మా! యమ్మాయావటుం డమ్మాయ నంతటిలో ముగించునట్లు తగినబుద్ధి సెప్పితివిగా! సెబాస్!.

నవ—(పకపకనవ్వి కలవాణితో) చెలీ! విశ్వనాథుని ప్రాణనాథునిగఁ జేసికొనుటకేమి యాయాస పెట్టినదే! బ్రహ్మచారిగురుని బ్రహ్మచర్యము నిమిషములో మానిపించినది.

పార్వ—(లజ్జాభయ సంభ్రమములతో) ఓసీ! నన్నేమి నవ్వెదరే! మీరు మీపుణ్యమయ్యెడినిగాని నవ్వుటాల కిదేసమయమా! (మనసులో దండములు పెట్టుచుండుట. శివుఁడు పార్వతియొద్దకుఁ జేరుట)

శివుఁడు—

క. రావే ముద్దులగుమ్మా
రావే బంగారుబొమ్మ రావే కొమ్మా
రావే నీ కౌగిలి నా
కీవే నీ మోవి నానననిమ్మా రమ్మా.

మత్తకోకిలావృత్తము

కలికి రాగదె ముద్దులీయవె కంబుకంఠిరొ నీవు నీ
కులుకుగుబ్బలు నా యురంబున గ్రుచ్చి కౌఁగిట జేర్చవే
మొలకనవ్వులమోముఁ జూపవె మోహనాంగిరొ రాగదే
పలుకవే కలకంఠిరో ననుఁ బల్కరించవె కోమలీ.

చ. నగసుత సిగ్గులేటే మనసు నాపయి నుండఁగ నీ కిదేల నీ
నగుమొగ మొక్కమా రెలమి నాకయి ద్రిప్పుము నన్నుజూడుమిం

పుగ ననవిల్తు తమ్మిపువ్వుములుఁల తళుకులు మొలకలెత్త నీ
సొగసగు కన్నుదోయి కొనచూపులు వేడుకలు నింపవే చెలీ.

పార్వ—(సిగ్గునభినయించుచుఁ జెలియతో)

మత్తకోకిలావృత్తము

సకియ సామికిఁ దల్లిదండ్రులచాటుదాన నటంచు వా
రక నిజంబుగఁ దెల్పరాదఁటె రక్తిమీరఁగ వారికిం
బ్రకటితంబుగ రాయబారముఁ బంపుమం చనరాదఁటే
సుకరలీల వివాహమాడుట శుద్ధపద్ధతి గాఁదటే.

సీ. తగవరు లగుమీరు తగ నెఱుంగని దేది
కులకాంతలకు నిట్లు గూడ దనవె
చిన్నదానను దప్పు మన్నింపవలె నిది
సమయంబు గాదని సద్దియనవె
నగుబాటుగాకుండ నగరాజునొద్దకు
దగువారి నెలమితోఁ దరుముఁ డనవె
సకియరో యింత విచ్చలవిడి తమ కేల
ననుఁ బెండ్లిచేసుకొమ్మనఁగవలదె

తే.గీ. జగము బ్రోగంగ వేడ్కతో సలుపఁదగిన
కార్య మిది యింతమాత్రంబు కరుణతోడ
మనవిచేకొనుమని వేడి మనసుదీరఁ
జెప్పరాదఁటె చెలియరో చెప్పవలెనె.

శివుఁడు—(నవ్వి) సంతోషము. సంతోషము. నీభావము నాకు విశదమైనది. నీ యభిప్రాయానుసారముగాఁ జేయుదును. (ఒకవెలుఁగు మెరయఁగా నందఱుఁ గన్నులుమూయుట) (శివుడు, నిష్క్రమించుట.)

పార్వతి—(ఆశ్చర్యపడి).

చ. కలికి యిదేమొ యీ విభుఁడు గన్నులఁగప్పినయట్లు కొన్ని మాఁ
టలు మొలపించిపోయె నకటా వికటాలని యెంచెనేమొ నె
చ్చెలి యిఁక నేమి చేయుదును జిత్తజు కత్తులు దాకి చిత్తము
త్తలపడు నెట్లుఁ దాళఁగలదాన నతం డెటు పోయెనో కదా.

(పరిక్రమించి)

మ. హరుఁడేడీ యెటుపోయెనే చెలియ యేమైనాఁడొ రాఁడేమొ నా
వరుఁడెన్నాళ్ళకు నాకుఁ గన్పడునె! యీ ప్రాంతంబుల నేడకో
తరుగుల్మంబులలోన డాగెనొ! వినోదంబార బింబాధరీ
మరుబారి న్నిలబార నాతరమె సామాన్యంబుగా సుందరీ.

(ప్రక్కకుఁ దిరిగి పాఱఁజూచి) ఆహాహా! ఏమి! యీ చిత్రము!

తే.గీ. మెఱపు మెరసినచందాన మెఱసి దయితుఁ
డంతలో మాయమాయె నొక్కింతయైన
రూపమంతయుఁ గననైతి రూఢలజ్జ
నెట్లుఁ దోచును నా కింక నింతులార.

పరమేశ్వరుఁడు నా తపంబునకు మెచ్చి సాక్షాత్కరించెనని యనుకొన్నంత సేపైనఁ బట్టలేదు. కన్నెత్తి యీ సుందరాంగునిఁ జూతుననుకొన్నంతలోనే లోన సిగ్గువోడమి యడ్డమయ్యె. కట్టా! నా హృదయేశుం డెందుఁ బోయె; నియ్యాలరంబూఁపొదల సందుల గొందుల నెంత వెదకినఁ బొడకూపఁడయ్యె; నిందు మాళిదర్శనం బెందుఁ గాఁగలదు. మదనదమనుం గానక దీనకళతోనున్న యదను గనుపెట్టి మదనుండు మును పటి పచ్చిగాయంబులమీఁద నిఘుఁడు విచ్చలవిడి పెచ్చుపెటికి క్రొత్త తలిరుటమ్ముల మొత్తమ్ములచేఁ బొడుచుచున్నాఁడు. పచ్చవిల్తుని హెచ్చరిక లబ్బబ్బా! యెట్లు సైతు. (మూర్ఛిల్లుట.)

కల—చెలీ? యింకఁ జూడనేల! మెండైన యెండవేడిమికి వాడిన చెంగలువ కాడ కైవడి వెడవిల్తుని వేడికి వడదాకి సొమ్మసిల్లినది. శీతోపచారంబులు చేయవలె రావే!

నవ—ఓయమ్మా! నిజమే! నాకు ముందుగనే పొడగట్టి పన్నిఁట నానబెట్టిన వట్టివేళ్ళ కట్టలును, గెందామర తూండ్లును, క్రొవ్విరి పూఁజెండ్లును లోనుగాఁగల శీతవస్తువుల సంగ్రహపఱచినాను చూచితే. (ఇద్దరు శీతోపచారంబులు చేయుట)

పార్వ—(మూర్ఛదేరి) ఇస్సీ! అబ్బా!

మ. పతి రాఁడాయెను! నా మనంబు పతిపైఁ బక్వంబుగా నుండె నా
గతి యేమో యిఁక నేమి సేయుదునహా! కాముండు నాపైన తా
శితబాణంబులు వేసెనే! యమగో! యోసీ యమ్మయోయమ్మయో
మితి లేదీతనిబారి కే నెటులఁ దాళ్ళెంగొంకు నిం దుండగాఁ.

(పడమరగా ముఖంబు త్రిప్పి సూర్యాస్తమయమగుట గాంచి)

సీ. తననాథుఁ డేతెంచునని స్నానమొనరించ
నిశి హేమఘటము వార్ధిలయమందు
ముంచెనో యన మున్గె మున్నీఁట రవి దీని
కుచకుంకుమద్రవాంకురము లనగ
సంజగిరలు బారె రంజితంబుగ మింట
నెరులు విడిచెనో నిరులు దొరసె
దీనిపైనుండి చిందిన నీఁటిబిందు
లనఁగ రంజిలె దివిఁ జుక్క లందమలర

(పరిక్రమించి తూర్పుగాఁజూచి చంద్రోదయము.)

తే.గీ. తనదు ప్రియ సిద్ధముగ నుండె ననుచు సకల
కళలతో వచ్చె నిచ్చోటఁ గమలవైరి
(అంతటఁజూచి)
నవ్వుచున్నది యీ రాత్రి నన్నుఁ జూచి
దెసలు దెలుపార వెన్నెల దినుసుతోడ.

(మఱలఁ జంద్రుఁజూచి)

తే.గీ. గగనరమచేతి విరిచెండు గాలకల్వ
కుజము కొనపండు విరహులగుండె లవియ
నంగజుడు వేయు పెద్ద ఫిరంగిగుండు
చక్కగా వచ్చె నీ నిండుచందురుండు.

(కొంచెమూరకొని) కట్టా! విషవింటి దిట్టబెట్టిదంబులగు వెండిచుట్టుమల్లెపువ్వు టీటె బుట్టలంబట్టి గ్రుచ్చెత్తినట్లు ధవళకిరణునికిరణంబులు సోకి చురుకుమని హృదయ మర్మంబులవంటి నన్ను గిజగిజలాడించుచున్నవే. (పార్వతి సొమ్మసిల్లుట)

కల—(బెదరి) చెలీ! యింకను దాపంబు దీరకున్నది. (పన్నీటిపన్నె వంచి పన్నీరు పైనచల్లుట)

నవ—సఖీ! వద్దువద్దు. చూడుమాడు. నీవుచల్లిన పన్నీటి బిందువులు మోహనాంగి తనువుపైబడి కళపళమని యుడుకుచున్నవే. (తాళవృంతముతో విసరుట)

పార్వతి—(సెజ్జనుండి చేతులానుకొని సగములేచి) అదుగో! నాప్రాణేశ్వరుండు. (కౌగిటఁజేర్చుకొన నుద్యమించి యంతలో సిగ్గుపడుచు లేచికూర్చుని) పండు వెన్నెల చిమ్మునకుం దోడు తమ్మికొలంకుల నోలలాడుచు గమ్మతెమ్మెరగూడ వీచుచున్నదే! అబ్బబ్బా! యింతకంటె విషపానంబు మేలు (ప్రక్కనుజూచి) అర విరసిన యా చెంగలువపూబంగరుగిన్నెలోని తేనె విసం బిదుగో యిదిచాలు (అట్లు

చేయఁబోవఁ జెలులిద్దఱును దొలంగించుట) ఇస్సీ! నన్నేల యాపదఁ బెట్టెదరే! (శయ్యమీఁదఁ బవళించి క్రొమ్ముడియూడి జీరాడఁ బొఱలిపొఱలి ఆవేదనతో నేడ్చుచు.)

చ. నిముసమునైన నా మనసు నిల్వఁగఁజాలదు జానలార నా
రమణుని దోడితేగదరె! రాఁతిరి గాతిఁరి లేని యెండలోఁ
గనులిటఁ గ్రేలగించవలెఁ గ్రాఁగిలి వేఁగిలి మారుతూఁపులం
దానురగుచుంటి నా కెటులఁ దోచును వీచును బిల్లతెమ్మెరల్.

కల—(నవ్వి) చెలీ! చూడు! కామాంధకారంబు ముంచుకొన్నకైవడి వీడి వ్రేలాడుము నొడలెల్లఁ గప్పుకొనియున్న కప్పుకొప్పు తన పగవాని పగవాఁడు తనకుఁ బంధుఁడని రాజశేఖరుని సఖ్యంబునకు రాజద్వేషిణి యగుచున్న మన రాజముఖిని గాఁగలించుకొన్న కటికచీకటివలె నున్నదిచూచితే?

నవ—పరిహాసమునకు వేళగాదు, రావే! (ఇద్దరు నొద్దకుఁబోయి పెన్నెఱులు సందెళ్ళంబట్టి ముడివేసి కన్నీరుఁదుడుచుట.)

పార్వతి—(విసుకుఁదలతో) మీకాయాసమేలనే! నాయాస విడువుఁడు, కర్మానుబంధంబట్లున్నాది (మణులఁ గూర్చిన హస్తంబుతోఁజూపుచు) మీర యీ చిన్న చిన్న లతకూనలకు వన్నెగల యీచిన్ని పొన్నగున్నలకు ననురాగంబుతోఁ బరిణయోత్సవంబుఁ జేయుఁడు.

కలవా—అమ్మా! యింతమాత్రమునకే యింత యధైర్యమటమ్మా! ఇదిగో వీణె వినుము. (వీణె మీటుట)

పార్వతి—చెలీ! వద్దువద్దు! దీనికి పైపెరిగి శుకకోకిలంబులు గొంతునెత్తి మఱింత వేదనకు మూలమగుచున్నది. చాలించు చాలించు.

నవ—(నవ్వి) కొమ్మా! యీకొమ్మల సందుల శుకకోకిలంబులు మనకలవాణి చేతి వీణెకంటె నధిక సారవంతంబులైన నీ రోదన స్వరంబులకు సజాతీయ నినాదంబులనెడి శంకచేత బెదరి కిలకిలారావంబులతోఁ జెలరేగుచున్నవి.

కల—కొమ్మా! నవమాలిక యన్నమాట సత్యము. నీకంఠస్వరంబు పైకి రానీయకుము.

నవ—(కలవాణితో) చెలీ! బిత్తఱి నిత్తఱి నిత్తోటలో నుంచుట మంచిది గాదు. (ఇద్దఱును పార్వతిని లేవఁదీసి నడిపించుట.)

పార్వతి—(పదియడుగులు నడచి) ఆహాహా! వడపోసినట్లున్న యీ పండు వెన్నెళ్ళనిగ్గు రోమకూపంబుల వెంటనంటి నాటుకొన్నట్టు నా శరీరంబు చూడరే! విరహపాండురంబైనది. అమ్మమ్మా! యీ వెన్నెల సోకనీయక జిలుఁగువలువ నా పైన ముసుంగిడరే! (చెలులు పార్వతిని బురకా వేసి హస్తంబులు తమ భుజంబు ధరించుకొని నడిపించుట.)

కల—చెలీ! యిది నీవిహారహర్మ్యము చూచితే!

పార్వ—(తలయెత్తిజూచి) యిదుగో! వెన్నెలఱేఁడు మన మేఁడమీఁదనే యున్నాఁడు. వీనిం బట్టుకొని గిరాట్టు వేయుదము.

(సోపానమార్గంబు లెక్కఁబోవుట)

కల—(ఆశ్చర్యముతో) కోమలీ! వీఁడు వెన్నెలఱేఁడు గాఁడు. రాచిలుక గుఱ్ఱపు పాదుషాచేఁతి మండలీకృత కోదండంబు సుమా! అది కళంకము గాదు. చంచరీకశింజణి సుమా! అవి ధవళకిరణంబులు గావు! పుంఖానుపుంఖ సముజ్జృంభమాణమకరకేతననూతనమల్లికాముకుళమార్గణంబులు సుమా!

నవ—(బఱితిమాలుకొనుచు) తల్లీ! యీ విహారసౌధంబులోని కుసుమతల్పంబున నించుక విశ్రమింపుము. (పార్వతి సెజ్జమీఁదఁ గూర్చుండఁ బెట్టుట)

పార్వ—(నలువంకలఁ బాఱఁజూచి దుఃఖపడి) ఇవి నాచుట్టునే యున్నవే! చంద్రమండలంబులు!

కల—(నవ్వి) చెలీ! చంద్రకాంత మాణిక్య కుడ్యంబులఁ బ్రతిఫలించిన నీ వదనబింబంబులుగాని చంద్రబింబంబులు గావుసుమా!

నవ—కండ్లుమూసికొని యించుక పవళింపుము.

పార్వ—(విసుకుఁదలతో ముందుకు నడచి కనకవేదికమీఁదఁ గూర్చుండి చంద్రు నుద్దేశించి కోపముతో దృష్టినిలపి మూఁతివిరచి మెటికలువిరచి) ఓరీ! చంద్రా! నీ గుణంబెల్లఁ దెల్లంబయ్యె. ఆహాహా! నీచేయు సత్సాంగత్యంబుచేతనైన నీజడత్వంబు వదలకున్నదిగదా! నీవు రాత్రివేళలం దిరుగుచు హిమంబుమియు ఫలంబు దమ్ముల ననాథలైన సత్సతీ తిలకమ్ములను బ్రశస్తచక్రమ్ములను బీడించుటయేకా! యిట్టివాఁడవఁని యెఱింగియే హంసవాహనుండు నిన్ను వృద్ధిక్షయముల నొనర్చియు, శశశృంఖలా బంధంబుల పాలుజేసి యనుదినము సముద్రంబున ముంచుచుండును. చాలుచాలు! చందమామా! మొగమైనఁ జూడక యింత వెగటుపఱచుట నీ కందమా!

(మన్మథు నుద్దేశించి)

తే.గీ. మనసులోపల మెలఁగుచు మఱచినావొ
మనసు నొప్పింతు వేలరా మనసిజాత!
'చన్నె కుడిచి రొమ్మె గ్రుద్దు' నన్న విధము
చెడక నీ యిల్లు బాగుగాఁ జేసికొనుము.

(మందమారుతము నుద్దేశించి)

తే.గీ. ప్రాణబంధుత్వమంతయుఁ బాడుచేసి
సతుల నీ విట్లు గాలిపిశాచ మనఁగ
వదల కంతకంతకుఁ గాసిపఱచఁ దగునె
మందమారుత నీ కింత మహిమ గలదె.

(శుకపికాదుల నుద్దేశించి)

ఉ. కొమ్మలసందునం దిరిగి కొంకక వాక్సరసత్వ మెప్పుడు
న్నమ్మగ నేర్చికొంటిరను కల్పన లిప్పుడు దెల్లమాయె మీ
రిమ్ముగ మాటమంచితన మించుక గ్గొనను జూపలేక మా
కొమ్మలపట్లఁ గూడ దిటు గూయుట కోకిలమా శుకాధమా.

(మధుపముల నుద్దేశించి)

ఉ. తుమ్మెదనంచు నే పనిని దోఁచఁగనీయక తారుమారుగా
దొమ్మికి వచ్చినట్లు పరిశోభ్రమణంబుల నారితీరి ఝుం
ఝుమ్మని వాగుచుం దరుణ చంపక నాసలచెంతఁ జేరదే
నెమ్మదిగాఁ దొలంగు మిఁక నీ కిది మేలుసుమీ మధువ్రతా.

(మయూరముల నుద్దేశించి)

చం. పురి నెరికిచ్చి యాడెదవు పొంకము బింకము నీకు నీలకం
ధర శుభనామధేయమును దాల్చియు గేకలు వేయుచుంటి వి
కట-రణిని సిగ్గుమాలిన శిఖండివిగావె మయూర యూర నీ
స్వరములు దుర్విషోగ్రములు ప్రాణములోఁ చఱపు మాన మెందవే.

కల—నవమాలికా! యంతకంతకు దొంతముదిరి యూసరవిల్లి యగుచున్నయది. మన చెలి నింతట దోడ్కొనిపోయి మేనకా హిమవంతులకు నొప్పగించి యీ వృత్తాంతమంతయు వినుపించుదము రమ్ము.

నవ—అదే మంచిపని. (పార్వతిని చెయ్యిబట్టుకొని లేవఁదీసి) పార్వతీ! యింటికిఁ బోదము రమ్ము. (అందఱు నిష్క్రమించుట.)

గద్య: ఇది శ్రీతర్క వేదాంతాది సకలతంత్రస్వతంత్ర శ్రీమ దనుగమభట్టాచార్యాది ప్రసిద్ధబిరుదాంకిత శ్రీమ దభినవగౌతమావతార శ్రీ కురుగంటి వెంకట్రామశాస్త్రి కంఠీరవ పౌత్ర శ్రీ కురుగంట్యప్పయ్యశాస్త్రిపుత్ర శ్రీ వెంకమాంబికా సతీతిలక గర్భశుక్తి ముక్తాయమాన శ్రీ హరితసగోత్రపవిత్ర శ్రీమ దుభయభాషా భూషాయమాన లలిత కవితాధారా ధారాళ యశోవిశాల సహజపాండిత్య సాహిత్య శ్రీ బాలాత్రిపురసుందరీవరప్రసన్న బుధజనవిధేయ శ్రీ కురు గంటి సూర్యనారాయణశాస్త్రి నామధేయ ప్రణీతంబులగు సత్కృతులలో నగ్రగణ్యంబగు కుమారసంభవ నాటకంబునఁ చతుర్థాంకము సమగ్రము.

    

# కుమారసంభవము

## పఞ్చమాఙ్కము

### ప్రథమరంగము : ప్రవేశకము

ఓషధిప్రస్థపుర వీధి

ప్రవేశము—వజ్రనఖుఁ డను తారకాసుర మంత్రి.

వజ్ర—(ఆశ్చర్యపడుచు స్వగతము) రహంతయైనఁ దెలియకపోయె గదా! యిప్పుడుగదా మనకుఁ దెలిసినది! తుట్టతుదకు సురలెట్టి విశ్వాస ఘాతకులైరి! తారకుండు నిరంతరమానసికశివపూజాప్రభావసంపన్నుఁడై సహస్రబ్రహ్మాండంబులకు నేకచ్ఛత్రాధికారంబు నిర్వర్తింపుచుండినను బురందరముకుంద శతానందాదులను దన యాజ్ఞకు లోఁబడి స్వేచ్ఛాసంచారు లగునటుల ననుగ్రహించుటం జేసికదా; వీరిట్టి దురాలోచనలకుదొరకొనిరి! శెబాసు! శెబాసు! బహిర్ముఖులైరి కదా యని మా కందఱకు నించుకంత యేమఱుపాటు గలుగుటవలన వీరి దుస్తంత్రంబులిట్లు కొనసాగుచున్నవి. యేమీ విచిత్రము! విరూపాక్షుండగు నయ్యూర్ధ్వరేతస్కునకుఁ దమ్ము నుద్ధరించెడు కుమారుండు పుట్టఁగలఁడనియట; తృషితుఁడు పిపాసోపశాంతికి నిర్జలక్షేత్రమునఁ గూపఖననార్థము ప్రయత్నపడినట్లు కొండకు నాగలిపట్టించుచున్నవారు; వీరు సుమనోనామధేయమును విరుద్ధలక్షణకులక్ష్యముగాఁ జూపుచున్నవారు. (కొంచె మాలోచించి) ఎందుకు! ఎందుకు! ముందున్నది ముసుళ్ళపండుగ! (ఆశ్చర్యముతో) ఆ! ఆ! అప్పుడే తపమునకుఁ గూర్చుండుట! కాముఁడు భస్మమై పునర్జీవితుఁడగుట! వివాహము నిశ్చయమగుట! యివి యన్నియు నొక్కమాఱుగా నయినట్లున్నది. ఆశ్చర్యము! ఆశ్చర్యము!

(అజాముఖి యను తారకాసుర సోదరి ప్రవేశించుట)

అజా—నావచ్చిన కార్యము నేను జక్కబెట్టుకొని వచ్చినాను. మన కిఁక నిర్భయమే సుమా!

వజ్ర—నీ వీ చల్లనిమాఁట చెప్పుటంజేసి నాగుండెలు చల్లపడినవి. యేమి పెండ్లివారబ్బబ్బా! యిట్టి పరిథవ మెక్కడను జూడలేను. ముప్పదిమూఁడుకోట్లు బృందారకులు, నంతను వెయిరెట్లు ప్రమథులు, నరుపదివేవురు స్వర్లోక వేశ్యాకాంతలు కిన్నరకింపురుష సరగరుడోరగాదులు, తక్కుంగలవారందఱో వీరినందరిని దఱిమించుకొని చక్రధరుఁడు పెండ్లిపెద్దగాఁగఁ జతుర్ముఖుఁడు యాజ్ఞికత్వము వహింప వృషభ

వాహనారూఢుండై, భృంగి పరిహాసచర్యలకు వినోదపడుచు మంగళతూర్యనినాదంబులు భూనభోంతరాళముల నిండుకొన గంగాధరుండు కళ్యాణరూపుండై బహువిధపరిషవములతో నీ హిమవంతునికూతుని వివాహమాడుటకు వచ్చుచున్నాడు. దీన మనకు ముందుగడు(బత్యవాయము దోచుచున్నది. యీపరిణయమెటుల సంఘటితమైనదబ్బా! దీనిమూలము నీకు సమగ్రముగా విదితమైనదా!

అజా:—నేను వచ్చిన తరువాత విదితము కాని యందునా! దైత్యారి ప్రోత్సాహ మధికముగుట చేసి మన శివుడు సంబంధ నిశ్చయమునకు సప్తమహర్షులను నందు వశిష్ఠపత్నిగూడ గనుంధతిని బంపినవాడట.

వజ—ఆ! ఆ! శంఖమునం బోయమిం దీర్థము కాదనునట్లు వారికి మన దైత్యారి లేని కార్య మున్నదా! "హేమ్నః పరమామోద" యన్నట్లే సరి కాని రుద్రుని పెండ్లికి రోదనసంఖ్యతో నుండెడి వీరు పోవుట తగును! వీరితోగూడ నా ముసలమ్మ యేటికి ?

అజా—ఏటికా! యింతమాత్రము గ్రహింపలేవా!

వజ—(విమర్శించి) ఆ! తెలసె. తెలసె. తనపని తనకు మొదటనే నెరవేరినది గదా యని యిక పెండ్లికొడుకు చూపులకు వా గపేక్ష పడకుండులాగునం బెండ్లికూతుని తల్లితో సద్ది మంత్రించి చెప్పుటకేకా! ఆబిడ మహానిపుణురాలు!

అజా—అదుగో యన్న కిటుకదే సుమా! హిమవంతుడు జడుడు. వాని భార్య మేనక యొరులు చెప్పెడిమాటలు వినునది.

వజ—సరి! మేళము కుదిరినది! తరువాత.

అజా—రాయబారు లిక్కడ సమయోచిత సంభాషణంబులతో నిక్కన్యాదాతలను మెప్పించి యొప్పించి సుముహూర్తనిశ్చయమునుగూడం గావించికొనిపోయిరి.

వజ—సరి! కన్యాదాతల ప్రయత్న మేపాటి ?

అజా—అపరిమితపాలావారము మహామేరునకు సల్లుడుకూతురు. వారి కేమి కొదువ!

వజ—(ఆశ్చర్యములో) యిట్టి సీటులమీంది పెండ్లి కాకుండ జేయుట కడు దుర్ఘటము సుమా! యెట్లు చక్కపెట్టుకొని వచ్చినావో చిత్రముగా నున్నది.

అజా—ఏమిచెప్పుదు! వజ్రనఖా! యేను నెక్కడనో విన్నాను. విన్నతోడనే

చ. తన కొక కీడు వచ్చెడివిధం బెదకుం బొడగట్టు నేనిం దా
మునుకొని దాని మూలమును మొక్కపుడే పెకలించివేయ మే
లనువగు నంద్రుగాన మనసారంగ నే నిట మాయురూపుతోం
జని శశిమౌళిపెండ్లి కొనసాగకపోవువిధంబ యెంచుచున్.

మాయన్న యనుమతింగొని

చం. తన సుతపెండ్లి చేయునెడం దల్లికి నల్లుని లక్షణాలవు
ట్లను బెడిదంపుం బట్టుదల లగ్గుగ నుండెడుంగాన నివ్వథూ

జననికిఁ గొన్ని కొన్ని చెడుసంగతు లాత్మకు నాఁటఁబల్కి యా
త్రినయనునం దసహ్యత విధించితిఁ గన్నియ నీయకుండఁగన్.

వజ్ర—(పకపక నవ్వి) అజాముఖీ! యెంత పన్నాగము పన్నినావే! మేనక నీమాఁటమీద నిల్చునా!

అజా—పెండ్లివారువచ్చి గొంతుకమీఁదఁ గూర్చున్నట్లు గూర్చుందురుగాక! యిటుసూర్యుఁడటు పొడిచినను మేనక నామాఁట కడుఁగుదాఁటునా! లగ్నము వేళకుఁ బిల్ల నీ వరునకు నీయనని తిరుఁగఁబడును. పెండ్లి కానేరదు.

వజ్ర—(నవ్వి) నీకట్టి మంత్రంబుఁ జేయుట కెట్లు సందర్భపడె నబ్బా!

అజా—అయ్యరుంధతిభర్తకుఁ బ్రత్యర్థియగు విశ్వామిత్రుని భార్యయగు కుముద్వతి రూపంబుఁ గైకొని యత్యాప్తురాలివలె నటించి యేకాంతంబున వరుం డంధకారియని జటాత్మధరుండని యూర్ధ్వచేతస్కుండని పశుపతియని పురదాహకుండని కాపాలికవృత్తితో నుండువాఁడని యొక మందాకినిని నెత్తి నెక్కించుకొన్న వాఁడని హృతకాముఁడని యిట్లు అనేక దోషారోపణములు నిరూపణంబుఁజేసి కన్యాదాన పాత్రుండు కాఁడని యా మేనకచెవిలోఁ నాఁటఁ బలికి వచ్చితిని.

వజ్ర—భళా! నీదే శక్తి! పీఁటలమీఁదిపెండ్లి పడఁగొట్టుటకు నీతరువాతనే యుండఁదగును!

అజా—యిప్పటికి సాధ్యమగునంతటి కార్యము చక్కఁబడినది. అంతగా మన మంత్రము పారకపోయెనా! మన మాయాబలంబునఁ బార్వతి గర్భంబున గర్భోత్పత్తి కాకుండునటుల నప్పటికిఁ బ్రయత్నింతము.

వజ్ర—అవును. అ దేబాగున్నది.

(తెఱలో మంగళవాద్యము)

(యిద్దరు చెవులొగ్గి)

అజా—ఏమది!

వజ్ర—ఉండు! ఉండు!

(మఱలఁ దెఱలో)

చ. కరము మనోహరమ్మలగు కౌతుకవాద్యము లుల్లసిల్ల బం
ధుర పరివారవర్గములతోఁ గల తోరఁపువైభవాలతోఁ
దరలి పురారిపెండ్లికి నుదారముగా నగుఁదెంచి వీరిచే
వరవరపూజ లందికొన వారక చూచుచునుంటి మియ్యెడన్.

అజా—(నవ్వి) అదే! మేళముసుమా!

వజ్ర—ఆ! అదుగో! పెండ్లివారప్పుఁడేవచ్చి వరపూజకు నిరీక్షించుకొనియున్నట్లున్నారు.

అజా—(ఆశ్చర్యముతో) లగ్న మీదినమేకాఁబోలు!

(మఱలఁ దెఱలో)

చ. వరుఁడు పురారి నన్ను బహు వత్సలభావముతోడఁ బిల్చి యా
గిరివరునింటి కీవ పరికింపక యింపగు లగ్నపత్ర మి
త్తరి గొనిపొమ్మటం చనుఁపఁ దత్పరతం జనుచుంటి వార లీ
వరునిగుణాలు న న్నడుగ వచ్చిరియోని వచించు టెట్లొకో.

వజ్ర—వింటివా! యావరుని పరిచారకుఁడు భృంగియనువాఁడు లగ్నపత్రిక తీసుకొని వరపూజార్థము కన్యాదాతలను బిలువ వచ్చుచున్నాఁడు. మనమిక్కడ నుండరాదు.

---

## ద్వితీయ రంగము

### రాజగృహము సీన్

ప్రవేశము—హిమవంతుఁడు: మేనక.

**హిమ**—కన్యాదాన పాత్రుఁడు మన పూర్వపుణ్యంబునఁ బరమేశ్వరుండు లభించె. పెండ్లివారు మఱలఁ గదలెడిదనుక నీవు సహస్రముఖంబులఁ దిరుగవలె.

మేనక—వారి పరమేశ్వరత్వము వారికే యుండనిండు. నేను సహస్రముఖంబుల నుండనేల?

**హిమ**—ఏమి యీవిరసము?

మేనక—విరసములేదు, సరసములేదు: చేసినదంతయూ పరుషమే.

**హిమ**—పరుషమేమి వచ్చినది?

మేనక—ఔరా! పురుషకారముఁ గోరువారికిఁ బరుషముకనఁబడునా?

**హిమ**—చాలుచాలులే. పెండ్లివారు గడపముందఱ కరుగుఁదెంచెడి వేళ కిట్లు యితివేమి?

మేనక—ఇంక నెట్లుఁగావలె? మాయికు లమాయికులను మాయలోఁ బడఁ ద్రోయుట కడు సులభము.

(మైనాకుఁడు ప్రవేశము)

మైనా—తండ్రీ! యింకను బెండ్లివారి యాగమనంబు కర్ణగోచరంబుగాకున్నది: కారణమేమో!

**హిమ**—పుత్రకా! రాక యేలపోదురు! మీతల్లి పెడసరఁపు మాఁటలువింటివా

మైనా—(ఆశ్చర్యముతోఁ దల్లితో) ఏమీ! ఏమివచ్చినది?

మ. జననీ నీ కిది న్యాయమా విను మహా సౌజన్య సౌభాగ్యము
ల్గొనువాఁ డీ వరుఁ డేమి సంశయము నీకుం దోచదా యీఁడు వ

చ్చిన దీ కన్నియ యింక నొండుగల డా చిన్నారి కీతండె పో
లినవాఁ డమ్మ మనోవికాసముల నోలింజూపు చీ వుండుమా.

మేనక—(అసహ్యత నభినయించుచు) ఛీ! ఛీ! వెదకి వెదకి తెచ్చితిమి వరుని! నాకన్న చిన్నారిని జేతులార వీనికిచ్చుట చూడఁగ

మ. తనయా నాకు రుచింపకున్నది యథార్థం బిప్డు సర్వంబు విం
టిని సన్న్యాసికిఁ బెండ్లి యేటికి వధూటీరత్న మీయ న్జగం
బునఁ బాత్రుం డిఁక లేఁడొకో మునులు బల్మోసంబుగావించి రీ
తని కీనొల్ల నిదెల్ల కల్ల తగు నీ తండ్రి న్నివారింపఁగన్.

హిమ—(మైనాకునితో)

ఉ. పుత్రక యేమి చెప్పుదును బుత్రిక నిత్తుమటంచుఁ జెప్పి వి
తత్రపవృత్తి నుండి యనృతంబున కే నెటు లోర్తు నీ విటం
జిత్రముఁ జూడుఁమీ చటులచిత్తము దీనికి నెట్టు లబ్బె ని
మ్మాత్రము దోఁచదాయె మనమాన్యతదక్కునె మాటదక్కునన్.

మేనక—ఏమైనఁ గానిండు. కన్యామణి నీవరునికీయ సంకల్పించుట కడు ప్రమాదము. నిష్పక్షపాత దూరదృష్టితోఁ బారఁజూచిన సర్వము మనోగోచరము కాఁగలదు. వేరచెప్పనేటికి? సుముహూర్తముగానీయను. నన్ననకక్కరలేదు. మీరింతనయిన మేల్కొనుఁడు.

హిమ—

ఉ. నిన్నఁటిదాఁక నొప్పికొని నీమముఁ బాయుచుఁ బెండ్లినారు రా
నున్నపు డిట్లు మించి సుముహూర్తము నీయనటంచు మూర్ఖపుం
బన్నముఁబట్టి నాన పదిమందియు నవ్వరె లక్షణంబె సం
పన్నుల కౌర!

(మైనాకునితో) నీ జననిపౌరుష మిట్టిద యేమి చేయుదున్.

మైనా—(తండ్రితో) జనకా! మాతల్లి యానుకూల్య మీవెఱుగవా! ఎవరో కుటిలోపదేశంబులు పటుతరంబుగఁ జేసియుందురుగాని శాంతికేమి? మదీయోక్తియుక్తి సుధాపూరంబుల మజ్జనని హృదయమందలి మాలిన్యంబుఁ గడిగివైచెద.

(తల్లితో)

ఉ. అమ్మ! ఇదేమిటమ్మ! మన మల్లరిపాలయిపోమటమ్మ! వా
రిమ్ముగ వచ్చువేళ నిది హెచ్చుగ నిచ్చఁదలిర్చ వమ్మ నీ
కిమ్మెయి నుంట పోల దిఁక నెవ్వరు నిన్నిటుఁ జేసిరమ్మ! రా
వమ్మ! వరుండు నా యనుజ కర్హుఁడు గర్హ్యుఁడఁటమ్మ! నమ్మవే.

మేనక—

చ. తగఁడు కుమారికీ వరుఁడు తథ్యముఁ జెప్పెను రెవ్వరైన ము
జ్జగము లెఱుంగు నల్లపుడు సప్తమహర్షులు మోసపుచ్చి రి
మ్ముగ మన ముద్దుగుమ్మ నల బూచుల రేపికిఁ జూచిచూచి లోఁ
బొగలుచు నెట్టులిత్తు మెదపొంగదు చేఁతులు రావు పుత్రికా.

మైనా—తల్లీ! వివాహకార్యంబులపట్ల వధూవరుల యోగ్యతాయోగ్యతలు ముందుగనే విచారణీయంబులు గాని తుట్టతుదకు ముహూర్తవేళకుఁ గావు. తథాస్తని సిద్ధాంతీకరించినట్లుఁ గార్యంబునకు నుభయప్రయత్నములు సిద్ధమై ముడిబడు సమయంబునఁ బునర్విచారణంబులకుం జొచ్చుట రసాభాసంబునకు మూలమయి యపవాదములకాస్పదము కాదా! అసూయ మదమాత్సర్యగ్రస్తులెవరీ వరునియందు దోషారోపణంబు లాపాదించి నీమనసు విఱిచిరో! బ్రహ్మర్షులు బ్రహ్మసమానులు బ్రహ్మర్షులు వచ్చి నిశ్చయించినదానికీ సందియ మేటికి?

మేన—ఎంతవారైననేమి? అనుసంధానకర్తల పలుకులెల్ల టంకపుఁబొళ్ళే సుమీ! వరుని లక్షణాలెల్ల నిటీవల నాకు స్పష్టపడినవి. రావలదని తిరుఁగఁగొట్టుడు.

మైనా—వాగ్దత్త మనోదత్తయగు కన్యారత్నము మదిష్టసలమునం దిచ్చుట యిహపర సాధకంబై దాన సాద్గుణ్యంబు జెందును గాని మాఱుత్రోవఁ ద్రొక్కినచో మాఱుమను వనిపించుకొనదే!

మేన—పుత్రా! నీవు విశేషజ్ఞుఁడవు కావు. నీతండ్రి యెఱుఁగని దేమున్నది? స్త్రీ పునర్వివాహములే వేదశాస్త్రసమ్మతములగునపుడు దీన నేమి దోషము?

మైనా—స్త్రీ పునర్వివాహములు వేదశాస్త్ర నిషిద్ధములు. వాగ్దత్తయైనను మనోదత్తయైనను ప్రథమోద్దిష్టవరునందు శాస్త్రోక్తదోషంబులు వొడకట్టెనేని కన్య నన్యవరుని కిచ్చుట విధియనెడి ధర్మశాస్త్ర మాపద్విషయముగా బోధించుచున్నది సుమా! మనకేమి?

హిమ—(పరిహాసముతో) ఆహాహా! ఏమివివేకము!

శ్లోకము.

"నష్టే మృతే ప్రవ్రజితే క్లీబే చ పతితే పతౌ
పంచస్వాపత్సు నారీణాం పతిరన్యో విధీయతే"

అను పరాశరస్మృతి వచనమొక్కటియు బాహ్యార్థముంబట్టి యిట్లే యనేకుల భ్రమపెట్టుచున్నయది దీని వాస్తవార్థము కనిపెట్టుట కడు దుర్లభము.

మైనా—వాగ్దత్త మనోదత్తయైనను యథావిధి దత్తప్రాయురాలే! భేదమేమున్నయది? తండ్రీ! మీరనినట్లు పురుషులే యపార్థములఁ గైకొనుచుండ స్త్రీలపట్ల సంశయమేటికి?

మేనక—నా గ్రహించునది పరమార్థముగాని యెన్నఁటికి నపార్థముగాదు. పరాశరుడు, చెప్పిన యైదాపదలలో నొక్కొక్కటియే యన్యపతిప్రదానమునకు మూలము

గదా! యందు తొల్లింటివి రెండు నీవరునియందు లేకున్నను గామ్యకర్మసన్న్యాస పూర్వకముగ నూర్ధ్వరేతస్కుం డగుటంజేసి ప్రవ్రజితత్వంబును బుంస్త్వాది లింగరహితుండగుటంజేసి క్లీబత్వంబును గర్మశూన్యుం డగుటంజేసి పతితత్వంబు నిమ్మూడు దోషంబులు నిరాటంకముగఁ గనుపించుచున్నవి. ఇట్టివాని బరిహరించి సద్వరుని గ్రహించినచో నేమి ధర్మహాని ?

మైనా—తల్లీ! ధర్మశాస్త్రంబుల సంప్రదాయంబులఁ గనిపెట్టుట కడు దుర్లభము. సర్వేశ్వరునందు నెట్టి దోషంబులు లేవు.

మ. నతుఁడ న్నా వచనమ్ము నమ్ము జననీ నష్టేమ్మృతే యన్మహా
స్మృతిఁ జూడ న్బరివేదనాదివిషయంబే కాని వేఱొండు కా
దితరం బెంచరు వాదు రానియకు వా రీలోన రానుండి రీ
వతి మోదంబున సాగనిమ్ము శుభకార్యం బీ వరుం డొప్పఁడే.

ఇప్పుడు మనము నిశ్చయించుకొనిన యీవరుండు దివ్యమంగళ విగ్రహుండు ననంత కళ్యాణగుణవిష్ణుండు నతని ప్రభావంబు బ్రహ్మాదులకు నగోచరంబు, యతనిపాదంబులఁ గడుగుట మన పురాకృత సుకృత పరిపాకంబు. నీవనిన యపచారంబు లన్నియు మఱచి పొమ్ము.

మేనక—(విమర్శించి) నీవును నీతండ్రియు నామాఁట యిప్పుడు వినరు. వరుని జూచిన వెంటనే నామతమునే యవలంబింతురు.

హైమ—ఆ! ఆమాఁటమీఁద నిలఁబడియుండు.

(కోలాహలుఁడు ప్రవేశము)

కోలా—(సత్వరము.)

ఉ. వచ్చిరి పెండ్లివారు బహు వైభవ మొప్పఁగ రాజవీధిలోఁ
బొచ్చెము లేక నిచ్చె వరపూజకు నై మనరాక గోరుచున్
హెచ్చిరి చూచితీరవలె హెచ్చరికల్ శుభలేఖ బ్రాహ్మణుం
డిచ్చటి కేగుదెంచి మనయింటి యళిందముఁజొచ్చె నక్కరో.

(భృంగి ప్రవేశము)

భృంగి—(మార్గములో స్వగతము) నాలో నాకే నగవువచ్చుచున్నది. నేల యీనినట్లింతమంది యుండినను దుదకు లగ్నపత్రిక గొనిపోవ నేనే కనుపడితిని. చవిటికి సున్నానకు నేనేఁ దొరకితిని ఆ! (విమర్శించి) శివునుద్దేశ మిప్పుడు పొడగట్టినది. లగ్నపత్రిక నెపంబున నింకొక మాటీ లోపల బోయివచ్చితినా పెండ్లి కూఁతుని పెండ్లివేషంబులోని రూపరేఖావిలాస విభ్రమంబులు గ్రుచ్చి గ్రుచ్చి నన్నడుగ వచ్చుననియే సుమా! (వక్షమున హస్తముఁజేర్చి) అమ్మా! ఎంతవాఁడు! పెండ్లి కొమరునితోఁ గూడనుండి గౌరవముఁ బెందుదుననుకొంటి! నాయుద్దేశమును సామర్థ్యమును గనిపెట్టఁగపోయె. ప్రభువుల మర్యాదలిట్లే! వినవాని కాఁకులోను

గానివానికిఁ గంచములోను! కానిమ్ము. (పరిక్రమించి) శుభలేఖ చేఁతి కిచ్చిన తోఁడనే వరసంపత్తి యెట్టిదని వారెవ్వరైనఁ గదల్చిరా యున్నదున్నట్లు పగుల వేయుదు. కానిమ్ము! కాకపోనిమ్ము! (ముందుకు నడచుట; హిమవంతు డెదుర్కొనుట).

హిమ—రండు భృంగీశ్వరా! (అందఱు నుచితాసనముల గూర్చుండుట)

భృంగి—కులమహీధ్రేంద్రా! రజతమహీధరేంద్రంబునుండి వెడలివచ్చి మీ పెండ్లివారు పురవీధి శృంగాటకమునందు విడిసిరి. ఇఁక మీదే యవశిష్టము. ఇదుగో శుభలేఖ. (ఇచ్చుట)

హిమ—(గ్రహించి చదువుకొని) బహుసంతోషము! (పరిక్రమించి) ఇక నీవు బహుచాకచక్యముతోఁ దిరుగవలె.

మేనక—నా చాకచక్యమేమి నాథా! ఈ పారుని గొంచె మడఁగదలఁచితిని.

హిమ—(కసురుకొని) పోయినపాడవ్వ నడుగుటకుఁ దనివిలేదు. కానిమ్ము.

(పార్వతివచ్చి తల్లియొద్దఁ గూర్చుండుట)

మేనక—(చింతా సంతోషముల నభినయించుచు భృంగితో) విప్రవర్యా! పెండ్లికూతు రిదుగో యెఱుఁగుదువా!

భృంగి—(నవ్వుచు) నాఁడే యెఱుఁగుదును (పార్వతి సిగ్గుతో ముసిముసి నవ్వులు నవ్వుచు నూరకుండుట)

మేనక:—పెండ్లికుమారుని వేషమెట్టిది? యేపాటివాఁడు? మాచిన్నదానికిఁ దగిన వాఁడేనా!

భృంగి—(పార్వతిదిక్కుఁజూచి సంశయించి) ఇప్పుడెట్టివాఁడైన నేమిలాభము?

(పార్వతి భృంగివంక నసూయతోఁ జూచుట)

మేనక—(విచారముతో) ఏ సుమి! అనుకొన్నంత నిజమే. ఎందుకు! వరుని మొదటఁ జూడకపోవుట మావారిదే లోపము!

కోలా—(ఆశ్చర్యముతో) ఇదియేమి యాచారమయ్యా! (సంశయించి) పెండ్లి వారి దేమాత్రపుఁ బటాటోపము?

భృంగి—విశ్వేశ్వరుండు వరుండని యెఱుంగవా! నీ వెవరవయ్యా!

కోలా—ఏను బెండ్లికూఁతుని మేనమామను; కోలాహలుండను.

భృంగి—ఒహో! మహామేరుని పుత్రుఁడవా! ఏమి సంశయించుచున్నావు?

కోలా—మీకులేని సంశయము మాకేల? సర్వజ్ఞసన్నిధానవర్తివి. నీకు రెండవ వాఁడు తోఁడు దొరకలేదా!

భృంగి—సత్యము. మావరుఁ డొకఁడే యేనూ, నొకఁడనే. మామాఁట సాగుఁ గాని మీమాఁట సాగునా!

కోలా—ఔనయ్యా! నాకెందుకు! (భృంగి వినకుండ మేనకతో)

ఉ. అక్క వితండవాది యితఁ డక్కరమాటలు చెప్పలేడతం
డిక్కఁడ కేగుదెంచె మన మిప్పుడ చూడగఁబోవనుంటిమ

మ్మక్క మఱొక్కమా అడుగ నక్కడక్కడ కెక్కుఁడౌఁ జుమీ
టక్కరిబాపఁ డీతనిఁ గదల్చక తల్చక పోవనిండొగిన్.

భృంగి—ముంజేతి కంకణమున కద్దమేల! నన్నియు నింకఁ గొంచెములో మీకే తెలియును ద్వరితముగ వెడలిరండు. (భృంగి నిష్క్రమించుట.)

కోలా—(హిమవంతునితో)

చ. వినుఁడు వివాహకార్య మిది వీరులు శూరులు వచ్చినారు మీ
రనయముఁ గార్యమాదనుక నన్నిటికిం బహు జాగరూకులై
వినయ మెలర్పనుండి తగువేళల లోపము లేక వారలన్
దనుపుచు నోర్పుతోఁ బరువుదక్కఁగనిం డిఁక లెంపు భూధరా.

హిమ—అదేమిటోయి!

ఉ. మిక్కిలి నీవు చెప్పగల మెళుకువలన్నియు విప్పిచెప్ప నీ
యక్కకుఁ జక్కఁగాఁ దెలుపనక్కఱ లేదిది మాకు నేరికిన్

కోలా—

నొక్కవచింతుఁగాని మదినొచ్చిన నే నెటుఁ జెప్పనేర్తు మా
యక్కకు నన్నియుం దెలియు నక్కఱపట్ల వచించితిన్ దగన్.

మైనా—(నవ్వి) మామా! మనపార్వతి వివాహము తుదకు జగన్మోహనముగా నగును.

మేనక—ఆమాఁట యిప్పుడుగాదు. వరుని జూచిన తరువాతఁ జెప్పుదును.

తే.గీ. కన్నె నిచ్చెడివేళను వన్నెమీఱ
నేమి భాగ్యంబు లుండిన నేమి ఫలము
వరునిలక్షణ మొక్కటీ యరయ నదియె
చాలు నన్నియు దానితోఁ బోలియుండు.

హిమ—(నవ్వి)

తే.గీ. మనము మది మంచిదని యెంచ మంచిదగుచుఁ
జెడ్డదని యెంచి విడువఁగాఁ జెడ్డదగును
పురుషునకునైన స్త్రీకైనఁ బూర్వపుణ్య
మొక్కటియె ముందు నడుచును నిక్కువంబు.

అనంతరకరణీయమునకుఁ బోదము రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

## తృతీయ రంగము

### రాజగృహము : స్థలాంతరము

ప్రవేశము—(పీఠంబునఁ గూర్చుని వ్యాఘ్రాజినంబు గప్పుకొని చంద్రకళాంకిత జటాబంధముతోఁ గళ్యాణవేషంబు ధరించి శివుఁడును, పార్శ్వంబున యాజ్ఞికవేషంబుతో బ్రహ్మయు, నెదుట భృంగియు)

శివు—(చిరునవ్వునవ్వుచు బ్రహ్మతో) లోకములోని సమస్తజనులు మదీయ పాణిగ్రహణోత్సవంబుఁ జూడవలెనని వచ్చియున్నారు. భూధరేంద్రుని బంధువర్గంబులందఱు వచ్చియున్నారు భారంబంతయు నీయందయున్నది. బహుజాగరూకుండవై తొందరఁజేసి సుముహూర్తంబు వేళకుఁ బాణిగ్రహణం బగులాగునఁ గార్యంబు నిర్వహింపుము.

బ్రహ్మ—స్వామీ! నాయాలస్యమేమున్నది! మనపనియంతయుఁ బూర్తి చేసికొన్నాను! వారిక్కడకు వచ్చుటయేతరువాయి. (లేచినిలుచుని) యింకను రారేమి? (తొందరగా ద్వారంబుఁజేరి) ఓహో! నగరాజా! సుముహూర్తము సమీపించుచున్నది. యేల యీ యాలస్యము ?

(హిమవంతుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

హిమ—(చేఁతులు జోడించి) ఆర్యా! ఇదుగో వచ్చె వచ్చె! కొంచెము నిదానించుఁడు. (హిమవంతుఁడు మఱల లోపలకుఁ బోవుట).

బ్రహ్మ—(శివుఁడు వినకుండ భృంగితో) భృంగీ! లోపల వీరేమో బహువితర్కించుచున్నారు లగ్నపత్రికం గొంపోయినచ్చితివి గదా. వారి తలపోత నీకేమైనఁ బొడగట్టెనా!

భృంగి—ఇతరముఁ నాకేమియుఁ బొడగట్టలేదుగాని పెండ్లికొడుకు రూపురేఖలొకసాఱి చూడవలెనను సంకల్పము వధూజననికున్నట్లు తోచినది.

బ్రహ్మ—వరపూజా సమయంబున ముచ్చటదీరెఁగా! యింకనేటికి ?

భృంగి—ఏమో వారి యాలోచన లెట్లున్నవో సాధారణముగ నాఁడుపిల్లల వివాహమును గుఱించి యాఁడువాండ్రకుఁ బట్టుఁదల యెక్కువ.

బ్రహ్మ—మనము చిక్కుపడునట్లున్నాము. చెప్పెడివారెవరును లేరా!

(కుండోదరుఁడు ప్రవేశము).

కుండో—భృంగీ! "నిరాశాః పితరోగతా" యనినట్లయినది. మనమింక వెనుకకు నడువవచ్చును.

భృంగి—ఛీ! ఛీ! శుభముపల్కరాయనఁ బెండ్లికూతురుముండ యన్నట్లున్నది చాలులే! ఏమిరా! లోపవిశేషము లేమైన వినవచ్చెనా!

కుండో—మన రుద్రుని విషయమెట్లనుకొన్నను శుభమేకాని త్రోవబాగున్నది కాదు.

భృంగి—అంతయు బాగుగనే యుండును గాని సూత్రధారణ మగునంతవరకు నిమ్మళించుం.

కుండో—ఆ సూత్రధారణము కాఁగానె సూత్రచ్ఛేదన మగునట్లున్నదిసుమా!

భృంగి—అమంగళము. అమంగళము.

బ్రహ్మ—ఓరీ సర్వమంగళకా! పెండ్లికూఁతురు పాఱఁజూచెడు మాఁటాడెద వేలరా!

కుండో—ఇంకేమున్నది! ఆ పెండ్లికూఁతునితల్లి తనకూఁతు నీవరునకియ్యనని తిరుగఁబడి యొకరేమి చెప్పినను సుముఖురాలు కాకున్నయది. యింకేమి పెండ్లి! శ్లో॥ "ఉత్పద్యంతే విలీయంతే దరిద్రాణాం మనోరథా" యన్నట్లు నాదరిద్రము నా తోడనే తిరుముకొని వచ్చినది.

బ్రహ్మ—(నవ్వి) ఛీ! ఛీ! యేమిరాయది!

కుండో—ఓహో హో! మీరు యాజ్ఞికులా! (చేతులూగించుచు) కనుపెట్టు కొని యుండుఁడు. దీనితో మీయిల్లు నిండనున్నది.

బ్రహ్మ—కన్యాజనని మేరుసత్రిక మేనకయంత యవ్యక్తురాలఁటరా?

కుండో—మఱే! అదిగో గాదు మనము! నేను వచ్చినంత దూరము.

చ. హరునివివాహమం దహహ యైదు దినంబులు రెండు పూటల
న్వరమృదుభక్ష్యభోజ్యలసదపారసుభోజన మొకటీరీతిగా
సరిపడజేసెదం గడుపు చక్కఁగ నింపెద సంపి తేపెదన్
గరముల బొట్టపై నిమిరి గందము లందముగాఁగఁ బూసెదన్.

అనుకొంటిగదా! తుదకు నా నోట కరకాల్కయయే!

బ్రహ్మ—

చ. కడు పిటు పెద్ద కుండవలెఁ గన్పడు దిండియు మెండు నీకు ని
క్కడ నిపు డైదు నాళులు సుఖంబుగ సత్రఁపుదిండిఁ దింటివా
కడుపున కిట్టి యాఁకలియుఁ గన్పడ దాపయి నట్టి తిండియుం
గుడువవు తిండిపోఁతనెడి కుత్సకు నుత్సహనంబు కాఁదునా.

స్వల్పాహారంబుగా నటించుట కీర్తికరము, భాగ్యలక్షణము.

కుండో—బాఁగు బాఁగు!

శ్లో॥ 'ఆహారే వ్యవహారే లజ్జా నకార్యా' యను నీతి యేమగు?

బ్రహ్మ—అది యితరత్ర సంగతియేకాని బంధుగృహవిషయము కాదు.

చ. కడుఁ దినువారలైనను ముఖప్రియులై తమ బంధుపంక్తిలో
నడపెడ గల్పి యన్నముల నెక్కుడి వక్కడఁ బారఁద్రోసి యిం
పడరఁగ లీల వాచవికి నంతయు నింతయుఁ దిన్నరీతిఁ గ
న్పడి యటు దాటుకొందు రదె భాగ్యపులక్షణమందు రండఱున్.

దొరకని దొరకకదా యని యశనిఘాతప్రుందిండి దింటివా. శక్తి నుండువారి కనహ్యము సరికదా! యెదుట నూరకొనినను జాటునఁ దలపట్లు పట్టుకొందురు. పదిమంది వచ్చెడి కార్యమునకుఁ జేసిన ప్రయత్నము కొఱఁతపడెనా వారికి మనకు నపకీర్తికరము.

కుండో—అపకీర్తి యని లజ్జపడిన నాకలిదీరునా! వీరా.

ఉ. ఏ నిపుడల్ల లోపలకు నేగి ప్రయత్నముఁ జూచి వచ్చితిం
గాని యదెల్ల నాకె సరిగా సరిపోదని చప్పరించి పెం
పైన జుగుప్స నెల్లరకు నచ్చెరువౌనటు లాడినాఁడ మీ
యాన చతుర్ముఖా మనకు నందఱ కన్నము పెట్టలేరు సూ.

బ్రహ్మ—ఓరీ! తొల్త నీ యాడినది యదార్థ మనుకొనవచ్చును. నిన్ను నీ పొట్టను నీ ప్రగల్భములను జూచి యీ వచ్చినవారి కన్నము పెట్టలేమనుకొని వెఱచి కన్యాదాత యీ మాఁట యనియుండవచ్చును.

(విష్ణువు ప్రవేశము)

విష్ణు—(ఆగ్రహముతో) గంగాధరా! నీ భక్తుండు నీ వివాహవిషయమై చేసిన యపకారము వింటివా! దైత్యుల నమ్మవచ్చునా! పరిసరంబున బ్రవేశించి మచ్చికచేసికొని యిచ్చకాలను నిచ్చవచ్చినటులఁ బిల్లిమీద నెలుక, నెలుకమీఁద బిల్లి, నెక్కించుచు నక్కఱనూలిన పెత్తనములలోఁ జొరఁబడుచు నడనడఁ జివాటుల కలవాటుపడుచు నిరంతర స్వార్థనిర్వాహణైకాయత్తచిత్తులై పరార్థభగ్నీకరణ నిరంతర ప్రయత్నులై సాధుబాధ లొనరించువారు రాక్షసు లనఁబడుదురు. యజమానుం డట్టివారిఁ గనుపెట్టి వెంటనే పరిహరించెనేని సర్వశ్రేయంబుల కాఁటపట్టై విలసిల్లుఁగాని యట్టి తుచ్ఛులను దా నెఱిఁగి యెఱుంగక వారి కుటిలోపదేశంబులకుఁ జెవులొగ్గుచు నెట్టివారియం దెట్టి సామర్థ్యంబు లున్నవో కనుపెట్టఁజాలక సాధువులందు నిరసన భావంబుతో నుండెనేనిఁ దత్సాంగత్యదోషంబునఁ దానును రాక్షసకృత్యుండే యని జగద్దూషణంబులకుఁ బాల్పడి తుద కనర్థంబులకుఁ దావలంబగును.

శివు—అవును. తారకుండు మనయెడ నెట్టి యపకారంబు గావించినవాఁడు?

విష్ణు—

మ. భవదుద్యద్వరగర్వఘూర్ణమాణశుంభద్దోర్లతోజ్జృంభణో
ద్భవవేధోండసహస్రరక్షణ కళాధారుండు ధీరుండు దా
నవనాథుండు ముధావశీకరణములందా మమ్ము సాధించె నీ
వవిశీర్ణాధికనిష్ఠ నుండు నెడ వాఁ డౌద్ధత్యము న్వీడునే.

శివు—వాని మానసికతపోనిష్ఠావిశేషంబునకు మెచ్చి యట్లు ప్రసాదించుట యప్పటికి విధియైనది.

విష్ణు—మీరు విధించిన వరంబులు మన్నించుట మాకు విధి యనియే యింత దనుక వానిధాటికి నడఁగిమడఁగి కాలంబు గడపితిమి. వాని జాతిలక్షణం బిప్పుడైన మీకుఁ బొడఁగట్టెనా ?

శివు—ఏమి ! కృతఘ్నుతావృత్తి నవలంబించెనా ?

విష్ణు—

ఉ. మీకు వివాహమౌనను తమీచరనాథుఁ డసూయుఁడౌచు న
స్తోకదురుక్తులద్రివరసుందరికిం దగఁదెల్పి పెండ్లి కా
నీకు మటంచుఁ బంపెనఁట యింతకుమందె నిజానుజాతనా
భేకిని వచ్చి మేనకకు ఛిద్రము లేమియొ చెప్పె మీపయిన్.

తన మాయావశంబునఁ గుముద్వతిరూపంబున వచ్చి వాని సహోదరి యగు నయ్యజాముఖికన్యాజననికి నేమో గఱపి ప్రాతికూల్యం బుపదేశించి పోయినదఁట. దానంజేసి మేనక తనకూఁతును మీ కీయనని ప్రతినవట్టినదఁట. మహాగ్రహమైనదాఁక నమ్మఁగూడదు.

భృంగి—(శివునితో) వాఁడు నా యూహించియున్న విషయంబేమైన నుండునా ?

శివుఁడు—ఛీ! ఛీ! ఆ విషయము గాదు. (విష్ణునితో) నా భక్తుండు నా కిట్టి యపకృతి దల్చునా ?

విష్ణు—ఆహాహా! ఇంక మీకు విశ్వాస మేటికి ?

చ. పయికి వినమ్రుఁడై కపటభావ మెలర్పఁగ నొద్దఁ జేరి ని
శ్చయముగఁ దోడివారలకు స్వామికిఁ గీఁడుదలంచి సొంతపుం
జెయువులఁ జక్కఁబెట్టికొను చెన్నటి నెన్నటికైన గుర్తెరిం
గి యవల దోలి యాపయిన గీడడగించుట మంచి దారయన్.

మానసికపూజలచే నిన్ను భ్రమింపజేసి నీ పరోక్షమందు మమ్మెల్లర నలయించినట్లుగానే తుదకు నిన్నుఁగూడ మోసపుచ్చ యత్నించినాఁడుసుమా !

శివు—(విమర్శించి) మాధవా ! ఇప్పు డీ పరిణయభంగోపాయచింతనంబు వాని సోదరి యొనర్చినదేకాని వాని యుద్దేశముగా నే నెంచను.

విష్ణు—వాని యుద్దేశము గానకయే యది యంతకు సాహసించునే ! భక్తుల యెడ గుణాగుణవిమర్శనంబుఁ దలపెట్టని సులభవాత్సల్యుండవు.

చ. పరిణయమైనతోఁడ సులభంబుగఁ బుత్రుఁడు పుట్టునేమొ వాఁ
డరయఁగ నెట్టివాఁడగునొ! యాతఁడు తన్ను జయించునేమొయన్
బరమవిచారమేర సురవైరికి నుండదు వాని తంత్రమే
తిరముగఁ బారెఁ గ్రూరుఁ డవిధేయుఁ డవిశ్వసనీయుఁ డెప్పుడున్.

శివు—

ఉ. భావము మత్సరంబని శుభప్రదవైఖరి నుంటి నిష్ఠుత
ద్భావము నాయెడం గడుఁ గృతఘ్నతఁబూనెగదా "వినాశకా
లే విపరీతబుద్ధి" యని శేఖవిరోధికి డగ్గరించెఁబో
దైవగతి న్వినాశ మిఁక ధైర్య మవార్యముగాఁగ నుండుఁడీ.

కుండో—తలవంపులు లేకుండగ మేనకచేతిలో గెలచి యీ పులుసుతో నీ ముద్ద మ్రింగితిమా యవియన్నియు జేసికొన్నంతఫలము.

బ్రహ్మ—(ఆశ్చర్యముతో) (స్వగతము) ఆహాహా! హరిహరాదులమందరము తుదకు మేనకచేతిలోఁ జిక్కితిమి! (పరిక్రమించి ప్రకాశముగా)

తే.గీ. ఔను గాదని యేదియు ననకపోయి
రేమి యాలస్య మోరార యేమి యానో
లగ్నమును డగ్గరించెను లక్ష్యమేది

భృంగి—

పిలుము వెండియు నటువోయి పేరువెట్టి.

బ్రహ్మ— (ముందుకునడచి) ఓహో! కన్యాదాతలారా! యేల యీ యాలస్యము?

(తెరలో)

ఉ. వచ్చితిమిప్పుడే యిదిగొ వచ్చితి మిప్పుడ యార్యులార మీ
రచ్చటనుండు డించుక

విష్ణు— (శివునితో) వింటివా! ప్రాతికూల్యంబుతో నుండెడి తన గృహిణిని బ్రతిమాలుకొనుచు గన్యాదాత యిచ్చిన ప్రత్యుత్తరము సుమా యిది!

(మఱలఁ దెరలో)

యొకించుకయుం బనిలేదు లేచిపో
వచ్చును బిల్లనీయమిఁక వచ్చిన వారలు వచ్చినట్లె పో
వచ్చును బిచ్చిమానుడిఁది వాస్తవ మంటిమి సిగ్గులేదొకో.

బ్రహ్మ— యిది కన్యాజనని యాడిన మూర్ఖోక్తి సుమా! స్పష్టముగాఁ జెగఁ జెప్పినది.

విష్ణు— (శివునితో)

తే॥ గీ॥ వివిధవైభవ మొప్పార వెడలి వచ్చి
తుదకు నిష్ప్రయోజనముగఁ దొలఁగి పోవ

మనకుఁ దలవంపు గాదె యీ దనుజుకృత్య
మెట్లు సైరింపవచ్చునో యిందుమౌళి.

కుండో — (బ్రహ్మతో) మిక్కిలి పురికొల్ప నిదేసమయము!

బ్రహ్మ — (కుండోదరునితో) ఊరకుండుము సమయము గాదు!

శివుఁడు — (జుగుప్సపడుచు విష్ణువుతో) ముందుఁ గరణీయమెద్ది?

విష్ణు —

చ. తనసుతనీయనంచు నెటుదాఁటుకొనంగల దద్రికాంతఁ గ
న్గొనుదము వారు వీరు సరిగూర్చి వచింపరె! నిక్కమెంచరే!
ఘనయశుఁ డానగేంద్రునకు వికల్పము రానియఁ డట్లువచ్చెనా
మునుకొని యేను మేనకను ముఖ్యముగా వినుపింతు నీశ్వరా.

కాని తారకుని కృతఘ్నత్వము మరువకుము.

(ఒకప్రక్కనుండి హిమవంతుఁడు, మేనక, ప్రవేశము).

మేనక — (దూరముగ నిలుచుని శెప్పార్చక శివుని జూచి వారు వినకుండ హిమవంతునితో)

కం॥ యెక్కడ దొరకెను. మన కీ
చక్కని వరు డిందుముఖిని జయ్యన మన మీ
తక్కరి బిక్కరిగానికిఁ
దక్కక యియఁగానె నగరె తక్కొరు లకటా.

హిమ — (కనిబిసుకుకొని యితరులు వినకుండఁగ)

ఉ. మాటలు మానవే సుదతి మానము దక్కదు మాఁట పోవము
మ్మాఁటికి మాఁటయిచ్చితిమి మాఁటలె పీఁటలమీఁది పెండ్లి కీ
పాటి ఘనంబె! మాఁట పరిపాటిని బాఁటినిజేయ లోకమం
దోఁటమి లేదు మాఁటవిను మూరకఁ జారకునోరు నేరవే.

(పరిక్రమించి బ్రహ్మతో) యాజ్ఞికోత్తమా! వరుని మంగళస్నానార్థము లోనికిఁ దోడ్కొనిపోయి మీరందరు కళ్యాణగృహంబులో నుండుఁడు)

(అందరు లోపలకుఁ జనుట)

మేనక —

తే॥ గీ॥ పెద్దవారలు మీకునేఁ బేరుఁబెట్టి
చెప్పవెరచెద నిది మీరె చిత్తమందుఁ
బారఁజూడుఁడు చాలేల భామనీయఁ
బోలదిది పెండ్లి వేరు కాలాలపంట.

హిమ — ఇస్సిరో! సమయము కాదు! వినెదవు. మాటాడకు.

మేనక — (పరిక్రమించి స్వగతము) ఇప్పుడు లోలోపలి గుసుపుతో నుంటినా నా మగఁడు నాయంకెళ్ళు రంటిని నొక్కినను మెదలఁడు. మనమీవిషయములో గట్టిపట్టు పట్టవలసినదే! (ప్రకాశముగా)

ఉ. ఈవరుఁడేమి! యీసుదతి యేమి! యహో! యిటుచూచిచూచి నా
భావము గొల్పుకున్నది శెబాసు భళా! మిడిమేలమయ్యొ నీ
భావజువైరి యింతుకయి భవ్యతపంబు నెపంబుఁబెట్టి యీ
క్రేవనె పొంచువేసెనొకో! కేవలమూఢులమైతి మక్కటా.

హిమ — (సమీపించి) శుభాంగీ! శుభకార్యంబుఁబట్ల లేనిపోని గృహకల్లోలములు పెట్టుకొనుట శుభముగాదు.

చ. వరునకులోపమేమి! భగవంతుఁడు లోకము లేలువాఁడు శ్రీ
కరసుగుణాలవాలుఁ డవికారుఁడు స్వాశ్రితకోటి కెప్పుడుం
న్వరములనిచ్చువాఁడు మనపట్టికిఁ బోలినవాఁడు గాఁడె యీ
వరునకె కన్నెదానమును బాయక చేసితిమూ తరించమే.

మేనక — (విచారముతో) ఇంతమాత్రపు వరుఁడెక్కడను లేఁడని యితఁడే సర్వోత్తముఁడని యిప్పుడుఁ గూడ నాకండ్లు గంతలు కట్టుదురా!

శా. ప్రత్యక్షంబుగఁ జూచుచూ యిప్పుడే సంపన్నుండె కానిండు దు
ష్కృత్యం బీతనికిచ్చివేయుట యహో! కించిత్సుఖంబైన లే
దత్యాశ్చర్యము మీరు చూచితిరె! యీ యాకారమా తీరు చా
ల్బ్రిత్యాహంబొనరింప మేలిపుడు నా ప్రాణేశ భావింపవే.

ఏమైనకానిండు. నాకన్న చిన్ని ముద్దులతల్లిని నెక్కడనైనఁ జక్కనివాఁడు వయస్కుఁడుగా నుండుట ప్రధానముగాఁ జూచుకొని తక్కిన భోగభాగ్యంబులు యథాసంభవంబుగ నెంచి యట్టివాని కిచ్చితిమా మనమందఱము సుఖపడుదుము. కంటికింపుగానప్పుడు కౌఁగిలించుకొననేల! యను ముతకశాస్త్రము లోకములోనున్నది యెఱుఁగరా! ఈ పెండ్లికొమరుండు చూడఁ బైపై మెఱుఁగులకైన నాకండ్ల కసహ్యమగుచున్నవాఁడు.

హిమ — అపకీర్తి మోయలేము సుమా! పైపైయందము లెందుకు! కొఱుకుకొని తిననా!

మేనక — తా ననుభవించలేనివాఁడొరులకుఁ బెట్టనేర్చునా! యదియును త్తదే! యిదియు నుత్తదే!

హిమ — ఇట్టిదానవు మొదటనుండియు నేల నూరకుంటివి?

మేనక—నన్నందఱు మాయచేసినారు. నా కన్నచిన్నబిడ్డ నీ యందవికారపు ముదిపెండ్లికొడుకున కీయనొల్లను. సుముహూర్తము మానుకొని వెడలి పొమ్మని మీరచెప్పఁడు. లేనిచో నేన చెప్పఁబోవుచున్నాను. నేను పీఁటలమీఁదకురాను. నాచిన్నబిడ్డను నేను పంపను. (ముఖముఁ ద్రిప్పుకొనుట)

హిమ—నిన్నెవ్వరు మాయచేసిరి!

మేన—ఇంతంతా! యంతయు మోసమే! మీరమాయకులు. మీరెఱుఁగరేమో! యిప్పుడు నా కంతయుఁ దెలియుచున్నది.

హిమ—చెప్పఁగూడదు!

మేన—చెప్పకేమి?

చ. భువి నెటువంటిపెద్దలకుఁ బూటకమాఁటలు నైజమయ్యెనాఁ
డవి యివి లేనిపోని తరహాల్వరహాల్వలె నన్నిమాఁటలో
సవరణఁజేసి చెప్పిరలసప్తమహర్షులు మీకునాకు నిం
దవుర యవెల్ల నమ్మితిమి యాదొకఁడైనను పేనికున్నదే.

నవమన్మథుని దిగస్కరించెడి మూర్తిమంతుఁడని, రాజకళా విభ్రాజితుండని, పూర్ణ విభూతికాముండని, భోగిభూషణుండని, శ్రీమంతుఁడని, మనకన్నెకు నీఁడుజోఁడుగ నుండువాఁడని మొదలగు ననేక మాయాప్రలాపములాఁడి మనల నమ్మించి మోస పుచ్చినారు. వారు జెడలు గడ్డాలుఁబెంచిన సత్యవంతులఁట! యాడిన వన్నియు నన త్యములే; నూరుకల్లలాడియైన నొక యిల్లునిలుప మన్నారను శాస్త్రమును బాగుగాఁ జదివినారు. శెబాసు! శెబాసు! వారి మాయలేపాఁటి! నామాయఁజూడుమని యా ముసలిమగని వెంటవేసుకొని యాముసలమ్మ యరుంధతమ్మఁ గూడఁగూడందిరిగి యా వరుని యందము చందము నాచెవులలో నూరిపోసినది. పెద్దముత్తైదువుగదాయని నమ్మటకుఁ గారణమైనది. అమ్మా! యెంత మాయలతల్లి! తొల్లి యానాఁడు దేవ ముని యఁట ముందుగఁబురికొల్పిన వాఁడు. ఏరీ యిప్పుడా పెళ్ళిపెద్దలలో నొక్క రైనఁ గానరారేమి? యిదంతయు నిట్లు చక్కద్రోసితిమిగదాయని యిప్పుడు మొగము చాఁటేసినారు కాఁబోలు.

ఉ. కన్నియ నిచ్చునప్పుడును గైకొనునప్పుడు ముఖ్యులేఁగియా
కన్నెనుగాని యావరునిగాని సమక్షములోనఁజూచి యా
వన్నెలు చిన్నెలెన్నికకు వచ్చెడి నేనియు నష్ట వృత్తుల
న్గొన్నిఁటిఁగూడఁ గన్గొనుచుఁగూర్పఁగనొప్పు వివాహమెప్పుడున్.

మత్తకోకిలావృత్తము.

కూఁడునా యదికూఁడదాయని కూఁడి చూఁడక భాగ్యము
ల్గూఁడియున్న వటంచుఁ గొందఱు గూఁతునిత్తురు గూర్మితో
నీఁడుచాలని వానికో ముది యీఁడుమించిన వానికో
చేఁడె కేకద యేదివచ్చినఁ జేతులారఁగఁగూఁడునే.

అనుభవంబునకు సిరయెంత యుండిననేమి? యిన్నాళ్ళు పెంచి చేతులార యిటువంటి శతవృద్ధునకు నంటఁగట్టినచోఁ గంటకశాఖకెంగటఁ జెన్నొందెడి తరుణ కదళీదళంబునకుఁ బోలెఁ బ్రధాన ద్రవ్యంబు బాగుండక పోవుటంజేసి సర్వవిధంబుల నియ్యాడుదానికే యసౌఖ్యముగదా!
(అపహాస్యముగా)

చ. ఎడపక నల్గడ ల్వెదకి యేమని తెచ్చితి రేరి కోరి యీ
బడుఁగును గన్నదారకు శెబాసు కనుంగొనఁ గన్పనిండెఁ జాల్
బెడఁదలు తెచ్చిపెట్టకుఁడు వే వెడల న్నలవిందు వీరికిం
బడఁతివివాహ మీయెడనుమానితి మెప్పుడొ ముందటంచొగిన్.

హిమ—(కోపముతో)

ఉ. ఏ ననఁజాల నాఁడలమునీంద్రులముందట నీవు నేను వా
గ్దానముఁ జేసి నిశ్చయముగా సుముహూర్తము నొప్పికొంటి మ
ళ్లీ నవచంద్రమౌళి మనయింటికిఁ బెండ్లికిఁ దర్లివచ్చె ని
చ్చానను శూలికిచ్చుటయె సత్పథమౌఁ గుపథంబు తక్కినన్.

పిన్నపెద్దల ముందట వాగ్దత్తమనోదత్తయైన కన్యనుఁ బాణిగ్రహణ సమయంబునకు లేనిపోని భ్రాంతిపెట్టుకొని యీ వరున కీయననుటకంటె వేఱు పాతకంబు కలదే!

కం. తుద కీ యల్లరి యేలనె
పదువురలోఁ బరువుపోదె పడతీ! మన తీ
రిది యనఁ దలవంపులకా
యిది కాదన కీవు నాకు హితవుగ రావే.

మేన—(స్తుతినభినయించి) మహాత్మా! పలువన్నది మాఁటలతోనే వచ్చి మాఁటలతోనే పోవునా? సందర్భమాలోచింపరేల?

మ. ఇతఁడా మున్పటియత్తవారిని మహాహీనంబుగాఁజూచి యా
యతివ మ్ముచ్చటకైనఁ బుట్టినిలు గట్టా! చూడఁబోనీక తా

నతి ధూర్తుండయి యేడ్పించె వినవా! యీనాఁడు సర్వంబు వి
స్మృతమయ్యె న్మనపాట్లు నంతటివి సూ మీబుద్ధిలో నెంచుఁడీ.

హిమ—(చెవులు మూసుకొని స్వగతము) హరి హరీ! సర్వమంగళ వివాహ వేళనిది యమంగళము లాడుచున్నది. (ప్రకాశముగా)

చ. కులసతి విజ్ఞురాలయిన గొప్పగృహంబునఁ బుట్టి వచ్చినం
గలఁతకుఁ బోక శాంతముగఁ గార్యపుఁబట్లను లాఁతివేళలం
దలఁపడి భర్తమాఁట జవదాఁటక తాను జరించునేని యా
కులములు రెంటికి న్ఘనతఁ గూర్చును బేర్చును ధాత్రి నెప్పుడున్.

మహామేరువునకు బుత్రికైనను, బుద్ధిచాకచక్యంబు గలదానవైనను, మదీయ సంకల్పితార్థంబు విఫలంబుఁజేయనాఁడుట నీకుఁ దగదుసుమా!

మేన—ఏను రాను. మీ యిష్టముచొప్పున మీరే చేసికొనుఁడు.

హిమ—రానంటివా యడ్డగుసుమీ! అంతగా నవసరమాయెనా నిన్నుఁ గొంపోవ లేననుకొంటివా!

(తెరలో)

ఉ. శ్రీనవవాద్యము ల్వెలయుఁ జేడెలు పాటలఁబాడ మంగళ
స్నానములై వధూవరులు చాల నలంకృతులైరి దాతలం
గానము రారు యాజ్ఞికులు గానరో లగ్నము డగ్గరించెఁ గ
ళ్యాణముఁ జూడ నిండిరి జనాళులు ద్రొక్కిసలాడుచు న్వడిన్.

హిమ—(పరిక్రమించి వినుట)

(బ్రహ్మ, భృంగి ప్రవేశము)

బ్రహ్మ—ఏమి యీ యాలస్యము?

హిమ—యాజ్ఞికోత్తమా! సుముహూర్తంబున కింక నెంత యవకాశము?

బ్రహ్మ—అవకాశ మేది? సమయమగుచున్నది.

హిమ—వధూవరుల మంగళస్నానము లయినవి గదా! అంకురారోపణ మింతకు మున్నే యైనది. మంగళవాద్యంబులు మ్రోగుచున్నవి. పరమేశ్వరుండు సమస్తబృందారకబృందంబులతో నా యింటఁ బాదంబు మోపినవాఁడు. మా బంధువులు మేరుమందర గంధమాదనపారియాత్రాదు లంగలు వేంచేసియున్నారు. మా యాలస్య మేమియు లేదు. రండు. సంకల్పము చేయింపుఁడు.

బ్రహ్మ—మీరలో!

హిమ—ఇదిగో నేనును వచ్చుచున్నాను.

బ్రహ్మ—యజమానురాలిక్కడనే యున్నదేమి ?

హిమ—కన్యాధారపోయుటకు నేను చాలనా ?

బ్రహ్మ—ఆ! ఆ! కూడదు కూడదు. మీ దంపతు లిద్దఱిచేతఁ జేయఁదగినది సుమా !

హిమ—ఆటంకము వచ్చినప్పు డేమి చేయుదవు.

బ్రహ్మ—(ఆశ్చర్యముతో) ఆటంక మేమియుఁ గనుపడదే ?

(హిమవంతుఁడు మోము వంచుట)

(మేనకతో) మేనకా! యేమి విచారించుచున్నావు ?

(మేనక తల వంచుకొని యూరకుండుట)

(తనలో) ఏమి యీ చిత్రము! (ప్రకాశముగాఁ బరిక్రమించి భృంగితో) నీవు లగ్నపత్రికఁ గొనిపోయి ముందుఁ గలసి మాటాడి వచ్చినవాఁడవు. యజమానురాలి చింతాబీజమేమైనఁ బొడగట్టెనా ?

భృంగి—నాకుమాత్ర మేమి తెలియును ? నన్నడిగినమాఁట యింతకుముందు మీకుఁ జెప్పినదే. వరుఁ డేమాత్రపువాఁడని నన్నడిగినది. యికఁ గొంచెములో నీవ చూతువు. నన్నడుఁగనేల యని యంటిని.

బ్రహ్మ—(నవ్వి) భృంగీ ! నీ యుపహాసవాక్యములు మాకుఁ బరిపాటిగాని క్రొత్త వారికా! పయిగా రక్కసి దుర్భాషల కులికిపడుచున్న యీబిడకు నగ్నిలోఁ బోసిన యాజ్యంబు లగుచున్నవి.

ఉ. పట్టినపట్టు దిట్టముగఁ బట్టితి విట్టటుఁ బోక వట్లతోఁ
దట్టయు నెంచునట్లు పలుతట్టుల కన్నిఁటి కోర్చి గట్టిగా
గట్టులఱేనిపట్టి నిటుఁ గట్టుకొనం దలపెట్టఁజేసి బ
లట్టున గట్టువిల్తు శుభకార్యము ధుర్యుఁడవౌచు నెట్టవే.

(మేనకతో) సుందరీ! యింగుగరుండు బహు సుందరకోమలాకారుండు. బహు కమనీయాలంకారప్రియుండునయ్యు స్థూలబుద్ధిగలవారికి విపరీతంబుగఁ దోఁచును గాని సూక్ష్మబుద్ధి గలవారికి నిజస్వరూపముతో నేత్రానందహృదయానందములు వెల్లి గొలుపుచుండును. మదీయవాక్యామృతంబులచే నీ వికఁ జిత్తమాలిన్యముఁ గడిగి వేసి మావలెనే పరిశుద్ధస్వభావముతో నుంటివా; యిప్పుడు నీ మనస్సంతోష మింతింత యన రాదు. పరమేశ్వరగమహిమలు సామాన్యముగా వేద్యములగునా ! యీ పెండ్లికుమారుని కృపచేతనేకదా యేన సృష్టికర్తను! లలాటలిఖితరేఖాఫలముఁ దొలఁగింప నెవరితరము ! నా మాట నమ్ము. లెమ్ము.

మేనక—ఇంతకుమున్నె నా విన్న యంశములకు నిప్పుడు మీ రన్న యంశము లకుఁ గడుఁ దారతమ్య మున్నది.

బ్రహ్మ—నీ కెవరివలన వింటివో యదార్థమాడుము.

మేనక—కుముద్వతివలన.

బ్రహ్మ—(విమర్శించి పకపక నగి) దాని మర్మము వేఱు. నీ మనస్సాక్షిగా యోచించుకొనుము. వశిష్ఠ విశ్వామిత్రులకుఁ బరస్పరవిరోధమని లోకప్రసిద్ధియేకదా! వారిరువురు నేకీభవించి తొల్తఁ గాధ్యఘటకులుగా వచ్చినవారేకా! కుముద్వతి ప్రత్యేకముగా వచ్చి నీకుఁ బ్రతికూలవాక్యము లుపదేశించుట యసంగతము.

మేనక—(ఆశ్చర్యముతో) హరిహరీ యథార్థము.

బ్రహ్మ—అది కాదు. జగత్కంటకుం డగు తారకునిపనుపున దత్సహోదరి యజాముఖి యుత్తరకాలభీతిని శంకించుకొని తావకీయ పాణిగ్రహవిఘటనా పారతంత్ర్యంబున మాయావినియై నాఁటి యరుంధతి వాక్యములపై నీ కనాదరణంబు కలిగించి తనయం దధిక విశ్వాసంబు కలిగించుకొనుటకై ప్రతిబంధిగా తద్భర్తకుఁ బ్రత్యర్థి యగు విశ్వామిత్రుని పత్ని వేషంబుఁ దాఁ దాల్చి యేకతంబ యరుదెంచి వివిధ దురోభనంబులతో నిన్ను మోసపుచ్చి పోయినదఁట. దీని వాస్తవ మింతియ.

మేనక—ఆ! ఆ! యింత విరుద్ధమా! (యోజించి) అంతే కాఁబోలు.

బ్రహ్మ—భ్రాంతి వదలుకొనుము.

చ. కనకగిరీంద్రునింటఁ గనకంబువలెం బ్రభవించి యీ హిమా
వనిధరు చెట్టఁబట్టి జనవంద్యపథంబున నుండఁబోలు నీ
కనువగు నా పతి ప్రియము నడ్డఁగఁజాలును దొడ్డతల్లి నీ
మనసును మల్పికొల్పికొని మానక లగ్నము సాగనిమ్మిఁకన్.

మేనక—(నమస్కరించి) మహానుభావా! ఘటనాఘటనసమర్థులు మీరే యను మాఁట యిప్పుడు స్ఫురించినది.

బ్రహ్మ—

ఉ. సత్యము నాదువాక్య మిది చక్కఁగ నమ్ముము లెమ్ము మేనకా
నిత్యశుభాంగుఁ డీ వరుఁడు నీ మనసొప్పఁగ నుండు నల్లుఁడౌ
వ్యత్యయ మేమియుం గనము వ్యర్థవిచారము లెందుకమ్మ స
త్కృత్యము నాఁటికిం బతి యభీష్టము సల్పుటయే యెఱుంగవే.

(మఱలఁ దెరలో)

ఉ. శ్రీనవవాద్యము ల్వెలయఁ జేడెలు పాఁటలుపాడ మంగళ
స్నానములై వధూవరులు చాల నలంకృతులైరి దాతలం

గానము రారు యాజ్ఞికులు గానరొ లగ్నము డగ్గరించెఁ గ
ల్యాణముఁ జూడ నిండిరి జనాళులు ద్రొక్కిడులాడుచు న్వడిన్.

(అందఱు నాశ్చర్యముతో వినుట)

హిమ—ముందు మనదే యవశిష్టము. తదనంతరకరణీయమునకుఁ బ్రయత్నింతము.

(అందఱు వెడలుట)

గద్య: ఇది శ్రీతర్కవేదాంతాది సకలతంత్రస్వతంత్ర శ్రీమ దనుగమభట్టాచార్యాది ప్రసిద్ధబిరుదాంకిత శ్రీమ దభినవగౌతమావతార శ్రీ కురుగంటి వెంకట్రామశాస్త్రి కంఠీరవ పౌత్ర శ్రీ కురుగంట్యప్పయ్యశాస్త్రిపుత్ర శ్రీ వెంకమాంబికా సతీతిలక గర్భశుక్తి ముక్తాయమాన శ్రీ హరితసగోత్రపవిత్ర శ్రీమ దుభయభాషా భూషాయమాన లలిత కవితా ధారా ధారాళ యశో విశాల సహజపాండిత్య సాహిత్య శ్రీ బాలాత్రిపురసుందరీవరప్రసన్న బుధజనవిధేయ శ్రీ కురుగంటి సూర్యనారాయణశాస్త్రి నామధేయ ప్రణీతంబులగు సత్కృతులలో నగ్రగణ్యంబగు కుమారసంభవ నాటకంబునఁ పంచమాంకము సమగ్రము.



    

# కుమారసంభవము

## షష్ఠాఙ్కము



### ప్రథమరంగము

ప్రవేశము—శాకోటకుఁడు, పుష్పదంతుఁడు.

శాకోటకు— ప్రియసఖా! పార్వతీ కల్యాణోత్సవముఁ జూడవలెనని బహుదినములనుండి యాసపెట్టికొని బహుదూరమునుండి పరుగెత్తుకొని వచ్చినందుకు జనసమ్మర్దములో నొకమూలఁబడి పోవుటంజేసి యయ్యొత్తిడిని నాకుఁ జూపులు సరిగ నందలేదు సుమా!

పుష్పదం— (ఆశ్చర్యముతో) ఇంతకుఁ గల్యాణోత్సవ మాద్యంతము నీ కండ్ల కందలేదా!

శాకో—ఒక్కఁడనేకాని యొకింతదూరములో దక్షిణమునుండి యగస్త్యుండఁట యొకముని నాకంటె నెక్కుడు పరుగిడుచు నన్నుఁ గలియరా మే మిఱువురము నహమహమికతోఁ బరుగులిడుచు ద్వారముఁ జొరఁబడుచో నతఁ డేమాయెనో మఱల నా కగపడలేదు.

పుష్ప—నీవు మొదట నాతోఁగూడ వచ్చితివా! తఱువాతనైన నవవధూవరుల దివ్యమంగళ రూపములు నీ కన్నులకు నందినవా!

శాకో—తఱువాత నందకేమి! పుష్పదంతా! యా ముని యెవరు! చేతిలోఁ గమండలమైన లేదు.

పుష్ప— విను.

చ. శివుల కరగ్రహంబు గనఁ జేరిన వారల భార మెక్కుడై
 భువి నిటుప్రక్క క్రుంగఁగనెఁ బోరున నావలిప్రక్కఁ దూఁకము
 న్సవరణచేయ నవ్వరుఁడు చయ్యనఁ బొమ్మనఁ బోయి కుంభసం
 భవుఁ డటఁ గుండికన్నిలిపి భద్ర దిదృక్షును వచ్చెఁ గ్రమ్మఱన్.

అగస్త్యుఁ డొకయెత్తు కమండలు వొకయెత్తు. తనకుఁ బ్రతినిధిగాఁ దన చేతి కమండలువుం బెట్టి యా దక్షిణదిక్కునుండి ఱెప్పపాటు మాత్రములో వచ్చి కల్యాణోత్సవంబు కన్నులారఁ గన్నాఁడు.

శాకో—సరిగాని పరిణయం బగునంతవఱకునుండి పురందరాది బృందారకులం దఱు నొక్కరయిన దిగఁబడకుండ లేచిపోయిరి. కన్యాదాత యీ పెండ్లివారి నందఱిని భరించలేనని యన్నాఁడా యేమి!

పుష్ప—(నవ్వి) కులభూధర చక్రవర్తికి నట్టి యశక్త దుర్గతత్వ మనుకొన వచ్చునా! యమరులందఱు సుధాభోజనులు, వీరి భోజనంబులు మాఁజూఁడరు. గానఁ బాణిగ్రహణోత్తర క్షణమే వెడలిరి.

శాకో—వహవా! కొండలరాయనికిఁ గొండలపాడవులుఁ జేసికొన్న ప్రయత్నమంతయు లాభమే! యాఁడుపిల్ల పెండ్లిఁజేసి యాఱు నెలలు తినుమన్నమాట నిజమైనది.

పుష్ప—ఈ కన్యాదాత యట్టిలాభ మపేక్షించినాఁడా; (జ్ఞప్తికిఁ దెచ్చుకొని) అక్కడి చమత్కార మింతింతని చెప్పఁదరమా!

శాకో—ఏమది! ఏమది!

పుష్ప—

కం. సుముహూర్తమైన తోడనె
యమరులు వడి లేచిపోవ నచలేంద్రుఁడు దా
బ్రమయుచుఁ బెండ్లికుమారుని
నమరఁగ నిది యేమియనుచు నడిగియు నతుఁడై.

ఉ. ముప్పది మూఁడుకోట్లు సురముఖ్యులకోఁ జను వెంతువంచు నే
నప్పుడె కొండలాదిగఁ బ్రయత్నము సిద్ధముఁ జేసికొంటి వీ
రిప్పుడె లేచిపోయి రిదియేమి విచిత్ర మిదేమి సూను నా
తప్పు క్షమించి వారి నిటుఁ దప్పక వే పిలిపింపు మిప్పుడే.

చం. అని పలుమారు వేడికొన నప్పరమేశ్వరుఁ డద్రినాథుతో
మనముదలిర్ప మోము మృదు మంజు హాసంబులు మొలక-
లెత్తుమీ
యనిన విధంబె మాబలఁగమంతయు వచ్చునుగాని యాఁకటం
గునియుచునున్న యీవటునకుం జలిబువ్వ యొసంగుఁడింతలోఁ.

అనుచుఁ దనచేతిక్రిందనున్న యా కుండోదరునింజూపెను.

శాకో—వీని తిండి తండోపతండము. పయినయేమి?

పుష్ప—

ఉ. చూపినతోడనే యతఁడు చోద్యమటంచు నెఱుంగలేక యా
బాపనిఁజేతఁబట్టికొని పాకగృహంబున కేఁగి యచ్చటం

జాపిన పీఠమందునిచి చారుల సత్కదళీ దళంబులో
నూప వదన్నముల్గుడువఁ జూడుఁడటంచు విధించె సూదులన్.

కాకో—(పక్కున నవ్వి) వీనిగర్భగోళంబునకు బ్రహ్మాండ మంతటి యన్నరాశి యైనను దానికి శతగుణంబులై నవ్యంజనంబు లైనను జాలవు. తిండిపోతని లోక ప్రతీతియే; తరువాత, తరువాత.

పుష్ప—ఆ సమయంబున వానిసీఁటు, గోటు, శీవి, యొయ్యారముఁ, హొయలు, రాజాధిరాజులకైన లేదు. చూచితీఱవలెను.

కాకో—భళా! భళా!

తే. గీ. వరుని వైపున బహువేషభాషలొప్ప
గొప్పగా సాగు వియ్యంపుఁ గొలువులెల్లఁ
గన్నెదాతల యింటను వన్నెమిగుల
వీనిమీఁదనె తుదకంట వెలసె నోకాకా.

తఱువాత! తఱువాత!

పుష్ప—ఏమి చెప్పుదు కాకోటకా! మెఱమెఱలాఁడు మెఱుఁగుంబట్టుఁ బుట్టంబులు ధరించి, బంగరుటట్టలకంగుగుల్కు నడుగుంగెందమ్ములం బావలందమ్ముగ నెడమప్రక్క విడచి కఱకు టపరంజిపూఁపని, రంగుల సింగారంబగు బంగారఁపు గ్రంధి కోళ్ళ కురంగధరకాంత పీఠంబునఁ గూర్చుండి వెనుకతట్టున ఘటికమాణిక్య కుడ్యంబున నేఁటవాలుగఁ జారికెలవేసిన వైడూర్యఖచిత మరకత శిలాఫలకంబున నానుకొని నవరత్న మరీచి వీచికా ధగధగితముగ్ధ చిత్రవిచిత్ర రేఖాస్నిగ్ధ కలధౌత కళాచికా రత్నంబు డాఁపలి చేఁతిక్రింద మెఱయ జాలువాపసిండి రేఁకుఁబేరుటనంటి యాఁకులో నూదకారులచే నేకవార ద్వివార త్రివారంబులుగాఁ బెట్టఁబడిన పదార్థ సార్థంబు లొక్కొక్క కబళంబునకైన రామి దవడలాడించి నోఁటనిండ నములు నుత్సాహ పడుచు "తే తె"మ్మని గొంతెత్తి యింటిమీఁది కప్పు చప్పున నుప్పరంబున కెగయు చాడ్పునఁ దాఁజేయూరాఁజేయు నఱపులతో వెడలెఱపి యిడక కుడియెడమ లనక శతసహస్ర సంఖ్యాతీత పాకకారులు వచ్చువారుఁ జొచ్చువారు, నందించు వారు, నొడ్డించువారునై, యెడపెడ బళ్ళెరంబు లెత్తిపడవేయు షడ్రసోపేత మృష్టా న్నంబు లెప్పఁటి వప్పఁడే నమలి నమలక దిగమ్రింగుచు నెప్పటికప్పఁడే రిక్త పాత్రంబుఁ జూఁపుచుఁ గడుపునిండ లేదని యక్కళించి, చే యప్పళించి, చూపుఁచు నడసడ దానడపెఁడు నఘాయత్తంబులతో నడలఁగొట్టి త్రిపురంబులవలె భగభగ మంటలెగయు వంటగాఁడుపులపై వెంటఁదగిలి పదులు, నూరులు, వేలు, లక్షలు, కొలఁది క్రొత్తగుండికలు తోడ్తోడఁనే యవ్వంటల వారిచే వారిపించి తనభోజన పాత్రంబులోనికి దొఱలింపఁజేసికొనుచు ననుబాయి, లత్తిక, చారిక, సంకటి యని పేరు పెట్టక మెక్కుచు నక్కజంబుగఁ బప్పులు, దప్పళంబులు, నప్పడంబు, లొడియంబులు

బొబ్బట్లు, మినపట్లు, నూఱుగాయలుఁ జిత్రాన్నంబులుఁ భక్ష్యాన్నంబులు, దధ్యోద
నంబులు, లడ్డులు, వెన్నెరుగు, అరసెలుఁ, గేసరబాఁతులు, పదరు ఫేణులుఁ వడ
లావడలు మున్నుగాఁగల వంటకమ్ముల, గంపలాది ద్రిమ్మరించిన, నన్నియు నొక్క
దవడకే చాలమిఁ దొంగితొంగి చూచుచుఁ దృప్తిలేక "తెండుతెం" డనుచుఁ
గేకలు వేయ నక్కన్యా దాతలు తా రొనర్చుకొన్న ప్రయత్నమనఁగా నుప్పు, పప్పు,
బియ్యము, నెయ్యి లోనుగాఁగల పదార్థ సంచయ మంతయు వ్యయపడుటయే కాక
యీ చుట్టుపట్ల పల్లెల పట్టణంబుల లోనివియుఁ గూఁడ నిరవశేషంబు లగుటయు,
నివ్వెరపడి చేయునదిలేక, రెండొరులం జూచుకొనుచున్న యాసన్న రొటెంగి
యాహారము కడుపునిండఁ బెట్టలేకపోయినను, దగదీరఁ బానీయమైనఁ బోయుం
డనుచు వారు తెచ్చిపోసెడి భాగీరథీ జలం బంతయుఁ ద్రావిత్రావి యా ప్రదేశం
బంతయు నిర్జలంబగుటయు స్తంభాకారులై యున్న యాకన్నెదాతల నుల్లంఠనముగా
నాఁడి దిగ్గున లేచివచ్చి పెండ్లికొమరుండగు గంగాధరునితోఁ దండ్రీ! వీరు నాకు డొక్కార
నన్నమే పెట్టలేకపోయిరి, సరిగదా, కుతిదీరఁ బానీయమైనఁ బోసినవారుకారని, విన్న
వించుటయు నక్కళ్యాణ రూపుండగు గంగాధరుండు, సుందర మందహాస ముఖార
విందుండై మాచిన్నవాని కొక్కనికే కడుపార నన్నోదకంబులీయఁ జాలకపోతిరి.
వెడలిపోయిన మావారిని మఱల పిలుపించుమని చెప్పితిరిగదా! వారందఱు విచ్చేసిరేని
మీరేమి చేయుదురని, యత్తమామలకుఁ దమ సత్తా విశేషంబు లత్యద్భుతంబు లగునటుల
సంభాషించి యక్కుండోదరునిఁ ద్రావి తలపోసుకొమ్మని తన జటాబంధంబులో
నొక జటాపాశంబు ద్రెంచి యటుపాఱవైచిన నది హిమవత్పాదమందు జటానదియను
పేరఁ బ్రవహించె. వాఁడు నటుచేసి తృప్తుండయ్యె.

కాళో:—సరి. యట్టి విచిత్రము లెన్నియైనఁగలవు. చెప్పఁదరమా! యవి
యటుండనిమ్ము. వధూవరులకుఁ దమ పెండ్లి యనఁగానే రెండొరుల బులపాఁ
టంబులు, సిగ్గనెడి వలపెపుఁ దెఱలో నాఁడుచుండినను దరహాస మిళితంబులగు సాకే
కర దృగంత విలాసంబులతో బయల్పడక మానవు. ఏనుఁ బ్రత్యక్షముగఁ గనుపెట్టినాను.

చ. పరిణయవేళ గౌరి తల వంచుకయుండియు నించుకంత సుం
దరముఖమెత్తి యీ హరునిఁదాఁ గొనచూడ్కులఁ బ్రీతిఁజూచుఁబ
ల్మర నటువోలె నాహరుఁడు మాఁటల సందున నోరకంట సుం
దర దరహాస వక్త్రుఁడయి తానగనందనఁ జూచు వేడుకన్.

పుష్పదం:—ఆ! కనుపెట్టినావుగదా! పురోభాగంబున యాగ్నికుండగు చతుర్ము
ఖుండును, పశ్చాద్భాగంబున మేనకా మేరుదేవి లక్ష్మీసరస్వతులు మున్నుగాఁగల స్త్రీ
రత్నంబులు, నింకఁ పార్శ్వంబున, నింద్రోపేంద్రాది సురగణంబులు, నొక్కపార్శ్వంబున
మేరు హిమాచలాది ధరాధరగణంబులు. తీర్చినట్లు నిలువఁజుట్టును, దిదృక్షా కుతూహలిత
వివిధ సుర భూసుర తపోధనాదులు సభదీర్చి పరివేష్టింప వివిధాలంకార మనోహరంబగు
కళ్యాణవేదికాంతరాళంబున మైమై నొఱయుచు, నొండొరుల యపాంగావలోకనంబుల

నొండొరుల రూపురేఖా లావణ్యంబులు గనుంగొనుచుఁ జిఱునగవుల నింపుసొంపులు బొంపిరి పోవు ముఖవిలాసంబులతో నొప్పారు నప్పార్వతీ పరమేశ్వరుల పాణిగ్రహణోత్స వంబు నేత్రోత్సవంబయ్యె, నహహా!

శాకో.—(స్మృతినభినయించి) సర్వసిద్ధమగు నిట్టి వివాహములో,

చ. వరునకుఁ గొన్నిలోపములు వారక యెంచి ముహూర్తవేళ కా
వరునకుఁ బిల్లనీయనని పంతముతో నొకకొంత మేనకా
తరుణి యొగిం బిగించుకొని తర్జన భర్జనమైనమీఁద నీ
వరునకు నీయ మ్రొగ్గెనఁట వాఁడిటు రాఁగతమేమి యామెకుఁ.

పుష్ప—ఇంక నీవెఱుంగవా! యింతవైరాగ్య సంపన్నుండింత సంసార సంప న్నుండగుటకు మూలం బయ్యమరావతీనాథుండే సుమా!

శాకో—అదేమి?

పుష్ప—దనుజబాధలు మెండగుటంజేసి తగిన సేనాధిపతిని సంపాదించుకొనుటకు పుష్పబాణుని బురికొల్పి తా నెఱుగనట్లు వాసిచే శివునికిఁ దపోభంగంబుచేయించె.

శాకో—ఆ! ఆ! అంతమట్టుకు నేనువిన్నాఁడను.

పుష్ప—నాటంగోలె పార్వతీబద్ధానురాగుండై నేఁటికి కృతకృత్యుండయ్యె.

శాకో—ఏమి సురేంద్రుని దీర్ఘదర్శిత్వము! వాని యుద్దేశ మింతవఱకు సవ్యమే.

పుష్ప—ముందుగూడ నంతియ. నిస్సందేహము. వెంటనే యీదంపతులకుఁ గుమారోదయ ఫల మున్నదనుకొనుము.

శాకో—అదెవని వశము. (విమర్శించి) ఆ! యుండవచ్చును. వీరియాజ్ఞికుండు వారి యాలోచనంబులోనివాఁడే. కాని తన సృష్టికర్తృత్వచమత్కార మంతయు నిక్కడనే చూపువాడు కావచ్చును.

పుష్ప—(నవ్వి) కావచ్చును, గాని సురేంద్రుఁడు బహు శీఘ్రకారి. యోపిక లేనివాఁడు. తనకార్యంబెప్పుడని కలవరింతలలోనున్న కార్యాతురుండు. శివుని తేజంబువలనఁ బార్వతీ గర్భంబునఁ గుమారోదయమగులోపల, నేమేమి విఘ్నంబు తెచ్చిపెట్టుకొనునో!

శాకో—ఇంతకు వచ్చినదంతకు నాగునా! యది యటుండనిమ్ము. (ఆలోచించి) ఏదో మఱచినట్లున్నారా!

పుష్ప—ఆ! నీవు నన్నడిగినదేదీ?

శాకో—నాకంటె నీవు, నీకంటె నేను, మన ముభయుల మొక్కచోటఁ జేరినాము. నేనడిగినది నాకే జ్ఞప్తికిరాలేదు.

పుష్ప—(ముఖము ప్రక్కకుఁద్రిప్పి యాలోచించి) ఆ! నీయడిగినదే విను. సురేంద్రుని యాలోచన లిట్టివని కింవదంతిచేఁ దారకాసుర సహోదరి యజాముఖి

యనునది పార్వతిని శివునకుఁ గాకుండ జేయఁదలఁచి మాఱువేషంబున హిమాచలేంద్రు నంతి పురి జొచ్చి మేనకాదేవికి శివుని లోపంబు లేమో చెవిలో నూదిపోయినదఁట. యాబిడ యది మనసునఁబెట్టి, తెలియమి, నట్టి దుష్టప్రసంగములించుక చేసినను సంఘట కుంగుడగు వీరియాజ్ఞకునిచే బోధితురాలయి, నూటిగ నడచినవి.

శాకో—సరిసరి. యిదేనిజము. కాని కామాపహారి యయ్యుఁ గామోద్దీపితుం డగు నీ చంద్రకళాలంకారుండు వికసదిందీవరశ్యామాంగియగు నీ శ్యామాలలామతో నిప్పటి నుండియు సరస సల్లాప సహశయనాదులతో వివిధకామోపభోగము లనుభ వించుచు, నుండువాఁడే యనితోఁచుచున్నది.

పుష్ప—(నవ్వి) ఆమాట నిస్సందేహము.

(తెరలో మంగళవాద్యము.)

(ఆలకించి) శివుఁడు పార్వతీసమేతముగ బహువైభవములతోఁ గైలాసంబునకు వచ్చుచున్నట్లున్నాఁడు. మనము పోదముగమ్ము.

(ఇద్దఱు నిష్క్రమించిరి.)

## ద్వితీయ రంగము

### శయ్యాగృహప్రాంగణము.

ప్రవేశము—(అలంకృతవేషములతో శివుఁడు పార్వతి)

శివు—(ఉల్లాసముతో) మన మనసులలోని మనోరథము లెంతకాలమునకు ఫలించెను.

ఉ. సుందరి నన్నుఁజూడు మిటు సుందరమౌ నగుమోము సోయగం
బందఁగనిమ్ము నాకనుల కందముగా నిఁక సిగ్గుచాలు నీ
చంద మెఱుంగనా మనసు చక్కఁగ నాపయినున్నదాన వీ
విందులఁ గంతు సందడుల నిక్కటుపెట్టక నన్ను నేలవే.

పార్వ—చిఱునవ్వు నవ్వుచు నోరకంటఁజూచి)

ఉ. సంగము లెల్లఁ బో విడచి సంయమ శీలముతోడఁ గానలో
భంగములేక కం డ్లడిమిపట్టి తపంబొనరించు వారికీ
యంగజు వెఱ్ఱిచర్యలగునా తగునా మము పోవనేల వ్యా
సంగమకే యకేమటల సల్పుట మంచిది యెంచిచూడఁగన్.

శివు—(నవ్వి) కన్నెత్తి నన్నెత్తిపొడుచుచున్నావా! చంచలాక్షీ! యిటు చూడు, మన మర్మములప్పుడు మనకు బయలు పడక పోయినను నిప్పుడు పూసగూర్చి నట్లు సరిబోవుచునే యున్నవి. నానోఁటఁ జెప్పవలెనా!

పార్వతి—సర్వజ్ఞులయిన వారెన్ని యర్థములైనఁ దీసి పరిపృచ్ఛ లేకపోదురా! యది మగవారికే తగును. మగవారికిఁ దమకు మనసుపుట్టనినాఁడు, చూచి చూడనట్లు, విని విననట్లు, నేతెఁగియెఱుఁగనట్లు, గడపి మనసుపుట్టినా! చూడక పోయినఁ జూచినట్లును, వినకపోయిన వినినట్లు, తెలుఁగకపోయిన తెతెఁగినట్లు, జుట్టుక చుట్టుక తిరుగుట, నైసర్గికమను నీ యనుభవ జ్ఞానమునకు మీరేనిదర్శనము.

చ. మునులని మిమ్ముఁగొల్చునెడ ముందట నన్నిదినంబులుండి న
న్ననవు ఢోరకంటనయినం గన నొల్లక కార్యవాదులై
వినయములాఁడుచుంటి రిటు విస్మయమయ్యెడి నాకునిప్డు మీ
మనమును నమ్మెట్లు నవమన్మథబాణము లెట్లుపోవునో.

శివు—అన్నాళ్లు నాయొద్ద శిశ్రూషఁ జేసి, యిదా నీవు కనుపెట్టినది. ఇంకఁ గొన్నాళ్ళదాఁక నీవు ముద్దరాలవే సుమా!

ఉ. సుందరి నేను యోగమును జూఁపిన నోఁపిన మాత్ర మాత్మలో
సందడినీదె యంతయు ఘనందుగ నా యరకంటిచూడ్కి-నీ
యందఁపు మేనితళ్కు-లనయంబు రయంబున సంగ్రహించె నా
డెందము నాఁటనుండి మరుకీవికిఁ దాఁవిఁక దాళనేర్తునే.

పార్వ—(తలయెత్తితేటిపాఱఁజూచి నవ్వి) ముద్దరాల నగుటం జేసియే కామాపహారులకుఁ గామోపహారంబులు మాయా విహారంబులని కనుగొంటిని.

శివు—(ఆవేగముతో) ఆ! ఆ! ప్రమాదము, ప్రమాదము! పూర్వ సందర్భమింక నీ కెఱుకపడలేదు. వినవలెనంటివా! విను. నీకు దాఁచనేఁటికి బోఁటీ!

పార్వ—కన్నులారఁజూచిన దానికిఁ బ్రమాద మేమున్నది. ఇంకమీరు, పులిమి పుచ్చెఁడు.

శివు—పులిమి పుచ్చుటకు నీవన్యురాలవా! మనకు భేదమేమున్న నాచరిత్ర మొదటినుండియు నీవు వినఁదగినదే. నాఁడు దైవవశమున సతీ వియోగమైనది మొదలు కొంతకాలము సర్వశూన్యముగఁదోఁచి, యంతలో నిక్కడ నీ యవతారంబుఁ బొడగట్టి విరహతాప దోధూయమాన మానసుండనై, నీతండ్రి శీతల స్వభావుండని, నీ తండ్రి తోఁటలోఁ దపంబు నెపంబున, నెళవు చూచుకొని ప్రవేశించితిని. ప్రవేశించిన యొకింత కాలములోనే యదియేమో దైవసంకల్పము, నీవు నాకుఁ బరిచర్య సంకల్పించి వచ్చితివి. రాఁగానే నేనేమైన నీ సంకల్పమునకు వికల్పమెంచితినా? నీచేయు పుష్పానయనాద్యుపచారంబులలో నీ రూపలావణ్యంబులు యోగ సాంప్రదాయాను స్యూతంబులగు మదీయ నేత్రార్ధోన్మీలనంబుల చేతనే నామనసునకుం దగిలి యత్యద్భుతంబులగుటయుఁ దిన్నఁగాఁ గన్నులువిప్పి నిన్నుఁజూచితినా! లేక పలుకరించితినా! లేక చనువుఁ జేసితినా! తల్లిదండ్రుల చాటు దానవు, వెఱుగుపడి, యనుమానపడి మఱిపోదువేమో

యని శంకించి, నివురుగప్పిన నిప్పు చందమున "గిమపినాస్తి" యన్నట్లు పయికినూఁపిరి రానీయక, లోలోపలనే నీమందస్మిత చంచలకటాక్ష హావభావ సౌందర్యాది శృంగార విలాసంబులం దలపోసికొనుచు, నూనశైరెకతాపమున, గ్రుక్కుచుఁ జూచెడి వారలకు మహాయోగివలెఁ గనుపడుచు నిట్లనే కాలంబుగడపినాను. బాల్యవశంబున నా భావంబు గనుపెట్టలేక యప్పటిదంతయు నా యనాదరణంబుగ నెంచితివా! బాలామణీ!

పార్వ— (నవ్వి)

ఉ. నూనశైరెకతాపమున సొక్కుచు నుంటిరిగా పరేంగిత
జ్ఞానము చిన్నదాననగు నాకెటుఁ గల్గును ప్రాణనాథ! యీ
మానము మీనకేతనుని మార్గ్ఖ్యము మీకె యెఱుంగనాను నాఁ
డేను భవత్కటాక్షమునె యెంచుచు మీకడ నుంటి గంటిరే.

శివు—అవును నగకుమారీ! ఈవు మదీయోపచార పారవశ్యంబున నుండు సమయంబున నేను గోప్యముగాఁ గాలక్షేపముఁ జేయుచుండఁగా మందానిల స్యంద నుండు తన సుందర పరాక్రమంబుతో నీకండ్లయెదుటనేకా!

ఉ. కట్టుప కాసుకైవడిని గట్టడలేక దురట్టహాస సం
ఘట్టిత పాదుఁడై కుసుమ కాండములట్టె ధరించి మించి నా
గుట్టును బైట వేయుటకుఁ గొంకక బింకెముఁ జూపెఁగానఁ నా
జెట్టిని బైటి హూపఁడచి చిత్తజుఁ జేసితి మేలు చేసితిఁ.

(పార్వతి సిగ్గు నభినయించుచుఁ గొంచె మావలకుఁబోవ)

తరళవృత్తము.

తలిరుఁబోణిరో కోపమేలనె తాళలేనిటు రావె యో
కలికి చిలుకల కొల్కిరాగదె కౌఁగిఁట న్ననుజేర్పవే
పలుకు బంగరు చేసెదేలనె పల్కరించవె నన్ను నీ
వలపుఁజూపుచుఁ నోరచూఁపుల వాంఛఁ దీర్పవె కోమలీ.

మణిగణనికర వృత్తము.

మదనుఁడు మదమున మదిఁగదలకతా
బదనగు శరములు పలువిధములుగాఁ
బొదలెడు హృదయము పొరిఁ పొరిఁ బొడిగా
పొదలెడుఁ బొలఁతిరో పొలుపుగఁగనవే.

మన మిరువురము నొండొరులపై నిండిన యనురాగములతోఁ దపంబులు చేసిన వారమేగదా! కష్టించి యార్జించుకొన్న తపఃఫలం బనుభవించుటకు నాలశ్యమేల! మరాళగామినీ!

పార్వ—(ముఖము ద్రిప్పి నవ్వుచు నోరకంటఁ జూచి) ఫలంబనుభవించుట యొక్కటికుఁబోవును. తపశ్చర్యాతాత్పర్యంబింకను నభ్యాసపారవశ్యమున స్మృతిపథంబునకు వచ్చినదై యూరకొనదు.

శివు—(నవ్వి) ఓహోహో! నీ యభిప్రాయంబిదా! పూర్ణఫలసిద్ధికిఁగాఁ బునఃకారణాపేక్ష నిష్ప్రయోజనముగాదే! నీకేల సందేహము!

మ. నినునొక్కప్పుడునైన వీడక సదా నీతోడనేయుండి నీ
మనసింపారఁగ సర్వభోగములు సామాన్యంబుగా నేలు న
ట్లనుఁగుం బెండ్లమువంచు నీకిపుడ నాయర్ధాంగమే యిచ్చితిం
గొనుమా! సుందరి రావె చూడుమిట సిగ్గుం జెందకిం పొందవే.

(శివుఁడు పార్వతి హస్తంబు పట్టుకొన్నట్లభినయించుట.)

పార్వ—(ఉల్లాసపడుచు)

చం. పతికనుకూలయైనడచు భామిని కెప్పుడు లోననున్న వాం
ఛితము ఫలించు నింతకును స్త్రీకనురూపవరుండు కావలెఁ
గృతసుకృతంబె మూలము లగించు సమస్తముశస్త్రధీచమ
త్కృతిగల యాఁడుజాతికిది తీరు జగంబున ప్రాణనాయకా.

శివు—(సంతోషముతో) పార్వతీ! యింతటి నుండియు మనకు మనోవాక్కాయ కర్మంబు లీవిధములే! (పరిక్రమించి తనహస్తంబుతోఁ గేళీగృహద్వారంబుఁ దెఱచి)

మ. ఇదిగో! చూడుము కేళికాభవనమో యిందీవరాక్షీ! యదే
యదె జాళ్వాయపరంజి దోమతెఱ పర్యంకంబుపైఁ బూలపా
న్పదె రత్నాల మెఱుంగుఁ దోమినది కుడ్యంబు ల్వినోదంబులౌ
నదె యాలేఖ్యపుఁ దీరుచేరుదుముకొమ్మా! రావె యాసెజ్జకున్.

(పార్వతి చిఱునవ్వు నవ్వుచుఁ దలయెత్తి చూచి లజ్జించుట. చెక్కిలి పుణుకుచు)

ఉ. సిగ్గిఁక నేలనే సుదతి చిత్రవిచిత్రపు సెజ్జమీఁద నీ
వగ్గలు నాకుఁ జూపవలెఁ బంచశిలీముఖుఁ డెంచి చూడఁగా
దిగ్గున రమ్ము నామనసుదీర నురమ్మున రొమ్ము గ్రుమ్మి నీ
యగ్గలమైన మోవిసుధ నానఁగనిమ్ము కరమ్ము నెచ్చెలీ.

(పార్వతిని సందేటం బట్టి నడపించుకొనుచుం గేళీగృహంబులోనికిం గొనిపోయి ద్వారంబుమూయుట.)

## తృతీయరంగము.

### కైలాసప్రాంతము.

(ప్రవేశము:— ఇంద్రుండు, బృహస్పతి;)

ఇంద్రు—(విచారముతో) గురూత్తమా! ప్రశ్నఫలంబు చూడుండు.

బృహ—(విమర్శించి యంగుళిపర్వములు లెక్కించి జుగుప్సతో) సురేంద్రా! తుదకు కార్యమనుకూలమే కాని ప్రశ్నఫల మిప్పుడు ప్రశస్తముగ నుండలేదు.

ఇంద్రు—(ఆశ్చర్యముతో నవ్వి) రెండు నెట్లు జతపడును?

బృహ— ఏమి? నీవడిగినదేమి?

ఇంద్రు— నా యడిగినది యేన వచించినచో మిమ్ముననుగనేల!

బృహ— ప్రత్యుత్తరముగదా నీ కావశ్యకము.

ఇంద్రు— పోనిండు. పెద్దలను విశేషప్రశ్న యీయరాదు. పేరు పెట్టియే యడిగెదను.

కం. హిమగిరినందన కెప్పుడు
విమలంబుగం బుత్రజనన విభవంబగునో
సమముగం జూచి వచింపుము
సుమనో గురువర్య! మనకు శుభము ఘటింపన్.

బృహ— (మఱల విమర్శించి)

చ. సురవర! ప్రశ్నభావమును జూచితి వేచితి శాస్త్రరీతి నా
గిరిసుత గర్భవాసమునం గేవల మాత్మజ లాభ మెప్పుడుం
దిరముగ లేదు లేదు సుమి

ఇంద్రు— (స్వగతము) అయ్యయ్యో! గుండెలు గుభేలుమనిపించిరి. (వినుకుం దలతో ప్రకాశముగా)

తీరిచి చేసిన యత్నమంతతో
నరియగు నట్లె యున్నదిక సారము లే దనవచ్చు దేశికా!

(కొంచె మాలోచించి) తుదకుం గార్యమనుకూలమే యంటి రదేమి?

బృహ— అవును. శివుం డమోఘవీర్యుండు. పార్వతీగర్భంబున గర్భోత్పత్తి యగుటకు విఘ్న మున్నట్లు దోంచుచున్నది.

ఇంద్రు— ఏమీ వా క్చాతుర్యము! వినఁగానే యేడ్పు నవ్వు రెండు నొక్క మాఱే వచ్చుచున్నవి. మీరు త్రికాలజ్ఞులుగదా! యీ సిద్ధాంతము నాఁడే యేల చెప్పకుంటిరి!

బృహ— నాఁ డీ విషయ మడుగలేదు. గతజలసేతుబంధన మేల? మనకు సకల శత్రుసంహారకుండు, విజయలక్ష్మీసమాలింగితుండు, నిరుపమామోఘశక్తి సంపన్నుఁడగు సేనాధిపతి తప్పక రా నున్నవాఁడని ప్రశ్నఫలముసరిగదా! చేసిన ప్రయత్నమునకు సారము లేనట్లున్నదంటివి. విశేషమేమైనఁ గంటివా!

ఇంద్రు— ఇదే విశేషము. వారియాగతి నిర్గతిలేదు.

చ. ఇరువదియైదు వత్సరము లిప్పటికైనవి వారు కేళి మం
దిరమునఁ గేళిశయ్యఁ గరుదెంచిన యప్పటినుండి వారలుం
దిరముగ నుండిరో మఱొక దేశము జొచ్చిరొ యిచ్చ యోడ నీ
సరి కొక వార్తయు న్వినము సర్వము మీ యనినట్లె తోఁచెడిన్.

మనకుఁ దారకాసుర బాధలు పడఁజాలమి దగిన సేనాధిపతి ముఖ్యుండగుటంజేసి నాఁటనుండియు నజాత పుత్రనామకరణంబుతో మరు మరీచికలయందు నీరు ద్రావఁ బోతిమి కట్టా!

బృహ— (కొంచెమాలోచించి) గోప్యస్థాన వృత్తాంతము చారులవల్లమాత్రము తెలియునా!

ఇంద్రు— ఇంతకుముందు మీతోఁ జెప్పనిది యొకటి చేసినాను.

బృహ— (నవ్వి) నీ వూరకొనువాఁడవుకావులే! యేదేది?

ఇంద్రు— అగ్నిదేవుని రహస్యముగాఁబోయి వారి జాడఁ గనుపెట్టి రమ్మని పంపి యతని రాక కెదురుచూచుచు నిక్కడ నున్నాను.

బృహ— బాగుబాగు! సంక్రందనా! యిట్టిపని నీకెట్లుఁ దోఁచె. నతని కేల తోఁచకపోయె?

ఇంద్రు— మిగిలినది. గురువరా! తొంగిచూచి వచ్చుటకే యింత యాలస్యమేమో?

(తెరలో)

కం. పరపురుషులు పరపురుషులు

(ఇద్దఱు వినుట)

ఇంద్రు— అనుకొన్నంతయైనది. (పరిక్రమించుట)

బృహ— (బెదరి బెదరి చూచుచు) నిస్సందేహము. దాంపత్య క్రీడలోనున్న మహాపతివ్రత తన సుఖపారవశ్యమునకు నాతంకము సూచింపుచు ననుకొన్న వాక్యముగా నున్నయది.

(మఱలఁ దెరలో)

కరుణింపుము శరణు శరణు.

(ఇద్దఱును వినుట)

ఇంద్రు— అగ్నిదేవుని యార్తవాక్యముగా నున్నది. ఆ దంపతులచేత బట్టు పడినట్లున్నాఁడు.

బృహ— ఆహా! సన్సందేహము.

(మఱలఁ దెఱలో)

కామక్రీడా;

శరణముఁ జొచ్చితి వేఁటికి

(ఇద్దఱును వినుట)

ఇంద్రు— మహాభాగిని కోపసంరంభముతో నడిఁగిన వాక్యము సుమా! యగ్ని దేవుని ప్రాణములు పోయినట్లుండవలెఁ బాపము.

బృహ— ఇతని నోఁట నేమి దుముకునో లలాటలోచనుని యర్ధాంగముఁ గైకొన్న సాధ్వీమణిచేతఁ జిక్కినాఁడు.

(మఱలఁ దెఱలో)

సురపతి ననుఁ బనుపనిటకుఁ జొచ్చితి జననీ.

(ఇద్దఱును వినుట)

ఇంద్రు— (భయపడుచు) అ! ఆ! ఆ! అపరాధమునకున్న మూలము బయటఁ బెట్టినాడు.

బృహ— ఇంద్రా! యితఁడు మన్మథునివంటి వాఁడనుకొంటివా! యాత్ర యామఁడుగాఁడా!

ఇంద్రు— పంపిన కార్యము కట్టెక్కించెను. గాని యిక్కడ నక్కడ నోరు మెదల్చెనా!

బృహ— ఆ! అనుకొంటివా! నాఁడు ప్రశ్నావకాశమే లేకపోయినది. యెప్పుడు నొక్క తీరగునా!

(మఱలఁ దెఱలో)

మ. అగరాజాత్మజవల్లఁ గాఁదగిన కార్యంబట్లుఁ గాకుండ న
న్నగభిన్ముఖ్యులు నిన్నుఁ బంపుటయు విఘ్నంబయ్యె నీ విద్యోదం
దగు శ్రద్ధాళుఁడవై యమోఘునుగు సిద్ధామంబుఁ గొంపోయి యి
మ్ముగ సాధింపుము దేవకార్య మిఁక నీ బుద్ధి న్నుర ల్మెచ్చఁగన్.

(ఇద్దఱు నాలకించుట)

ఇంద్రు— (ముఖవికాసముతో) ఇది యీశ్వరుని వాక్యముగ వినవచ్చుచున్న యది.

బృహ— అవును సురేంద్రా! యింత్రమాత్ర మిది కీడులో మేలు.

(మఱలఁ దెలిలో)

మ. పతిసంయోగ సుఖైక వేద్యమగు గర్భం బిప్డు నా గర్భమం
దతుకం జొచ్చెడి వేళనయ్యె దిటు వమ్మౌనట్లు లింద్రాదు లీ
గతి భంగించిరి గాన నాకువలె నింక న్నీరి పూఁబోండ్లకు
న్వితథంబై చెడుగాత గర్భకలనా విఖ్యాతి నిర్భాగ్యతన్.

(ఇద్దఱు నాలకించుట)

ఇంద్రు— (భయపడుచు) మహాత్మా! మహాపతివ్రతయగు పార్వతి శాపాక్షరంబులు మనల నెల్లర సుడివెట్టినవి. తా నొకఁటి తలఁచె దైవ మొకఁటి తలఁచె నన్నట్లైనవి మన బ్రతుకులు.

బృహ— ఇప్పుఁ డనుకొని లాభ మేమి? యవిచార్యకరణము తలఁచుగ ననర్థకారణము. నీ కొక్కింత యోఁపిక లేకపోయె పోనిమ్ము మనపయి నింతకుఁ బరమేశ్వరానుగ్రహము ప్రసరించినది.

ఇంద్రు— ఆచార్య! శంకరవాక్యము మనకుఁ గర్ణరసాయన మైనప్పటినుండి మఱొక్క విచారము బాధించుచున్నయది.

చ. భువి ననలుండు దీనిఁ గొనిపోయిన లాభ మదెట్లు పుత్రసం
భవమున కాస్పదంబగునె పాయక యెంతె యమోఘమైన శాం
భవమగు తేజ మొక్కఁటియె పావకుఁడింతట నెట్లుపోవునో
దివిజుల కార్యమెట్లగునొ! తిన్నఁగఁ గ్రమ్మరఁ బ్రశ్నఁ జూడుమా.

ఇంక నీవు ధైర్యస్థైర్యములతో నుండుము.

బృహ— (నవ్వి) శచీసహచరా! రక్కసులుచేయు నిక్కట్లు లొక్కొక్కటి తలఁపున కెక్కుటం జేసి, చెప్పినదియు విన్నదియుఁగూడ, నెక్కుటకవకాశము లేక పోవుచున్నది. (మఱలఁ గొంచెము విమర్శించి) చెప్పినది చెప్పినదే.

చ. హరునకు మూర్తులెన్మి దనయందు కృశానుఁడు వానిలోన నొ
క్కరుఁడగుటం జనం గలిగెఁ గామహరైక విహారసీమకుం
దిరమగునట్టి తేజుఁగొని ధీరత నేఁగి యతండు జాహ్నవీ
వరతటరూఢ పుల్ల శరవాటిక నేదొ యుపాయ మెంచెడిన్.

ఇంద్రు—

చ. సరియగుఁగాని యీ మన కృశానుఁడు కార్యధురీణుఁ డిప్పు డీ
తెరవున వచ్చుదాక నిటఁ ద్రిమ్మరుచుందము వాని ఛందమిం
దరయఁగ మేలుగాదె

బృహ— యిదియీ మది యాతుదియీసనొచ్చఁగా
నరిగెనువానిఁ జూడ సమయంబు ఘనంబుగఁ జూత మావలన్.

ఇంక నిక్కడ మనము విశ్రమించుట కార్యంబుకాదు.

(ఇద్దఱు నిష్క్రమించుట.)

## చతుర రంగము

### గంగాతీరము

### ప్రవేశము — అగ్ని దేవుఁడు.

అగ్ని— (ఉల్లాసముతో) పదిమందిలోఁ దిరిగి యెంతకాలమైనది. నేఁటికిగదా ప్రజల ముఖములు చూడఁగంటి. నింతవఱకు నాపూర్వపుణ్యము మంచిది! (తనలో) దేవేంద్రసభలో మాఁటదక్కించుకొన్న లోకోపకారుండనైతి. (తనలోఁ దానే నవ్వుకొని)

మ. కలనైన న్మదినైనఁ గన్గొనని యిక్కష్టార నాపాల న
గ్గలమై పైఁబడనాఁటనుండియును స్రుక్కంజొచ్చి యీనాఁడు వే
లలియు క్తిన్ గొని మిండగర్భమును మూలందించుకొన్నట్లు నా
తలపై బర్నువదల్చికొంటిని జమత్కారంబుగా నియ్యెడన్.

అహాహా! నాయంతవాఁడున్నాఁడా! సుమనశ్చక్రవర్తికి నాజ్ఞాపర్తినైతి. నయ్యర్ధాంగ దంపతుల యనుగ్రహంబునకుఁ బాత్రుండనైతి. దేవకార్యంబు నమరించిన వాఁడనైతి. నా వినయ సహనంబులే నన్ను గాచినవి (ముందుఁ బాఱఁజూచి) ఓహో హో! నారద మునీంద్రుఁడువలె నున్నాఁడు.

(నారదుఁడు ప్రవేశము)

నార:—(అద్భుతపడుచు తొందర నభినయించుచు)

శా. ఏమేమీయనలా! బలారికి బలా యేమాయె నీమాయ వ్యా
యామంబాసుర కార్య సంఘటన మెట్లార్జించి తీవిప్పుఁడీ
వేమోయంటివి నాచెవిం బడినదేమీ మున్న యేవింటి నీ
కామాటంబు సమస్తము స్సఫలమా కాదా నిజంబాఁడుమా.

అగ్ని:—(నమస్కరించి నవ్వుచు)

మహాస్రగ్ధరా వృత్తము.

మునినాథా! మీప్రసాదంబున నిపుడఖిలంబుఁ సమర్థించినాఁడ
న్ఘన గంగాతీరభూమిం గల శరవణ భాగంబునం గార్తికేయుం
డనఁ బుట్టెంబో కుమారుండలఘుఘటితా భ్యుగ్రపూర్ణోగ్రతేజం
బున నిద్ధే దేవసైన్యంబున కధిపతియై పొల్చు తేజస్వి చూవే.

మహాస్రగ్ధరా వృత్తము.

నార:—

సురసేనన్నాచువాఁడీ సుతుఁడె యహహా యాశూరపద్మాది నక్తం
చరచంచత్ప్రాణికోటి న్సమరమున మహాశక్తి సంయుక్తుఁడై వి
దృఢమవ్యత్తీవ్ర ఘోరాశుగముల గొదవుం జోద్యమానట్లు నేనీ
దురమందుం బొట్ట నిండింతును గనుల లరింతున్ప్రనోదింతు నాత్మన్॥

(ప్రకాశముగా) అగ్నిదేవా! యీకుమారుఁడు కార్తికేయుండనఁ దగునంటివదెట్లు.

అగ్ని:—మహాత్మా! నా పడిన పాట్లేమని చెప్పుదు. లలాటంతప సహస్ర సహస్ర కిరణప్రభా భాసమానంబగు గంగాధరుని ధాతుసార పూరంబు మోసి మోసి మోయుట దుర్ఘటంబగుటయుఁ జింతాడోలాందోళిత మానసుండనయి, కించిత్తాపోప శాంతికై యీగంగాతీరంబున, విశ్రమించు నంతలో, దినదినంబు నుషఃకాలంబులఁ బత్యనుష్ఠానానురూపతీర సమాగయనాగమి తీర్థంబున కరుదెంచెడి సప్తర్షి సహధర్మిణులఁ గాంచి మత్సంభృతంబగు నమోఘశాంభవతేజఃపుంజంబునకుఁ బాత్రులఁ గావించి కృతార్థుఁడ నగుటకుఁ బ్రయత్నించు నాసంకల్పంబు పొడగట్టుటయు నాసహధర్మిణియగు స్వాహాసతి యదిధర్మంబుగామి నన్నేమియు నననేరక నా కెఱుకపడకుండునటుల నామనోరథంబు నెఱవేర్చుటకు నొక్కింత యంధకారబంధురంబగు నేఁటి ప్రత్యూషంబున నయ్యేడ్వురిలోన నయ్యరుంధతి రూపంబుతనకుఁ గొన సాధ్యంబు గామిఁ దక్కుంగల యార్వురి రూపంబులు కృత్తికాభిఖ్యలతోఁ దాన ధరించి నా చెంగట కరుదెంచినదఁట.

నార:—అహాహా! ధర్మహాని లేకుండఁ బతి సంకల్ప సఫలీ కరణమందుఁ గృత ప్రయత్నురాలయినది. పాతివ్రత్య లక్షణంబు లిట్టివసుమా! తరువాత! తరువాత!

అగ్ని:—నేను నరయక యనతిదూరంబున నావెలుంగుఁగని శీతబాధాపనయనార్థమై వచ్చిన యాసుదతులేయని యయ్యార్వురి గర్భగోళంబుల మదీయ సుహృత్సాహాయ్యంబుకతంబున నదియ విజ్ఞయంబుగ సమభాగంబులుగఁ బ్రసరింపఁజేసి ధన్యుండనై వెంటనే దృష్టిగోచరుండనుగాక పోవుటయు వారు వేఱుచేయునదిలేక సద్యోగర్భధారిణులై నిర్భరాద్భుత విపరీతలై యటునిటుఁ దిరుగుచు నయ్యంతికంబున నున్న శరవణంబున నార్వుఱు మగ శిశువులఁ బ్రసవించి చనిరి. అప్పట్టున నయ్యార్వుఱు

మగబిడ్డలు భూపతనమైనతోడనే గంగాతరంగ శీకర శీతలనమీరాంకురంబు సోకుటయు, షణ్ముఖంబులతో యొక దొడ్డ మగబిడ్డగాఁ బరిణమించిరి. యా సుకుమారుండగు కుమారుండివ్విగ్రహంబున షట్కృత్తికల కుదయించుటంజేసి కార్తికేయుఁడనంబడి మహానుభావుండై యాశరవణంబున విహరింపు చున్నవాఁడు.

నార:—(ఆశ్చర్యముతో) అగ్నీ! యిది నిజసతీకృత్యమని తరువాత వింటివా?

అగ్ని—అవును.

నార—(జుగుప్సతో) అవునుగాని యాదొడ్డ యిల్లాండ్రకు నపవాద మూలము సుమా!

అగ్ని—అదియు నిజమే.

నార—వాయుసఖా! యుపకారంబునకుఁబోవ నపకారంబు వెంటఁబడె. నీచేసిన కార్యంబులు రెండునూ రెండే. తగిన నిష్కృతి చేసికొంటివా!

అగ్ని—(లజ్జతోఁ దలవంచుకొని) లోకోపకారార్థము ప్రవర్తించిన దానికేమి. అందుఁ దొంటిదానికి జగజ్జనని యిచ్చిన శాపంబనుభవించుటయే!

నార—అదిగూడనా!

అగ్ని—"నదుఃఖం బహుభిస్సహ" యని దాన నాకు విచారంబు లేదు.

నార—సరి యా రెండవదో?

అగ్ని—అదియు వాస్తవంబే. అపవాద దోషంబులకునోడి తమభర్తలు తమ్ము విడుచుటయు, నయ్యార్యులు మునిపత్నులు నగతికులై వచ్చి, యక్కుమారునితో మొఱపెట్టుకొనిరి.

నార—అంతకంటె చేయునది యేమున్నయది. తరువాత, తరువాత!

అగ్ని—నేనొక ప్రక్కనుండి వింటిఁ నేను. కృత్తికానామంబుతోడఁ బాతివ్రత్య భంగంబు లేకుండ నత్పథంబునఁ బ్రవర్తించునట్లు లట్టి షట్కృత్తికలకు వరంబిచ్చెడిచో నక్కుమారుండు ప్రక్కనుండెడి నన్నుంగనుంగొని తారకుండగు నగ్నిదేవునకు శుచినామధేయంబు సార్థకమై చెల్లుఁగావుతమని విధించియున్నాఁడు నాకేమి.

నార—తథాస్తు. తథాస్తు. అగ్నిదేవా!

విను. నిన్న నేను కైలాసంబునకుంబోయి పరమేశ్వరునితో ముచ్చటించువేళ, హైమవతి లోకజనని విచారంబుతో నున్నటుల నాకుఁ దోఁచినది. యిప్పుడీ కుమారసంభవ మహోత్సవంబు నేన యాజననీజనకులకు నింద్రాదులకుంజెప్పి శ్రవణానందంబుఁ గావింపఁ బోవుచున్నాఁడను.

అగ్ని—మహాత్మా! కరుణాంతరంగితాంతరంగులగు పార్వతీపరమేశ్వరులును నింద్రాదులు మీముఖంబునఁ గుమారసంభవంబు విన్నతోఁడనే పరమ సంతోషముతో నిక్కడకు రాఁగలరు.

(నారదుఁడు నారాయణస్మరణముఁ జేయుచు వెడలును.)

అగ్ని—అంతటుఁ జేరునందాఁకనేనుఁ గుమారు సన్నిధి నుండెదను.

(అగ్ని నిష్క్రమించుట.)

## పంచమరంగము

### శరవణము

ప్రవేశము:—క్రీడావినోదములతో షణ్ముఖ కుమారుఁడు. వినోదముఁ జూచుచునొక ప్రక్క నగ్నిదేవుఁడు;

కుమారస్వామి.—

ఉ. కంతుకలీల నీపృథు నగంబులఁ బట్టి పెకల్చి చేతుల
న్వింతగఁ ద్రిప్పి పైకెగురఁవేయనె ! క్రమ్మఱఁ బట్టివేయనే !
గంతు లజాండ వీథుల నెగంబడి వేయనె నేల నింగి నొ
క్కింతగ దాళమేయనె యథేచ్ఛము నా కెదురెవ్వ రింకిటన్.

సీ. రవిచంద్ర బింబంబు లవలీలఁగొని కర్ణ
కుండలంబులుగఁ గైకొనఁగ లేనె
దివిఁ గ్రాలు తారాళి ధృవనాయకముగాఁగఁ
గొని హారముగ వేసికొనఁగ లేనె
కరముల హరిదంత కరిదంతములబీఁకి
నింగికిఁబోఁటీలు నిలుపలేనె
శరనిధులేడింటి జంకతాళిగఁ దాల్చి
దుష్టదానవకోటిఁ దునుమలేనె

తే. గీ. బుధుల నెల్లర నేలి నాభుజముక్రింద
జడుపు దీరిచి పేరిచి నడుపలేనె
కడిఁది యొకయేఁటునని పెద్దగట్టునెన
బిట్టునడతూఁటు వోవంగఁ గొట్టలేనె.

తే. గీ. నడిమిద్రవేళ్ళను గాండంబు లొడిసిపట్టి
తవిలిమీఁటుచు నొండొంటి దాఁకి బెదరి
దొరలి పడునట్లు మాఁటికిఁ ద్రోసి ద్రోసి
యాడకే గోళక క్రీడ లాఁడలేనె.

(ఒక ప్రక్కనుండి దేవేంద్రుఁడు ప్రవేశించుట)

ఇంద్రు:— (స్వగతము నాశ్చర్యము) ఆహాహా! యేమి! యీకుమారుని ధైర్య స్థైర్యములు. బాల్యదశలోనే యనేకకోటి బ్రహ్మాండములనైన నొక్క పిడికిటం బట్టి నలిపివేయునట్లున్నాఁడు. ఫాలాక్షుని తేజఃప్రభావంబునకుఁ గొంతయేమి! లోకోద్ధారకుఁడే. (అగ్ని యింద్రునియొద్దకువచ్చి)

అగ్ని—(నవ్వుచు జనాంతికము) మన సంకల్పము నేఁటికి ఫలించినది. కష్టములు తీరినవి.

ఇంద్రు—అగ్నిదేవా! తుదకు నీశ్రమకు మూలమే నైతిగదా!

అగ్ని—ఆదేమి! కష్టసుఖములలో మనమందఱము సమాన ఫలభాక్కులమే.

ఇంద్రు— మహాతేజఃపుంజము నీవొక్కింతకాలమెట్లుభరించితో నీకేతగును.

అగ్ని—అంతయు నప్పరమేశ్వరానుగ్రహమే. యీచిన్నవాఁడు విన్నక్షణమే ప్రపంచ కంటకోత్పాటనంబుఁ జేయువాఁడు సుమా!

ఇంద్రు—అసాధారణ ప్రజ్ఞాసామర్థ్యములను రూపసౌష్ఠవమె వాక్రుచ్చు చున్నవి. గాని వీని మాతాపితృలు వీనిఁజూచుటకింక రాలేదా, వినలేదా!

అగ్ని—త్రిలోక సంచారి కలహాశనుండు కుమారసంభవోత్సవము ముందుగ వారికి విన్నవించియే మీసన్నిధికి వచ్చియుండును.

ఇంద్రు—(స్మృతి నభినయించి) ఆ! వాస్తవమే యవును. వచ్చుచుండవలెను.

(ఒకప్రక్కనుండి పార్వతీసహితుఁడై శివుఁడు ప్రవేశించుట)

శివు—(తీవ్రకుతూహలముతో తొందరపడుచు)

ఉ. ఎక్కడ నాకుమారుఁడిపు డెక్కడ నొక్కఁడు బిక్కుమంచుఁ దా
దిక్కెడఁబాసి నట్టకట తీవ్రశరాటవిఁ బుట్టినాఁడె వాఁ
డెక్కడ నేది యీస్థల మిదేనొ యదేనొ యెఱుంగనైతి

(పరిక్రమించి) నీ
(పక్కన యేమొ) (పారఁజూచుట)

పార్వ—(ముందుకునడచి)

వీఁడె మనపాలిటి నోల్లిఁటి భాగ్యరాశిగా
జిక్కెను వీఁడె కుఱ్ఱఁడల చెక్కిలి ముద్దిడి చేర్తునక్కునన్.

(పరగు నభినయించుచు చేతులుసాచి)

తే. రారనాతండ్రి! సుకుమార! రారధీర!
శూర! కనులార ముద్దులు చూపరార!

యారుమోముల నాచిన్ని యయ్యారార !
నాదుసందిట నొకమారు ననుపుఁ గొనర .

(కౌఁగిలించుకొని సందిఁటనెత్తుకొని యక్కునఁజేర్చి చెక్కిలి ముద్దుపెట్టుకొని)

మహాస్రగ్ధరావృత్తము.

కనులంగన్నయ్యవైతో కడుపునను గనంగా నెటునోచనైతి
న్నినునేఁగండ్లార నెంతో నెనరునఁగనుచు న్నిచ్చలుంబ్రొద్దుపుత్తు
న్నను మన్నం బుట్టినావే నయముగ సురలం దన్పగాఁ బుట్టినావే
జనకుం డీ దేవుఁగంటే శరణనుచు నమస్కారముం బెట్టుతండ్రీ.

(దించి ఫలమియ్యఁగా గ్రహించి కుమారుఁడు తల్లిదండ్రులకు నమస్కరించుట)

శివు— (కుమారు నెత్తికొని స్వగతము)

చం. సిరిగల లాభమేమియును జెందఁడు పుత్రుఁడు లేని వాఁడు సుం
దర సుతవక్త్రదర్శన సుధారసమబ్బుట యెంతవానికో
చిరకృత పుణ్యమి ట్లహహ చిన్నికుమారుఁడుగా ఫలించె నా
కరయ నిఁకేమి కావలె సుతాదరణంబుల బ్రొద్దుపుచ్చెదన్.

(ప్రకాశము కుమారునితో)

ఉ. ముద్దుల చిన్నితండ్రి నవమోహనగాత్ర కుమార ! యేర నీ
సుద్దులు నాదువీనులకుఁ జొక్కముగా వినుపింపవేమి నీ
యొద్దనె యమ్మ యల్లదుగొ యున్నది యుల్లము పల్లవింప నీ
విద్దెలు మాకుఁ జూపవలె వీరగుణంబుల వీరురంజిలన్.

(దించి ఫలమియ్యగా గ్రహించుట)

(భృంగి ప్రవేశము)

భృంగి—శంకరా ! నిష్కళంక సంపాదిత తపఃపరిపాకంబుగదా కుమారముఖ సందర్శనోత్సవము. నా మనోరథము సఫలమైనది.

కుమా— (హస్తముతోఁజూపుచు) జనకా ! వీరంద ఱెవరు ?

శివు— పుత్రకా ! (అగ్నినిజూపుచు) ఇతఁడు నీ జననోత్సవమునకుం బహు భారవాహకుండు సుమా ! అగ్నిదేవుఁడు.

కుమా— ఎఱుఁగుదును. (నమస్కరించుట.)

శివు— (భృంగి జూపుచు) ఇతఁడు మనకుఁ బరిచారకుఁడు మనోవినోదకుఁడు పరమాప్తుఁడు భృంగి యనువాఁడు. (ఇంద్రుని జూపుచు) ఇతఁడు త్రయ స్త్రింశ

క్కోటి దేవాద్యక్షుండగు స్వర్గలోక నాథుఁడు మహేంద్రుండు. మన యెడ వినయ విధేయతలతో నుండువాఁడు. మన మేలుఁ గోరినవాఁడు. మన కాదరణీయుఁడు.

ఇంద్రు— (నమస్కరించి) మహాదేవా! దేవా! తారకుండు, దేవసామ్రాజ్యాపహారుండు, నిర్మల ధర్మకర్మ నిర్మూలన కారకుండునై మమ్ముఁ బెక్కిడుముల ముంచుచున్నాఁడు. మాకుందరికి సైన్యాధిపతి లేకుండుటంజేసి వాని లోకకంటకవృత్తి నిరాతంకముగాఁ బ్రబలుచున్నయది. మహాత్మా! చంద్రోదయమునకుఁ జకోరములవలె మేమందఱము భవత్కుమారోదయమున కెదురు చూచుచున్నారము. కరుణించి మా దైన్యముం బాపుము! పరమేశ్వరా.

శివు— (నవ్వి కుమారునతో) అవును! కుమారా! మాకుఁ గుమారుండవై కుమారుండు కుమారుఁడని యందఱి నోళ్లం బిలువఁబడితివి. గానఁ గుమారుండనఁదగి, యగ్నిసంభృతుండవు గాన నగ్నిసంభవుండనఁదగి, గంగాతీరమం దుద్భవిల్లుటంజేసి గాంగేయుఁడనఁదగి, శరవణసీమఁ బుట్టుటంజేసిఁ శరజన్ముండనఁదగి పుత్రభావంబునఁ బార్వతి నానంద పెట్టితివి గానఁ బార్వతీ నందనుండనఁదగి పెక్కు నామంబుల నుక్కుమిగిలితివి. పుత్రకా! యిఁక దేవసేనాధిపత్యంబునకుఁ బట్టభద్రుండవై మహాసేనుండు సేనాని యనఁదగి సార్థకనామధేయుండవై విజయంబుగొని యాసంక్రందనాదుల నానందాబ్ధి నోలలాడించుటయే ప్రకృత కార్యము

కుమార— జనకా! వీరికట్టి యిక్కట్టులేల రావలె! మీరట్టి ఖలున కట్టి వరంబు లీయనేల? తారకుండన నెవండు! మీ రట్టి కుటిలాత్ము నేల నేలవలె.

శివు—తండ్రీ! వజ్రాంగివజ్రాంగుల కుదయించిన వాఁడు. తారకుఁడను దైత్యచక్రవర్తి నిరంతర నిరుపమాన మదీయాఖండ మానసిక సపర్యా పర్యాప్తచర్యాప్తుండయ్యుఁ దొల్లి మత్ప్రసాదార్థమై యుగ్రతపంబొనర్చుటయు హానియభీష్టం బనుసరించి యట్టివరంబు లీయవలసి వచ్చినవి. తదనంతర మయ్యసురుం డిట్టిట్టివనరాని యిక్కట్టులు పెట్టుట వాస్తవమే! వాఁడింతకు ననితరసాధ్యుఁడు "విషవృక్షోపి సంవర్ధ్య స్వయంచ్ఛేత్తుమసాంప్రతి" మ్మని వాఁడెట్టి వాఁడైన నా కుపేక్షణీయుఁడు.

కుమా—(అట్టహాసంబుఁ జేసి) వాఁ డెంతవాఁడైననేమి తండ్రీ! మీ యాజ్ఞా వశంబున నాకట్టి శక్తి రాకున్నే!

పార్వ—కుమారా!

చ. భవునకు నీవు పుత్రుఁడవు భక్తుఁడు వాఁ డరయంగ నిద్దఱుం
గవలనవచ్చు నీకుఁ గదనంబున సాధ్యుఁడు గాఁడు గాని శాం
భవియగు ప్రాణశక్తిఁ గొని పాయక తాకితివేని దాని వై
భవమును దూరెనా యపుడు వాఁ డని సాధ్యుఁడు నీకు నయ్యెడన్.

గాన నీజనకుని వలన నా చెప్పిన శక్తి నడిగి కైకొని విజయముఁ గైకొనుము.

కుమా—(చిఱునవ్వు నవ్వుచు) ఏమితండ్రీ! మాజనని చెప్పినదేమిటి?

శివు—కుమారా! వాస్తవము. తొల్లి వరప్రదాన సమయంబున వానికి కోరిన వరంబులన్నియు నిచ్చి మదీయశక్తి కవిధేయత యెప్పుడు చూపెద నప్పుడదియు నీ యవసానంబని పరమావధి విధించితిని. వాఁడు నిప్పుడు మదోన్మత్తుండై మఱచిన వాఁడు. నీకు విజయము కరస్థము సుమా! ఇదిగో శక్తినిచ్చుచున్నాను. (శివుఁడు శక్తినిచ్చుట.)

కుమా—(అది గ్రహించి యింద్రునితో) ఏమి! యమరనాథా! నీయభిప్రాయ మేమి?

ఇంద్రు—మహానుభావా! దేవ సేనాధిపత్యంబున నిన్నుఁ బట్టంబుఁ గట్టుచున్నాను. బృందారక బృందంబుల నీ భుజచ్ఛాయను నిలిపి జయలక్ష్మిఁ గొనుము. ఇదియె సైన్యాధిపత్యసూచకము. (పారిజాతపుష్పమాల కుమారుని కంఠమందు వేయుట)

కుమా—(అట్టహాసంబునలేచి)

మ. బలభిన్ముఖ్య చమూ సమూహకలిత ప్రారంభ సంరంభ పు
ష్కలధాటీ జరఠీ కృతారి జయటీకాకృద్ధనుష్టంక్రియో
చ్చలితాంభోజ భవాండకోటి ఘటిత శ్లాఘోల్ల సన్మద్భుజా
బలవహ్నిం బడ రే పతంగగతి దేవద్వేషు లోకుక్కుమ్మడిక్.

భృంగి—(ఇంద్రునితో) మీ యదృష్టము నేటికిఁ బరిపక్వమయినది. ఇంత మాత్రము ధైర్యం బెప్పుడైన నెవ్వఁడైనఁ జెప్పినవాఁడున్నాఁడా!

కుమా—

మ. తనకౌటిల్యము గాననీక తొలుదొల్తం దేవతాకోటితో
నెనరుంజూపుచు వారి సంపదలొగిన్ని శ్శేషమౌనట్లు దోఁ
చిన కష్టాత్ముఁడు దండనీయుఁడల దుశ్శీలుం డఖండోగ్ర భం
డన భూమిం దెగకుండునే మదురుకాండచ్ఛిన్న భిన్నాత్ముఁడై.

భృంగి—(ఇంద్రునితో) వింటివా! ఇఁక నెప్పటికి శివాభీష్టంబుగాని కార్యం బునకు బోఁజూడకుఁడు.

కుమా—

సీ. నన్నుఁదాకి నిలలేక తనయేలుబడినున్న
బ్రహ్మాండములఁ దూరి పరచెనేని
సారిదినొక్కొకదాని చుట్టునొక్కొకటిగా
శరపంజరముగట్టి చలముపట్టి

పలుమాయ నెన్నిరూపములెత్తు నన్నిఁటి
కన్నిరూపములేను నమరఁదాల్చి
పటుఘోర శస్త్రాస్త్ర పటలముద్భటలీల
దుమికించి హృదయంబు దునిసిపడఁగ

పుత్ర మిత్రాది యుతముగాఁ బూర్వదేవ
చక్రవర్తిని సమవర్తి సవిధవర్తి
గానొనర్చెదఁ బేర్చెదఁ గదనభూమి
భూతభేతాళకోటికి భోజనములు.

చ. భయమిఁక లేదు మీ కమరపాలక మత్కరచాపముక్త దు
ర్జయ నిశితాశుగప్రకర చంక్రమణంబులు సంక్రమింప ని
శ్చయముగ దుశ్చరిత్రకులు చక్రగతి క్రమవక్రవిక్రమ
వ్యయహతులై యమాస్యమున వ్రాలరె తూలరె తూలకాకృతిన్.

చ. హరుకృప నిట్టునేను నిబిడౌజుఁడనైతి బిడౌజ మద్భుజా
పరిణతభూరిశక్తి నిరుపద్రవమై జయముద్రదాల్చు దు
ష్కరమరయంగ నిక్కరణి కల్మష కిల్బిష వృత్తిమత్త దు
శ్చతురినకుం బ్రభుత్వముఖశక్తి సమత్వ మొనర్పఁజాలమిన్.

వస్తుశక్తి యొక్కొక్కనాఁడు పార్థక్య సమ్మేళంబులచే సార్థక్యంబు నొందుచు విలక్షణ రూపానుసంధానంబుల వెలుంగుచునుటకు దార్కాణముగాఁ బ్రజాశక్తి ప్రభుశక్తు లొక్కొక్కతఱి నాత్మీయాంగ సౌష్ఠవంబులచే నొండొరుల రూపడంచుటకు గండుమిగిలి యాయత్తపడు నందు ధర్మానుబద్ధ విజయంబు లొక్కపక్షంబున దేశకాల వైలక్షణ్యంబులచే నోలలాడుచుండుట వాస్తవంబు.

భృంగి—(ఇంద్రునితో) ఇంద్రా! నిగ్రహించువాఁడె యనుగ్రహించువాఁడు జ్ఞప్తికివచ్చినదా. ఇదంతయు మా యీశ్వరుని కటాక్షమే. ముందైననెన్నఁటికి మా యీశ్వరకుమారుని యాజ్ఞకు భిన్నముగా నడువకుఁడు.

కుమార—మహేంద్రా! యేను యుగవిగమచిత్రభాను ప్రభాభాసమానుండనై యనేకాదిత్య వ్యూహంబులు సామంతంబులై తోడనడువఁగ రవిజృంభణంబులచే శరసారంబులు గురియింపుచుండ శత్రులు రూపులు మాయకుందునా ?

## తరళవృత్తము

శివకుమారుఁడ నేఁగుమారుఁడ జిత్రయుద్ధములోన దా
నవపతిం బరిమార్చనే భువనంబుఁ జక్కఁగఁ బేర్చనే
యవనిభారము రూపడంచి యనర్ఘకీర్తులమించి యీ
దివిజసైన్య మనన్య దుర్ఘట తీవ్రపద్ధతిఁ గూర్చనే.

(భరతవాక్యము)

చ. జయము జయంబు పో మనకుఁ జంద్రకిరీటు ననుగ్రహంబున
న్భయము దొలంగిపోవు నిరుపద్రవ సౌఖ్యము లెల్లకాల మ
క్షయముగఁ గల్గు మామక భుజా పరిజృంభణ సంభ్రమంబులన్
జయము జయంబు శత్రుకుల సంహరణైక మహోత్సవంబగున్ !

## మంగళమహాశ్రీ వృత్తము

శ్రీలలరు లోకమున శీలములు కాలములు శీతళము లౌచునిఁక
నుండుం

గూలుతుఁ నుగ్రూరులను గూరుతును గోరుకలనుకూలముగు నన్ని
యును మీకు

న్మేలగును నేనెలమి మీబలము నేలెదనుమిన్నుసిగమంగళ
మహా శ్రీ

లోలినిడుఁ బోలనిల నుల్లములు పల్లవిల
నుల్లసిలు సంపదలు మెచ్చన్.

శివు:—మనమందఱము పరమ సంతోషములతో గృహంబులకుఁ బోదము.

(అందఱునిష్క్రమింతురు.)

గద్య: ఇది శ్రీ తర్కవేదాంతాది సకలతంత్రస్వతంత్ర శ్రీమ దనుగమభట్టాచార్యాది
ప్రసిద్ధబిరుదాంకిత శ్రీమ దభినవగౌతమావతార శ్రీ కురుగంటి వెంకట్రామశాస్త్రి
కంఠీరవ పౌత్ర శ్రీ కురుగంట్యప్పయ్యశాస్త్రిపుత్ర శ్రీ వెంకమాంబికా సతీతిలక
గర్భశుక్తి ముక్తాయమాన శ్రీ హరితసగోత్రపవిత్ర శ్రీమ దుభయభాషా
భూషాయమాన లలితకవితాధారా ధారాళ యశోవిశాల సహజపాండిత్య
సాహిత్య శ్రీ బాలాత్రిపురసుందరీవరప్రసన్న బుధజనవిధేయ శ్రీ కురు
గంటి సూర్యనారాయణశాస్త్రి నామధేయ ప్రణీతంబులగు
సత్కృతులలో నగ్రగణ్యంబగు కుమారసంభవ నాటకంబునఁ
షష్ఠాంకము సమగ్రము.

